# 1

కాలానికి రెక్కలు ఉన్నాయంటారు, నిజమేకావచ్చు. లేకపోతే సరిగా వేసవిసెలవులు యిచ్చారో లేదో అప్పుడే ఆఖరవడమేమిటి! సెలవల్లోనైనా కాస్త కనికరించి నెమ్మదిగా కదిలితే ఏంపోతుందో - కాలానికి. మళ్ళీ బడి తయారు: వెధవది, పిల్లలను సరదాగా, స్వేచ్ఛగా కాలక్షేపంచేయనీదు. అబ్బ! సెలవులు. ఆ మాట వింటూంటేనే ఎంతో హాయిగా వుంటుంది. నిజానికి సెలవల్లో ఎన్నో కొత్త కొత్త ఆటలాడు కోవచ్చు. బోలెడన్ని చిత్రవిచిత్రమైన కథలూ, సాహస గాథలూ చదువుకోవచ్చు. ఇక క్లాసు పుస్తకాలంటారా - వాటిమాట చెబితేనే వెర్రెత్తుతుంది. తెలుగుపుస్తకం కదా అని తీస్తేచాలు - కొట్టొచ్చినట్టు వ్యాకరణం ప్రత్యక్షం. ఏం చదవబుద్ధేస్తుంది చెప్పండి. ఓ కథా కరక్కాయా. ఇదే నయమనుకొంటే దీనితాత మరోటుంది. లెక్కలు - దిక్కుమాలినవి, ఎప్పుడూకూడిక తీసివేతలతో కూలబడతాయి. అసలు లెక్కలంటేనే నాకు ఎక్కలేనిచిరాకు, చీదరింపు పుట్టు కొస్తుంది. ఉత్సాహమంతా చస్తుంది. విశాలరావు మాస్టారు దయతలచి వుండకపోతే మళ్ళీ దేముడా అంటూ మూడవ ఫారంలోనే ఏడవాల్సివచ్చేది. విశాలరావుమాస్టారు పరీక్షలైన తర్వాత ఓ వారంరోజులకు పిలిచి అన్నమాటలు యింకా చెవుల్లో గింగురుమంటున్నాయి.

"నీ బాగుకోసం చెప్తూంటా. శ్రద్ధగా సెలవుల్లో యీ లెక్కలన్నీ చేయి. నిన్ను నాలుగోఫారంలో వేసే బాధ్యత నాది" అంటూ ఓ నీలిఅట్ట బైండు లెక్కలపుస్తకం ఇచ్చారు.

"తప్పక చేస్తానండీ మాస్టారూ" ఆ ఆపదను తప్పించుకొనేందుకు చేసిన వాగ్దానం జ్ఞాపకంవచ్చింది. సెలవుల్లో ఆ విషయమే బొత్తిగా మరచాను. ఆ సంగతి తల్చుకుంటే నాకే చాల సిగ్గేస్తుంది. ఏంలాభం, "చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నట్లు." మళ్ళీ స్కూలు తెరుస్తుండిరి!

స్కూలు తెరిచేరోజు వచ్చింది. మామూలుకంటే పెందలకడనే నిద్రలేచాను. చక్కగా స్నానంచేసి తెల్లని ఉడుపులు ధరించాను. వేడివేడికాఫీ త్రాగి బూజుపట్టిన పుస్తకాలను దులిపి సంచీలోపెట్టి బయల్దేరాను. ఎంత హుషారుగావుంది యీవేళ! ఉదయపుగాలులు కమ్మని వాసలను మోసుకొస్తూ సముద్రపు అలల్లా తెరలుతెరలుగా వీస్తున్నాయి. బజారంతా కొత్తకొత్తగా వుంది. రంగురంగు దుస్తులతో...నవ్వుకుంటూ.....ఆడుతూ పాడుతూ ...ఒంటిగా...జంటలుగా...ఠీవిగా...ఒయ్యారంగా నడుస్తున్న బాలురతో బజారంతా క్రొత్తకాంతు లీనుతోంది. ఆడపిల్లలు మెల్లగా ఆడపిల్లల్లాగే నడుస్తున్నారు. ప్రతి ముఖంలోను చెప్పలేనిఆనందం. నాకూ చాల ఆనందంగావుంది. మా క్లాసువాళ్ళందరినీ కలుసుకోవాలని, కులాసాగా కబుర్లు చెప్పుకోవాలని - ఎంతో దూరదూరాలనుంచి యింటికిమరలే బాటసారిలావుంది నా వ్యవహారం.

"ఎందుకని"

"వాళ్ళ అమ్మ నాన్నతో కలసి మరో ఊరు వెళ్ళి పోయాడు."

"కారణం"

"ఉత్త కోతలురా. వాడిమాటలు నిజమనుకున్నారా ఏమిటి?" నవ్వుతూ అన్నాడు రాజు.

"నిజంగానే" నెమ్మదిగా జవాబిచ్చాను.

పిల్లలందరు నావంక తీక్షణంగా చూశారు. ఏవో మంత్రాల్లాగా గొణుక్కున్నారు.

"మూర్తిగాడుకూడ రాలేదే!" శర్మ అన్నాడు.

"హనుమంతరావేడిరా!" చంద్రం బిగ్గరగాఅన్నాడు.

"బహుశః వీళ్లుకూడ ఎక్కడికో వెళ్ళుంటారు. మనకిక వాళ్ళనుగురించి ఏం తెలుస్తుంది - ప్చ్" విచారంగా అన్నాడు సుబ్రమణ్యం.

ఇంతలోకి గేటు తెరువబడింది. భూషణం కనబడ్డాడు.

"ఓహో!" అంటూ మేము భూషణం చుట్టూచేరాం.

"నన్ను వెళ్ళనీయండర్రా, పిల్లకాయలూ!" మా నుంచి తప్పించుకోజూశాడు భూషణం.

"నాలాంటి వాణ్ణి మీరింతకుముందు చూళ్లేదూ! కొంపదీసి నే నేమన్నా వింతమృగంలా అవుపిస్తున్నానా ఏమిటి?"

మేమంతా ఆప్యాయంగా భూషణం వీపుమీంద గట్టిగా చరిచాం. నేను మరోసారి వీపుమీద చరుద్దామనుకుంటు - తగలేసి, ఆ చెయ్యికాస్తా వళ్ళీ భూషణంతలకు గట్టిగాతగిలింది. అగ్గిరాముడయ్యాడు. "నాతో కుస్తీకి వస్తావన్నమాట. హుం, కానీయ్" అంటూ సణుక్కుని మానుంచి తప్పించుకునేందుకు గింజుకుంటున్నాడు. అబ్బే - చస్తే ఓ అంగుళం కదలనిచ్చామా? కాని హఠాత్తుగా సూర్యం అరుపించడంతో మేమందరము అటువైపుకు తిరగడం, భూషణం చప్పున తప్పించుకోవడం క్షణకాలంలో జరిగింది.

"మంచిది, మనమందరం ఇక్కడ ఉన్నామన్నమాట" సీను అన్నాడు.

"రఘును మినహాయించి..."అందుకున్నాడు గోపాల్.

"ఏమిటి, రఘు బడికి రాలేదా?" సూర్యం ఆత్రంగా అన్నాడు.

"అవును. యిక స్కూలుకు రాడు" జవాబిచ్చాను.

"నిజంగానా, అయినా విశాలరావుమాస్టారిని అడిగితే సరి అన్నీ తెలుస్తాయి"

"నమ్మితే నమ్మండి, లేకపోతే లేదు" సూర్యంవైపు కోపంగాచూస్తూ అన్నాను.

తరువాత మేమందరము ఒకరినొకరు మొహంవాచినట్లు చూసుకున్నాం. సెలవ లెలాగడిపిందీ, కొత్తఆట లేవేవి నేర్చుకుందీ వగైరా విశేషాలు చెప్పుకోడంలోకివచ్చాం.

కొందరు కొండపల్లి వెళ్లారు. మరికొందరు అజంతా, ఎల్లోరా గుహాలను చూసొచ్చారు. మస్తుగాడబ్బున్న రాజా, వాళ్ళ నాన్న అమ్మతో కలిసి కాశ్మీరు వెళ్ళాడు. మేమందరం కొద్దోగొప్పో ఎత్తు పెరిగాం. లావ్వూ అయినాం. కాని, మహాప్రభో మా అవతారంగాడు మాత్రం అడ్డంగా తెగ బలిశాడు. గున్నఏనుగుకు వీడికీ అట్టే తేడాలేదంటే కళ్లు మూసుకుని నమ్మొచ్చు. అసలే వాడిది కాకిరంగు. దానికి తోడన్నట్టు తలవెంట్రుకలన్నీ తెలుపుకు తిరిగాయి. ఇహ చూసుకోండి వాడిఅవస్థ. ప్రతి వెధవాయి గేలిచేసేవాడే.

"ఏరోయ్, అవతారం - హాహాహా - ఏంరంగు, ఏం అందం"

"అందాలరాజు పోటీకి నిలబడితే మనవాడే ఫస్టు, తప్పదు"

"ముందు వాడిఅవస్థ చూడండిరా! అంత 'బక్క' శరీరాన్ని మోయలేక ఎలా సతమతమవుతున్నాడో"

"సరేగాని అవతారం, సెలవల్లో ఎక్కడికనా వెళ్లావా?" రాధాయి అడిగాడు.

"ఓ! మానాన్న వెళ్తుంటే నేనూ మద్రా

"అమ్మో మద్రాసే! మరి సముద్రాన్ని

"ఓ- సముద్రాన్నీ, దీపస్తంభాన్నీ, పై ఇంకా చాలాచూశాలే"

ఈ మాటలు వినేసరికి మాకు అం

లేసి ఆశ్చర్యం పుట్టుకొచ్చింది.

వభావం ఏర్పడింది.

"సముద్రాన్నిగురించి ఏదన్నా చెప్పరా?" సూర్యం అడిగాడు.

"అయితే వినండి. సముద్రం చాలా పెద్దది. ఎన్ని నీళ్ళో చెప్పలేం. ఊఁ, సముద్రం ఎంత పెద్దదంటే ... ఎంత పెద్దదంటే - మనం యీ ఒడ్డున నిలబడితే అవతలి ఒడ్డు కన్పించదు. అంతా నీళ్ళమయం.

"ఏంగొప్పలు, కొంయ్ నాయనాకొాయ్" రాధాయి నవ్వుతూ అన్నాడు.

"నాకు మొదట భలే భయంవేసింది. కాని తరువాత మెలమెల్లగా తగ్గిపోయిందిలే ..."

"ఈసోదంతా ఎవరికోయ్; సముద్రాన్నిగురించి అఘో రించమంటే," సూర్యం చిరాకుగాఅన్నాడు.

"ఓనిముషం ఆగండిరా; ఆఁ సముద్రం ... చాలా అద్భుతమైంది. ఎన్నినీళ్ళు; ఎన్నినీళ్ళు ..."

ఇంతలో చక్రపాణి వచ్చాడు. లేకపోతే అవతారం
న్నిగురించి యింకేమన్నా చెప్పేవాడేమో! అయినా
ంనివాడిలా యెంతసేపు జెప్పినా "ఎన్నినీళ్లు...ఎన్ని
ం ... అద్భుతం" అనేగాని మరోమాట చెప్పిన
ా, చక్రపాణిని చూడిగానే మాకు ప్రాణం
ది. పట్టరాని సంతోషంతో బ్రహ్మా ... గా
ఎన్నో ప్రశ్నలు వేశాం. ఆ ...
ాటరయితే ఎంతబావుణ్ణు.

"ఈ సంవత్సరంకూడా నీవే మానీటరుగా వుండాలి" రమణ అన్నాడు.

"మంచిది. అలాగే ఉంటాను. కాని మీరు నాతో గత సంవత్సరమంతా విసిగి వేసారి వుంటారు; అవునా?" చక్రపాణి మా అందరివంక చూస్తూ అన్నాడు.

"విసుగా, నీవల్లనా? నీవంటే మాకెంతో ఇష్టం." ఓ డజను కంఠాలు ఏకకాలంలో అరిచాయి.

చక్రపాణి తను సెలవులు ఎలాగడిపిందీ ఓ చిన్నకథ లాగ చెప్పాడు.

"మీలో ఎవరన్నా బోటుషికారు చేశారా?"

"లేదు లేదు; ఎలావుంటుందో చెప్పు వింటాం"

"భలేగా వుంటుందిలే. అందులో పౌర్ణమినాడు మరీ బావుంటుంది. నేనూ మాఊరివాళ్లు మరి ముగ్గురుకలిసి ఓ పున్నమి రాత్రంతా బోటులోనే గడిపాం. అబ్బ! మరచిపోదామన్న మరపురాదు. సన్నగా కూనిరాగాలుతీసే అలలు, అలల శయ్యలమీద కలలుగనే కలువలు, వాటితో కలిసి ఆడుకునే అందాల చందమామ – ఎంత మనోహర దృశ్యం! మనమందరం కలిసి ఓసారి బోటుషికారుకు వెళ్దాం. అపుడు చూదురుగాని...

ఇంతలోకే విశాలరావు మాస్టారు వచ్చారు. మా కట్టడలేని సంతోషం పుట్టుకొచ్చింది.

"నమస్కారమండీ మాస్టారూ!" మేము ఒకేసారి న్నాము.

"ఓహో; సంతోషం." విశాలరావు మాస్టారు చిరు నవ్వుతో అన్నారు. "సరేగాని అబ్బాయిలూ, సెలవులన్నీ చక్కగా గడిపారా?"

"చక్కగా ఏమిటి మాస్టారూ, వందరోజులు [illegible] ఉహుఁ! సెలవలంటే విసుగెత్తిపోదూ సార్!"

"అవునండీ, మేం పాఠాలు చెప్పించుకుంటాం. విసుగు గిసుగు అన్నీపోతాయి" సూర్యం అన్నాడు.

"బావుంది."

"నేను శెలవల్లో ఎంతబాధపడ్డానో చెప్పలేనుమాస్టారూ. ఏం తోచదు. ఏంచెయ్య బుద్ధివెయ్యదు. ఎంతసేపని ఆడుకోవడం? ప్రతిరోజు ఓ సంవత్సరంలా గడిపాననుకోండి. ఇవాళ్టి స్కూలుగాబట్టి సరిపోయిందిగాని; లేకపోతేనా..." కిష్టాయి మధ్యలో ఆపేశాడు.

"నీ చమత్కారం యింకా మానలేదు."

"నామాటలు మారలేదుగాని, నా ఎత్తుకాస్త పెరిగిందికదండీ మాస్టారూ?"

"నన్నడిగితే చాల కొద్దిగా పెరిగావు"

"పెరగపోతే పీడాపోయె, పొట్టిబుడంకాయ మట్టుకు కాలేదు." చక్రపాణిమాటలకు మేము ఘొల్లున నవ్వాం.

"మాస్టారూ! రఘు యిక స్కూలుకు రాడుటండీ" సూర్యం ప్రశ్నించాడు.

"అవును, రాడు. వాళ్ళనాన్నగారికి [illegible] అ కదూ, అందుకని వెళ్లిపోయారు. అక్కడే చదువుకుంటాడు"

"మాస్టారూ, మాస్టారూ - మరే మన అవతారం మద్రాసు వెళ్ళొచ్చాట్టండీ! సముద్రాన్ని చూశాట్ట."

"అయితే సముద్రాన్ని గూర్చి కాంపోజిషన్ వ్రాయగల డన్నమాట అవతారం" విశాలరావు మాస్టారు నవ్వుతూ అన్నారు.

"విశాలరావు మాస్టారూ, మా డెంతలావెక్కాడో చూడండి"

"ఎవరూ?"

"అవతారమేనండీ!"

"ఇక మాటలు చాలించి అంటకు వరుసగా నిలబడండి. క్లాసులలోకి వెళదాం."

మేమందరం వరుసగా నిలబడ్డాం. ఇతర తరగతుల వాళ్లుకూడా మాలాగే బారులుతీరి నిలబడ్డారు. హెడ్మాస్టారు మావైపు ఆప్యాయంగాచూస్తూ అన్నారు. "మీకందరకూ భగవంతుడుశుభములనిచ్చుగాక! బుద్ధిమంతులై శ్రద్ధగా చదివి వృద్ధిలోకిరండి. మీకివే నాఆశీస్సులు!" తరువాత ఒక్కొక్క వరుసే మెల్లగాక్లాసుల్లోకి కదలడం ప్రారంభమైంది. మొదట చిన్నవాళ్లు - ఫస్టుఫారం వాళ్ళు, తరువాత సెకండుఫారం వాళ్లు, తదుపరి థర్డుఫారంవాళ్లు, ఆపైన మేమూ, మావెనుక మాకంటె పెద్దవాళ్ళు, ఇలా అందరమూ ఎవరిక్లాసుల్లోకి వాళ్ళం నడిచాం.

విశాలరావు మాస్టారు ముందు నడుస్తుంటె మేమం దరమూ వరుసగా క్లాసుల్లోకి ప్రవేశించాం. పోయిన సంవ త్సరం ఎవరు ఏ బెంచీమీద కూర్చున్నారో ఈ సంవత్సరం

కూడ అదే బెంచిమీద కూచోవాలనుకున్నాం. నాబ్ర మీద నే నొక్కణ్ణే కూచున్నాను. సగం ఖాళీగానేవుండి పోయింది. మరి రఘు లేడుగా! గదంతా మాకళ్ళకు చిన్న దైనట్లు కన్పించింది. కాని విశాలరావు మాస్టారు గది చిన్నది కాలేదని, మేము పెద్దవాళ్ళమవడంమూలాన అలా కన్పిం చిందని, చెప్పారు.

విశాలరావు మాస్టారు రైటు. నేను ఆటగంటలో మా గదినంతా జాగ్రత్తగా అంగలతో కొలిచి చూచాను. సరిగా మునుపటిపొడుగు, వెడల్పు, ఏమీ మార్పులేదు.

విశాలరావు మాస్టారు మేము నాల్గోఫారంలో ప్రవే శించామని. పూర్వంకంటె పాఠాలు ఎక్కువగా వుంటాయి గనుక ఎక్కువకష్టపడి చదవాల్సివుంటుందని చెప్పారు. అంటే మేము ఇప్పటినుంచి ఏరోజు పాఠాలు ఆరోజు చదువుతూ ఉండాలి. లేకపోతే వెనుకబడిపోతాం. మేము కొత్త టైంటేబులును వ్రాసుకున్నాం.

"ఇక మానీటరును ఎన్నుకోవడం. ఎవరోఒకరు లేచి మీా ఇష్టమైన పేరుచెప్పండి."

"చక్రపాణి, కె.వి.చక్రపాణి"సగంక్లాసుదాకా లేచింది.

"నిశ్శబ్దం. అలా అందరూ ఒకేసారి గలంతుగా లేవచ్చా? మీాకు ఎన్నికలు ఎలా నిర్వహించాలో తెలీదూ? ఎవరన్నా మాట్లాడాలనుకుంటే చేతులెత్తి మరీ మాట్లాడాలి తెలిసిందా?"

తరువాత ఎన్నికలు సక్రమంగా జరిగాయి. చక్రపాణి మానీటరుగాను, ప్రభాకరాన్ని సహాయకుడుగాను ఎన్నుకున్నాం.

గత సంవత్సరం నేర్చుకున్న పాఠాల్లో ఎన్నిశెలవల్లో ఎగిరిపోయాయో, ఇంకాయెన్ని మిగిలాయో మళ్లీ ఓసారి జ్ఞాపకం తెచ్చుకుందాం అంటూ విశాలరావు మాస్టారు పోయినసంవత్సరం జరిగిన పాఠాలలో కొన్నిప్రశ్నలువేస్తూ, చెప్పలేనివాటికి నెమ్మదిగా జవాబులు చెబుతున్నారు. కర్మ గాకపోతే ఏమిటంటారు? నాదగ్గర కొచ్చేటప్పటికి సరిగా లెక్కల్లో ప్రశ్న వేశారు. నాకు లెక్కలంటే ఎక్కడలేని చిరాకని మీకిదివరకే చెప్పాను. లెక్కచేయడంమాట అటు వుంచి కనీసం నోటిలెక్కలైనా చెయ్యలేను. అసలు నోటి లెక్కలైనా చెప్పేందుకు ముందు ఎక్కాలు రావాలంటారా? నాకొచ్చిన ఆకాస్తఎక్కాలు సెలవుల్లో చెప్పకుండా చక్కాపోయాయి. బొత్తిగా ఏమీలేకుండా పోలేదుగాని తోకల్లాగ ఎక్కపు చివరలుమాత్రం యింకా మినుకుమినుకు మంటున్నాయి. ఏడేళ్లు - నలభై తొమ్మిదని తెలుసుగాని తరువాత అంతా గందరగోళం, అయోమయం.

"అసలు సెలవుల్లో ఎప్పుడైనా పుస్తకము తెరిచావట్రా వేణుగోపాలరావు"

విశాలరావుమాస్టారు కోపంవస్తే నన్నుయిలాగే పిలుస్తారు. లేకపోతె మామూలుగా "వేణూ" అంటారు.

స్కూలు ప్రారంభమైనప్పటినుంచి పాఠాలు చదవడమనేది చాల కష్టమైన విషయం. ఎవరో వెంబడించి తరుము

తూన్నట్లుగా గబగబా పాఠాలు చెప్పుకుపోవడం నాకు నచ్చ
లేదనుకుంటా! నేనే గనక విద్యాశాఖాధికారినైతే యీ
విధానాన్ని తప్పక మార్పుస్తును. రెండునెల్లపాటు హాయిగా
ఆడుతూ పాడుతూ స్వేచ్ఛగా గడిపిన పిల్లవాళ్లను అమాంతం
ఓరోజున స్కూలుగదిలో కూలేసి, ఏవేవో పుస్తకాలు ముందు
పడేసి, అపరిమితంగా పాఠాలన్నీ ఒకేసారి కుక్కడానికి ప్రయత్నిం
చడం ఏం బాబు! అలా కాకుండా - మొదటివారం [illegible]
ఒకపాఠం, రెండోవారంలో రెండుపాఠాలు - ఇలా క్రమశః
పాఠాలను పెంచుకుంటూ పోతూండడంవల్ల పిల్లలకు అవి
బాగా అర్థమవడమే కాకుండా వాటిమీద అభిమానం, చద
వాలనే అభిలాష కలుగుతుంది. ఈవిధంగా అంటున్నానని
నన్నుమీరు సోమరిక్రింద జమకట్టి "పీడించవద్దు తాతారా బడికి
వెళ్ళమంటు జడిసే బద్ధాయి" అని తలపోయడం సహజం.
నిజానికి నాకు బడంటే ఎంతో యిష్టం. కాని సెలవులన్నీ
కులాసాగా గడిపి, వెనువెంటనే పాఠాలు లంకించుకోవడమనేది
మిక్కిలి శ్రమతో గూడిన విషయమని నానమ్మకం.

మూడవపీరియడు భూగోళం. నాల్గోఫారంలో భూగోళం
లెక్కల్లాగా కఠినంగా ఉంటుందేమోనని భయపడ్డాను. కాని
తీరా పాఠం మొదలెట్టేసరికి చాల తేలికనిపించింది. భూమిని
గురించి చెప్పేశాస్త్రాన్ని భూగోళం అంటారు. భూగోళంలో
నదీనదాలు, కొండలు, అడవులు, సముద్రాలు. పంటలుపండే
ప్రదేశాలు మొదలగువాటినిగూర్చిన క్రొత్తక్రొత్త విశేషా
లుంటాయి. [illegible] గురించి వింతవింత అభి
ప్రాయాలు [illegible] వలె [illegible]ందని, కూజాలా

వుంటుందని, ఎత్తుపల్లాలు లేక బల్లపరుపుగా వుంటుందని రక రకాలుగా అనుకునేవాళ్లు. కాని భూగోళశాస్త్రం భూమి గుండ్రంగా గోళాకారంలో ఉంటుందని, దానిపై మనుష్యులు నివసిస్తారని నిరూపించింది. భూమికి ఆకర్షణశక్తి వుందని, అందువల్లనే భూమిమీద చరించే జీవకోటి నడవగల్గుతూం దని వివరించింది.

భూమినిగూర్చిన పాఠం అయిపోయింది. ఇంతలో ఓ విశేషం జరిగింది. జాగ్రఫీమాస్టారు వెళ్ళిపోవడం, నాలుగో పీరియడు లెక్కలుకావడం మూలాన విశాలరావు మాస్టారు లోనికిరావడం ఒకేసారి జరిగాయి. మాస్టారివెనుకనే చడీ చప్పుడు ఏమీలేకుండా పిల్లిలా ఓకుర్రాడు ప్రవేశించాడు. కాసేపు బిత్తరచూపులతో గదంతా కలయజూస్తూ తత్తర పాటుతో యిలా అన్నాడు.

"నమస్కారం మాస్టారూ!"

"ఊం మంచిది." విశాలరావు మాస్టారు జవాబిచ్చారు. "ఏంకావాలోయ్"

"ఏమీవద్దు"

"మరి యీ "ఏమీవద్దు"కు యింతదూరం ఎందుకు వేంచేయడం."

"నేను చదువుకునేందుకు వచ్చానండీ! ఇది ఫోర్తు ఫారం క్లాసేనా?"

"అవును"

"నేనూ అదే అనుకున్నాను."

"అయితే నీపే స్కూలుకు కొత్తన్నమాట."

"అవునండీ! నే నివాళే స్కూలుకువస్తా"

విశాలరావు మాస్టారు హాజరుపట్టీ చూశారు.

"నీ పేరు విశ్వేశ్వరరావు కదూ!"

"అవునండీ, కాని నన్ను అందరూ "విశ్వం" అని పిలుస్తారు."

"అయితే విశ్వం, ఇంత ఆలస్యంగా ఎందుకొచ్చావ్? టైముకు రావాలని తెలీదా?"

"నేను సరిగా టైముకు వచ్చానండీ. మొదటిపీరియడు అప్పుడే ప్రారంభమైంది..."

"మొదటి పీరియడేమిటి? ఇది నాలుగోపీరియడయితే. మరి యీ మూడుపిరీయడులూ ఏంజేస్తున్నావ్?"

"అయిదో ఫారంలో ఉన్నానండీ"

"అక్కడేంజేస్తున్నావ్?"

"క్షమించాలి, కాస్త పొరబాటుజరిగింది. నేను స్కూలుకు వచ్చేటప్పటికి పిల్లలు గుంపులు గుంపులుగా క్లాసుల్లోకి ప్రవేశించడం చూశాను. వాళ్ళతోబాటు నేనూవెళ్లాను. ఇలాచూద్దునుగదా, అది అయిదోఫారంగది. మొదటి పీరియడు ఆఖరున ఎవరో కొందరు పిల్లలువచ్చి నన్ను నీవు కొత్తగావచ్చావా అన్నారేగాని, ఏ ఫారం ఏమిటని అడిగిన పాపాన పోలేదు. వాళ్లు ఇది ఫలానా ఫారమని చెప్పలేదు, నాకేమో తెలియకపోయె..."

"మొత్తానికి ఘనుడవే. ఇంకెప్పుడూ ఇతరక్లాసుల్లోకి ప్రవేశించే ప్రయత్నంచేయక" విశాలరావు మాస్టారు మందలింపుగా అన్నారు.

విశ్వం మెల్లగావచ్చి నా ప్రక్కన కూచున్నాడు. ఓ వైపు పాఠం జరుగుతున్నా పిల్లలందరూ విశ్వంవంక చూస్తూ ఏవేవో గుసగుసలాడుతున్నారు. కాని విశ్వం మాత్రం నిశ్చలంగా పాఠం వింటున్నాడు. అసలా గొడవేమీ పట్టించుకున్నట్లులేదు.

విశ్వంముఖం భలే తమాషాగా ఉంటుంది. క్రిందిపెదవి ముందుకువచ్చింది. ముక్కు ఆకాశంవైపు చూస్తూ గాలిలో తేలిపోతున్నట్లుగా ఉండటంచేత విశ్వంచూపులు కోపిష్టిగా కన్పిస్తాయి.

నాలుగో పీరియడు అయినతర్వాత పిల్లలందరూ విశ్వం చుట్టూ మూగారు.

"చూస్తూ చూస్తూ ఐదోఫారంలోకి ఎలా వెళ్ళావు. మాస్టారు నీ పేరు పిలువలేదా?" సూర్యం అన్నాడు.

"ఊఁహూఁ! నేను వెళ్ళేసరికి హాజరు వేయడం అయిపోయి ఉండాలి"

"మరి నీ కది ఐదోఫారమని ఎలా తెలిసింది ?"

"మూడవ పీరియడులో మాస్టారు నన్నో ప్రశ్న వేశారు. అంత పెద్దప్రశ్న నా కేం తెలుసు? మా కెప్పుడూ చెప్పలేదండీ ఇలాంటిది" అన్నాను.

"ఎందుకు చెప్పరూ. తప్పించుకుందామనుకున్నావా ? నీవు ఐదోఫారంకదూ" అని మేస్టారు ప్రశ్నించారు.

"కాదండీ. నాల్గవఫారం" మెల్లగా జవాబిచ్చాను.

"బుద్ధిమంతుడివి, మరి యిక్కడ కూచున్నావేమిటి? ఇది ఐదో ఫారం, తెలుసా?..."

"తెలీదండీ, ఈ స్కూలుకు కొత్తగా వచ్చాను" అని అన్నాను.

"వచ్చే పీరియడన్నా నీ క్లాసులోకి వెళ్ళు, తెలిసిందా" అంటూ ఈ గది చూపించారు, వచ్చాను. పిల్లలందరూ ఈ కథ విని ఆశ్చర్యపోయారు.

"ప్రతి విద్యార్థి తను గదిలో ప్రవేశించబోయేముందు అది ఏ ఫారమో జాగ్రత్తగా చూడనిదే ప్రవేశించవచ్చా?" అని చక్రపాణి ప్రశ్నించాడు.

"మరి కొత్తవిద్యార్థికి ఏం తెలుస్తుంది?" విశ్వం అమాయకంగా అన్నాడు.

"కొత్తగా స్కూలుకు వచ్చేటప్పుడు కాస్త ముందుగా రావడం అవసరం. నీకు నాలికవుందాయ్, మాటలు వచ్చు - ఇంకేం కావాలి ... నాల్గవఫారంగది కనుక్కునేందుకు?"

"ఇవాళ టైములేదు. అదీగాక పెద్దవాళ్లు వెళ్తున్నారుగదా అని నేనూ వాళ్ళవెంట వెళ్ళాను"

"అయితే గొర్రెల్లా తలవంచుకుని, దారీ తెన్నూ లేకుండా ఒకచే పడిపోవడమన్నమాట" చక్రపాణి రెట్టించి అన్నాడు.

"నేనేం గొర్రెను కాదు." విశ్వం వెంటనే పుస్తకాలు తీసుకుని బయటికి వెళ్లాడు.

నేను పుస్తకాలుతీసుకుని యింటికిబయల్దేరాను. గేటు దాటగానే విశాలరావు మాస్టారు కన్పించారు.

"ఏమోయ్ వేణూ!" ఈ సంవత్సరం కష్టపడి ప్యాస వ్వాలని ఉందా నీకు?" ఎంతో ప్రేమగాఅన్నారు "నీకు బుర్రవుంది. కాని తగినంత కృషిలేదు. నీవు లెక్కలు బాగా చేయాలి. ఎక్కాలుకూడ మరచిపోయావంటే సిగ్గు పడాల్సిన విషయం. చిన్నపిల్లలకు వచ్చినపాటి కూడ నీకు రావాయె-ఏమంటావు ?"

"అంతా వచ్చండీ! కాని కొంచెం చివరలుమాత్రం మరచిపోయాను."

"ఎక్కాలన్నీ పూర్తిగా రావాలి. మొదలు, చివర వస్తే ఏమైనట్లు. ఇలాగనుక చదివితే నీవు నాలుగోఫారం కనీసం నాలుగేళ్ళు చదవాల్సివస్తుంది. రేపు క్లాసుకు ఎక్కాలు బాగా చదువుకు రావాలి. తెలిసిందా?"

నేను సరేనన్నట్లుగా తలత్రిప్పి, మాస్టారివద్ద శలవు తీసుకున్నాను.

## 2

ఆడపిల్లలందరూ తామే మహాతెలివిగలవాళ్ళ మను కుంటారు. ఇలా ఎందుకు భావిస్తారో నాకర్థంకాదు. ఎక్కడిదాకో ఎందుకు? మాచెల్లెలు సుగుణవిషయమే తీసు కుందాం. అది యీ సంవత్సరం రెండవఫారం ప్యాసైందో

లేదో ఎక్కడలేని గర్వం. వీణ్ణి లెక్క చెయ్యడమేమిటి? నా కంటె ఏమాత్రం ఎక్కువని? ఈ ధోరణిలో ప్రవర్తిస్తుంది. నన్ను గడ్డిపోచకంటె హీనంగా తీసేస్తుంది. లేకపోతే నామాటంటే దానికంత లోకువెందుకు చెప్పండి? నేను దానికి ఓలక్ష సార్లైనా చెప్పివుంటాను. "ఓసుగుణా! నీకెన్నిసార్లు చెప్పాలి. బడినుంచి వచ్చీరాకముందే పుస్తకాలు ముందు వేసుక కూచోవద్దన్నానా? బళ్లోపాఠాలు వినివిని బుర్రంతా వేడెక్కివుంటుంది. ఓగంట విశ్రాంతి తీసుకుని ఆపైన హాయిగా చదువుకో, నీకేమంచిది, ఏం? అబ్బే, దాంతో మాట్లాడంకంటె ఏ గోడతోనైనా మాట్లాడటం మంచిది.

ఇవాళకూడ నేను స్కూలునుంచి వచ్చేసరికి అది పుస్తకాలన్నీ చాపమీద పరిచి, లోలోపల చదువుకుంటోంది.

"ఇదుచూడు అమ్మాయి. నీకింత మొండిపట్టు ఎందుకే? బడి అయిపోయిన తరువాత బుర్రకు కాస్తవిశ్రాంతి ఇవ్వాలని తెలీదూ?"

"మాకు తెలుసు" సుగుణ పుస్తకంవంక చూస్తూనే అంది. "నీకంటె నాకు బాగా తెలుసురా వేణూ! ఈ చదువు పూర్తికానిదే నాకేంతోచదు. ఆడుకో బుద్ధివేయదు"

"ఉత్త చిలిపి పిల్లవి" నేను నెమ్మదిగా అన్నాను. "రెడ్డొచ్చి మొదలాడే నన్నట్లు"నీకు మళ్లీ ఎవరు చెబుతారు. ఓసారి పెద్దవాళ్ళు చెబితే అది మన మంచికే చెబుతున్నారనే గ్రహింపు ఉండాలి. అయినా నీ వింత బండబారి పోయావేమిటి?"

"నేనేం చేయనురా అన్నాయ్! హోంవర్కు పూర్తి కానిదే నాకు ఏపని చేయబుద్ధివేయదు. నీవేమో ఇలా అంటావైతివి. ఎలారా?"

"ఎలా ఏమిటి, బాగానే. ఇవాళనుంచి నీవు యింటికి రాగానే హోంవర్కు మొదలుపెట్టక హాయిగా విశ్రాంతి తీసుకో."

"ఊఁహుఁ, కుదరదు." సుగుణ మూతిముడిచి తల అడ్డంగా త్రిప్పుతూ అంది.

"తొందరపడక. నాల్గోఫారంలోకి వెళ్తే నీకే తెలుస్తుందిలే."

"సరేగాని, ఇవాళ నీకేం హోంవర్కు ఇచ్చార్రా అన్నాయ్?

"నీకేం అర్థమవుతాయి, చాలా పెద్దపాఠాలయితే"

పైకి యిలా అన్నానేగాని నాకు ఎక్కాలు సరిగా రావని దానికి తెలిస్తేనా ... అమ్మో, యింకేమైనా ఉందా? నా మాట యీకాస్తయినా లెక్కచేస్తుందా?"

ఈ సంవత్సరం మొదటినుంచీ బాగా చదవాలని నిశ్చయించు కున్నాను. అనుకోవడమే తడవుగా కూచ్చుని ఎక్కాలు వల్లెవేయడం ప్రారంభించాను. కాని ఓచిన్న చిక్కు వచ్చిపడింది. మా సుగుణ ఇంట్లోవుండగా పెద్దగా చదివేందుకు ధైర్యంచాల్లేదు. కారణం మరేమీలేదు. అదిగనుక నాకు ఎక్కాలురావని పసిగట్టిందంటే నన్ను గడ్డిపోచ క్రింద జమకడుతూందనే భయం. దేవుడి దయవల్ల సుగుణ త్వరగానే హోంవర్కు ముగించుకుని, కూనిరాగాలు

తీసుకుంటూ తన స్నేహితులతో ఆడుకునేందుకు బయటికి వెళ్ళింది. ఎంతపెద్దగా చదువుకున్నా ఇకఅడిగేదెవరు? బిగ్గరగా ఓగంటసేపు చదివానోలేదో అన్నిఎక్కాలు వచ్చాయి. రావడంలో మామూలుగా వచ్చాయా-అర్ధరాత్రి, గాఢనిద్రలో తట్టిలేపి "తొమ్మిది తొమ్ముదులెంతరా వేణూ" అంటే ఎనభై ఒకటి అని తడుముకోకుండా చెప్పగలిగేటంతగా వచ్చాయి.

మరుసటిరోజు క్లాసులో విశాలరావుమాస్టారు నాచేత ఎక్కాలన్నీ ఒప్పగించుకున్నారు.

"చూడు వేణూ, చదివితే ఎంతలోకివచ్చాయో ఎక్కాలు. నీకు మంచి బుర్రవుంది. దాన్ని సక్రమంగా ఉపయోగించుకోవాలి" అంటూ పొగిడారు.

అంతటితో ఊరుకుంటే వ్యవహారమంతా సజావుగానే ఉండేది. కాని హఠాత్తుగా ఓలెక్కఇచ్చి నల్లబల్లమీద చేయమనడంతో నాపరిస్థితిపంజరంలోచిలుకలా అయిపోయింది.

'నేను మెల్లగా నల్లబల్లవద్దకు వెళ్ళాను. విశాలరావు మాస్టారు మొదట లెక్కను పూర్తిగా వ్రాయమన్నారు. లెక్కవ్రాయడం అయిన తర్వాత నాచేత ఓసారిచదివించి,మరీ చేయడం ప్రారంభించమన్నారు. కాని నాకు అసలులెక్క ఎలా మొదలెట్టాలో అంతుపడితేనా! ఊరక నిల్చుంటే ఏమంటారోనని తలపైకెత్తి, దూలవంకచూస్తూ మధ్య మధ్య పెదిమలుకదిలిస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నట్లుగా పోజుపెట్టాను. ఒకసారి మావాళ్ళవంక ప్రపంచంలోని దీనత్వమంతా ఉట్టిపడేట్లుగా చూస్తూ సైగచేశాను. కాని నల్లబల్ల వద్దనున్న

నాకు అందించడమంటే అంత తేలికపనికాదు. ప్రతివాడు "నావల్లకాదు బాబూ" అన్నట్టు ముఖంపెట్టాడు.

"లెక్కను చేయాలంటే మొదటగా ఏంచేస్తావ్!" విశాలరావు మాస్టారు ప్రశ్నించారు.

నేను కనుబొమ్మలు పైకెత్తి ఓసారి వాళ్ళందరివంక చూశాను. వాళ్లు నావైపు "నీవు విషమస్థితిలోవున్నావురా తండ్రీ" అన్నట్లు జాలిగాచూస్తూ జవాబులు గొణగడం మొదలెట్టారు.

"గుసగుసలు ఆపండి అబ్బాయిలూ. తెలియకపోతే చెప్పేందుకు నేనున్నానుగా ..."

విశాలరావు మాస్టారు నాకు లెక్కఎలా మొదలెట్టాలో వివరించారు. నేను వారుచెప్పేదాన్ని ఉన్నదిఉన్నట్లు నల్లబల్లమీద ఎక్కించానేగాని, నాకుమాత్రం లెక్కను ఎలా చేయాలో అర్థంకాలేదు.

"ఇటువంటి లెక్కలు ఇకముందు ఎలాచేయాలో తెలిసిందనుకుంటాను"

నేను తెలిసిందన్నట్లుగా తలత్రిప్పాను. కాని వాస్తవంలో నాకు కొద్దిగాకూడా అర్థంకాలేదు. అలాగని ఒప్పుకునేందుకు ధైర్యంచాల్లేదు. ఎందుచేతంటే, విశాలరావు మాస్టారునన్ను "వీడు శుద్ధమొద్దులావున్నాడే" అని క్లాసులో నలుగురిఎదుట అనగలరు. ... ఇక ప్రతివెధవాయి నన్నుగేలిచేస్తాడు. నేను నా బెంచివద్దకువచ్చి కూచుని, ఆ లెక్కనంతటినీ పుస్తకంలో ఎక్కించాను. దానిపని ఇంటికి వెళ్ళిన తర్వాత తీరికగా పడదామనుకున్నాను.

మాస్టారు అలా బయటికి వెళ్ళగానే మావాళ్ళతో అన్నాను:

"మాస్టారు వినేంత పెద్దగా అందిచడంఏవిట్రా. మీకు ఎలా అందించాలో కూడ తెలీదాయె. జవాబులు పక్కక్లాసువాళ్ళు వినేంత బిగ్గరగానా? ప్చ్ ..."

"ఏంచేయ మంటావురా, చెప్పుపోనీ. నీవా నల్లబల్ల వద్ద కూలబడితివి. బెంచీమీద ఉన్నట్లయితేనా ..." అన్నాడు సత్యం.

"పోనీలే ఈసారికి. మనం అందిస్తున్నట్టు రెండో కంటివాడికి తెలియకూడదు. అలాఉండాలి. తెలిసిందా?"

"నే నలాగే చేశాను. నీవేమో వినుపించుకో వాయె ఏంచేయమంటావురా?..."

"ఏడిశావు. నీవు నోట్లోనే గొణుగుతుంటివి. నెమ్మదిగా అంటె మరీఅంత అన్యాయంగానా ..."

"మీరు లక్ష చెప్పండిరా, నా వుద్దేశ్యంలో అందించడమంత బుద్ధితక్కువపని మరోటిలేదు, చక్రపాణి అన్నాడు. "నీకసలు లెక్కఎలా మొదలెట్టాలో కూడ తెలీదాయె. ఇంకా ఏమిటి అందించేది?"

"పోనీవోయ్, వెధవలెక్కలు, వీటితో నాబుర్రంతా చెడిపోతోంది"

"చేతగాకపోతే సరి. ఇలాంటి చిన్నలెక్కలుకూడ చేయడం రాకపోతే యీ ఫారాలు ఎందుకంటాను." నావైపు తీవ్రంగాచూస్తూప్రశ్నించాడు. "ఇకముందు నేనెవరికీ

చనే అందించను. క్లాసులో క్రమశిక్షణ రాను రాను అధ్వా న్నమవుతోంది"

"రక్షించావు. పాపం నీవందిస్తుంటేనే కదూ మే మంతా లెక్కలుచేస్తా. మహారాజులా మానుకో, నీవుగాక పోతే దారినబోయే ఏ గుడ్డిముండనడిగినా చెబుతుంది."

"మంచిది, అసలీక్లాసులో అందిచడమనేది ఎలాజరుగు తుందో చూస్తాను.

"అలాగా నాయనా, చూద్దాం ఏసూత్రం చేస్తావో"

"నేను మానీటరుననే సంగతి గుర్తుంచుకో. మన క్లాసులో ఇక అందించడమనేది జరిగేందుకు వీల్లేదు... వీల్లేదు ... వీల్లేదు."

"ఇలాంటి ఉత్తరకుమారుల్ని చాలామందిని చూశాం. ఎ్కాలం నీవే మానీటరువా ఏమిటి? రేపు నన్ను ఎన్ను కంటేనో?"

"ఎన్నుకోవచ్చు. కాని ప్రస్తుతంమాట నేనుచెప్పేది?"

అందించడాన్ని గురించినచర్చ క్లాసులో బ్రహ్మాండంగా జరేగింది. కాని ఇంతలోకి చంద్రం పరిగెత్తుకుంటూ చ్చి ఐదోఫారంవాళ్ళు ఫుట్ బాల్ ఆడుకునేందుకు సన్నా లు చేస్తున్నారని ఊదేటప్పటికి, మేమంతాచర్చను వాయిదా ఆటస్థలానికి వెళ్ళాం.

"మనంకూడ యిప్పుడే ఆడుకొందాంరా" హరి న్నడు.

"ఇప్పుడేమిటిరా, ఇంత ఎండలోనా, హాయిగా సాయంత్రం ఆడుకుందాం" కిష్టాయి సూచించాడు.

సాయంత్రం మేమందరం రంగస్థంలో సమావేశ మయ్యాం. మా పార్టీలోకొచ్చిన ప్రతివాడు గోల్‌కీపర్‌గా ఉండేందుకు వెనకాడుతున్నాడు. నిజానికి నాకూ గోల్‌కీప రంటే ఇష్టంలేదు. అదృష్టవశాత్తు కొత్తగావచ్చిన విశ్వం గోల్‌కీపర్‌గా ఉండేందుకు అంగీకరించడంతో మేమందరం ఎంతో సంతోషించాం.

ఆట ప్రారంభమైంది. మొదట్లో అవతల పార్టీ వాళ్ళే చాలాబాగా ఆడుతూ, ఒక్కగోలన్నా చేయాలని ఎన్నోవిధా లుగా యత్నించారు. కాని ప్రతిసారి విశ్వం, బంతిమీదికి కోతిలా ఎగిరి పట్టుకుని, దూరంగా విసిరేవాడు. ఫుట్‌బాల్ ఆటలో విశ్వం చెయ్యితిరిగిన ఘటమని నిర్ణయించుకున్నాం ఎలాగో కిష్టాయి ఓగోలు చేశాడు. ఆ దెబ్బతో మాకి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. ఇంకా హుషారుగా జోరుగా ఆడటం మొదలెట్టాం. కొత్తగా ఆట నేర్చుకున్న మా రాధాయికూడ ఓగోలు చేశాడు. ఇంకేముంది మాక రెండు గోలులు - వాళ్ళవి సున్నా. కాని ఇంతలోకి, క అడ్డంగా తిరిగింది. రాను రాను మాఆట తీసికట్టుకావడ మొదలెట్టింది. దీనికితోడు విశ్వంకూడ సరిగా గోలువ ఉండకుండా షికారు చేస్తున్నట్టుగా ఆషామాషీ ఆట ప్రార భించాడు. దీన్ని అవకాశంగా తీసుకొని అవతల పార్టీ వా బాగా విజృంభించి 21 గోలులు చేశారు. మేము 16 గోలు చేసేసరికి తలప్రాణం తోక కొచ్చింది. అప్పటికే చీక

పడటం మూలాన బంతి కనపడటమే గగనమైంది. ఆట ఆపేసి ఇంటిముఖం పట్టాం. దారిలో ప్రతివాడు విశ్వాన్ని నీ వల్లనే చక్కగా గెలిచే ఆట నాశనమైందంటూ శాపనార్థాలు పెట్టారు:

"నీవు మొదట చక్కగా ఆడావు. ప్చ్, తరువాత" నిట్టూరుస్తూ అన్నాడు రాధాయి. గోలుదగ్గర ఓ నిముషం సేపైనా తిన్నగా ఉన్నావా?"

"నాకు ఒకచోట ఉండటమంటే గిట్టదు" తలవంచుకుని జవాబిచ్చాడు విశ్వం. "నాకు బాస్కెట్ బాలంటే చాల ఇష్టం. దానికి గోలు అదీ ఉండదాయె, ప్రతివాడు బంతినందుకుంటూ ఆడుకోవచ్చు సరేగాని ఇలా వినండోయ్, మనమందరం కలిసి ఓ బాస్కెట్ బాల్ టీముగా ఏర్పడితేనో ..."

విశ్వం మాకు బాస్కెట్ బాల్ ఎలా ఆడాలో, ఆట ఎంత రంజుగా వుంటుందో దారిపొడుగునా చెబుతూనే వున్నాడు.

"మన డ్రిల్లుమాస్టారితో యీ విషయాన్ని చర్చిద్దాం. బాస్కెట్ బాల్ సామగ్రి మనస్కూల్లో ఏమీలేదాయె"

మా వీధి చివరకొచ్చేసరికి విశ్వం హఠాత్తుగాఆగి పెద్దగా అరిచాడు. "నా చొక్కాను అక్కడేవదిలేసి వచ్చారోయ్" అంటూ వచ్చినదారే పరిగెత్తాడు.

భలేవాడు! ఎప్పుడూ ఇలాంటి ఘనకార్యాలేవో చేస్తూనే వుంటాడు.

నే నింటికి చేరేసరికి ఎనిమిది కావొస్తోంది.

"ఇప్పటిదాకా ఏంచేస్తున్నావురా వేణూ" అమ్మ హాల్లోకివస్తూ అంది.

"ఇప్పుడే గదుటే ఊరి నాలుగువైపులా పొద్దుపోయింది. ఈ కాలంలో పగటిపొద్దు ఎక్కువ" సమర్థించ బోయాను.

"ఎన్నైనా సాకులు చెబుతావు తప్పించుకు నేందుకు. వెధవ బుద్ధులూ నీనూ. ఇకనైనా మొదలుపెడతావా లేదా?"

"ఊఁ, చదువు మొదలెట్టరా, అమ్మ అలా అరుస్తుంటే. నీ బుర్రకు కావాల్సినంత విశ్రాంతి ఇచ్చావుగా" ముసి ముసి నవ్వులు నవ్వుతూ అంది.

"మధ్యలో నీకేమిటి బాధ. నా బుర్రకు విశ్రాంతి ఇచ్చానో లేదో నాకు తెలుసు. నీ సలహా ఏమీ అఖ్ఖర్లేదు."

వెంటనే చదవేందుకు నామనస్సు ఒప్పుకోలేదు. ఏమంటే, నేను గనుక వెంటనేచదవడం మొదలెట్టానో మా సుగుణ ఇదంతా తనవల్ల నేనని మరీ పెచ్చరిల్లి పోతుంది. అందు కని కాసేపు ఆగి తీరిగ్గా చదువు ప్రారంభిద్దామని నిశ్చయించు కున్నాను. ఈ లోపల మా సుగుణకు మా ఆటను గురించి, ముఖ్యంగా విశ్వం గెలిచేఆటను చేతులారా ఎలాచెడగొట్టిందీ వర్ణించాను. ఇంతలోకి నాన్న ఆఫీసునుండి వచ్చారు.

నాన్నతోబాటు నేనూ భోజనంచేసి పాఠాలుచదవడం మొదలెట్టాను. నాన్న ఏవో ఆఫీసు కాగితాలు చూసుకుం టున్నారు. మొదట భూగోళం చదివాను. తరువాత తెలుగు పద్యాలు వల్లెవేయడం పూర్తిచేశాను. చదివిన పద్యా లకి స్వంతమాటలతో తాత్పర్యంకూడ వ్రాశాను. ఇంగ్లీషు

పాఠంకూడ త్వరలోనే ముగించాను. ఇంకే మున్నాయి, అన్నీ అయిపోయినవని అనుకుంటుంటే విశాలరావు మాస్టారిచ్చిన లెక్కలసంగతి జ్ఞాపకంవచ్చింది. మరునిముషంలోనే చికాకు, ఆవలింతలు, నిట్టూర్పులు, కళ్ళుమూసుకు పోవడం - వరుసక్రమంలో తయారయ్యాయి. ఈలోగా నాన్న గమనిస్తున్నాడనే భయంతో పిటన్నటినీ భరిస్తూ ఓపిగ్గా కూచున్నాను. ఎంతసేపని ఈ కొంగజపం ? అంతూపొంతూ లేకుండా వుంది.

"ఇక చాల్లేరా వేణూ, కళ్ళు మూసుకపోతున్నట్లున్నాయి. వెళ్ళి పడుకో నాయనా" అమ్మ ప్రేమగా అంది.

"నా లెక్కయింకా పూర్తికాలేదు"

"లెక్క లెప్పుడూ మొదటచేయాలి. ఆ వెధవ లెక్కకోసం ఎంతసేపని కూచుంటావ్?"

"కాదులే. వాడిని అలాగేకూచోనీయ్. ఎంతసేపు కూచుంటాడో చూద్దాం" నాన్న నావంకచూస్తూ అన్నాడు. "ఇక ముందైనా తెలిసొస్తుంది, లెక్కలు ముందుగా చేయాలనే సంగతి"

ఇక లాభంలేదనుకుని లెక్కనుచదవడం ఆరంభించాను. చదివీచదివీ బుర్రంతా దిమ్మెక్కిపోయింది. అక్షరాలు కనపడటంమానేసి అంకెలచాటుకువెళ్ళి నిలబడ్డాయి. కళ్లు ఓసారి గట్టిగానులుముకుని మరీ చదువపూనుకున్నాను. పరిస్థితి ఇంకా అధ్వాన్నమైంది. అసలు అక్షరాలు ఏ భాషవో, పుస్తకందేనికి సంబంధించిందో అనే ధర్మసందేహాలు తామరతంపరగా రాసాగాయి.

"ఏవిట్రా ఇంకా గొణుగుతున్నావ్ ?" అమ్మ ప్రశ్నించింది.

"లెక్క, వెధవది. అసలు అంతుపట్టలేదు"

"అది లెక్కతప్పుకాదు"

అమ్మ లెక్కను చదివి వినిపించి ఎలాచేయాలో వివరించింది. కాని నాకు మాత్రం ఏమీ అర్థంకాలేదు. ఎందువల్లనంటారేమో, అది నాకే తెలియదు.

"బళ్లో మీ మాస్టారు లెక్క ఎలాచేయాలో చెప్పలేదుట్రా" అమ్మ అడిగింది'

"ఊఁహుఁ"

"వింతగావుందే. ఆ కాలంలో–మేం స్కూల్లో చదువుకునేరోజుల్లో పంతులు మొదట ఓ పర్యాయంచేసి చూపించి మరీ యింటికి లెక్కలుయిచ్చేవారు. ఇదేంకాలమో, ఏం చదువులో..."

"అవన్నీ పాతకాలపు సంగతులమ్మా. ఈకాలంలో అలా చెప్పేవారెవరు? విశాలరావుమాస్టారు మమ్మల్ని స్వంతంగా లెక్కలు చేసుకరమ్మనేగాని, ఓసారన్నా ముందర "దీన్నిలా చేయండిరా పిల్లలూ" అన్నపాపాన పోయారా"

"భలే వింతగావుందే" అమ్మ కళ్లు పెద్దవిజేసుకుని ఆశ్చర్యంగా అంది.

"అవును, కనీవినీ ఎరుగనివింత"

"అయితే లెక్కల పీరియడులో ఏంచేశారుష్?" నాన్న నావైపు తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"ఆc, మాస్టారిచ్చిన లెక్కను బోర్డుమీదచేశాను. అంతే"

"ఆ లెక్కఏదీ, ఇలా ఇవ్వు"

నేను క్లాసులో బోర్డుమీదనుంచి వేసుకున్న లెక్కను మా నాన్నకు సగర్వంగా చూపించాను.

"చెప్పలేదంటూవేరా, వెధవాయ్. అక్కడచేసిన మాస్టరులెక్కేగా ఇదకూడ. ఈ విషయాలేవీచెప్పకుండా మాస్టారు చెప్పలేదని గోలపెడితే ఏమైనట్టు"

"అదీ ఇదీ ఒకటి ఎలాఅవుతుంది నాన్నా"

"ఏc, ఎందుకని కాదు"

"అదేమో కూలీలు ఇల్లుకట్టే లెక్క. ఇదేమో వడ్రంగులు కుర్చీలుచేసే లెక్క"

"చిలిపి వెధవ్వి" నాన్న నవ్వుతూ అన్నాడు.

"అదికాదు నాన్నా! మొదటిలెక్కేమో 25 మంది కూలీలు కలిసి 8 ఇళ్ళను ఎన్నాళ్లలో నిర్మిస్తారనేది, రెండవ లెక్కేమో 6 మంది వడ్రంగులు 36 కుర్చీలను ఎంతకాలంలో తయారుచేస్తారనేది. రెండూ ఒకటి ఎలాఅవుతాయి నాన్నా"

నాన్న ఓసారి పెద్దగానవ్వి లెక్క చెప్పడం ప్రారంభించారు. లెక్క చెబుతూనే ఓ విడికాగితంమీద వేయడం నాన్నకు అలవాటు. మధ్య మధ్య ఆపి అర్థమైందీ లేనిదీ తెలుసుకునేందుకు ఏవో ప్రశ్నలు వేశారు. ఏం చెప్పాలో, ఏం చెబుతున్నానో నాకే తెలియడంలేదు. నా బుర్రలో చెప్పలేని ఆందోళన ...

నాన్న ఇక కోపం ఆపు లేకపోయాడు. "మొద్దువెధవ. ఛీ ఛీ - ఇంత మందబుద్ధి ఎలాఅయ్యావో తెలియకుండా వుంది.

మా నాన్నకి బోధనా విధానం తెలియదు. ఈ విష యం మా అమ్మ చాలాసార్లు అంది. మొదట కాసేపు ఎంతో ఓర్పుతో నెమ్మదిగా చెబుతారు. అప్పటినుంచి ప్రారంభమవుతాయి... చిన చిన్న చీవాట్లూ, శాపనార్థాలూ వగైరా - అవి క్రమంగా మించినప్పుడు వీపుమీద నర్తించడంకద్దు. దాంతో నాకు బుర్రలో ఏమైనావుంటే అవి పూర్తిగా ఎగిరి పోయేవి. ఇవాళ ఎందుచేతనో తాపామర్చా మట్టుకు మోగలేదు.

"అంత అర్థంకానిది నాకేమీ కన్పించడంలేదు." నాన్న నెమ్మదిగా అన్నాడు. పట్టపగల్లా స్పష్టంగావుంటే ఇంకేం కష్టంరా చేయడానికి." నేను జవాబివ్వలేదు.

"ఇలాచూడు. ఈ లెక్క ఎంతతేలికో చెబుతాను. మొదట మనమేంచేయాలి?"

నే నేమీ ప్రత్యుత్తర మీయలేదు. అసలు తెలిస్తే నంటూరా చెప్పేందుకు.

నాన్న లెక్కచేయడం పూర్తిచేసి బిగ్గరగా అన్నారు. "అర్థమైందా?"

"నిజం చెప్పమంటూరా, అబద్ధం చెప్పమంటూరా" అని అందా మనుకున్నాను. కాని ధైర్యం చాలిందికాదు. ఓవేళ మా నాన్న "నిజమే చెప్పు, అబద్ధమాడేకర్మ ఏమొచ్చిందని

అన్నారో "నాకీ లెక్క ఏమీ అర్థంకాలేదు నాన్నగారూ" అని ఖచ్చితంగా చెప్పేవాణ్ణి. కాని యిలా ఏమీ జరుగలేదు.

"ఏరా, అర్థమైందా లేదా?" నాన్న హూంకరించాడు.

ఈ హూంకరింపులతో నా బుర్ర అసలే పనిచేయడం మానుకుంది. నోరుకూడ సమ్మెచేసిన కారణంగా యేమీ చెప్పలేక మూగమొద్దులా అర్థమైనట్టు తలత్రిప్పాను.

"నిన్నేరా వేణూ; లెక్క అర్థమైందా లేదా అని అడుగుతున్నాను జవాబుకూడ చెప్పలేవా ఏమిటి?"

"అర్థమైందండీ" భయపడుతూ జవాబిచ్చాను.

"నిజం చెప్పు. అర్థంకాకపోతే మరోసారి చెబుతాను.

"అవసరంలేదండీ, బాగా అర్థమైంది"

అంతటితో మా నాన్న ఒదిలిపెడతారని నాకు నమ్మకంలేదు. లెక్క చూడకుండా స్వయంగా చెయ్యమంటేనో- ఇక నాపాట్లు భగవంతుడి కెరుక. పనితొందరవల్ల కామోసు నన్ను లెక్కను నోటుపుస్తకంలో ఎక్కించుకోమని చెప్పి ఊరుకున్నారు. నేను లెక్కను వ్రాయడం పూర్తిచేసి పుస్తకాలన్నింటినీ సంచీలో సర్దాను.

"బుర్రకు బరువెక్కువైంది. ఏరా అన్నాయి" సుగుణ నవ్వుతూ అంది.

"ఫోమ్మయ్, నీకేం" అని దాన్ని ఓసారి కసిరి నిద్రపోయే ప్రయత్నంలోపడ్డాను.

# 3

వేసవి సెలవుల్లో మాబడిని చక్కగా అలంకరించారు. గోడలకు శుభ్రంగా వెల్లవేశారు. గీతలు, రాతలు ఏమీ లేకుండా వుండటంమూలాన గోడలు తెల్లగా మెరుస్తూ వింత కాంతి నిస్తున్నాయి. నల్లబల్లకు క్రొత్తగా రంగువేశారు. నిగనిగ లాడుతోంది. మాస్టారి కుర్చీకి పైగా గోడమీద మహాత్మ గాంధి, వీరేశలింగం ప్రభృతుల చిత్రాలు, మధ్య తన పుత్రులను ఆశీర్వదిస్తూన్న భంగిమలో భరతమాతచిత్రం వేలాడుతూ కన్నులపండుగ్గా వున్నాయి. క్లాసంతా కొత్తకొత్తగా వుంది. చదివితే యిలాంటిగదుల్లోనే చదవాలి ఎంత హుషారుగావుంటుందో, ఎలాంటి తీయని భావాలను రేకెత్తిస్తుందో వర్ణించడం అసాధ్యం - అనుభవించి ఆనందించాల్సిందేగాని.

బడి తెరచిన మూడవరోజున అలా వెళ్ళి చూద్దునుగదా- గోడమీద బొగ్గుతో వేసిన ఓ బాలసైనికుని బొమ్మ వుంది. ఎవరు చిత్రించారోగాని భలే తమాషాగావుంది. గళ్ళగళ్ళ చొక్కా, మడమలపైకి మడచిన పొడుగు లాగు, తలమీద సైనికులు ధరించే టోపీ, నోట్లో సిగరెట్, నోటినుంచి వలయాకారంగా పైకెగసే పొగ, తీక్షణమైన చూపులూ - బొమ్మనుచూసి నవ్వాపుకోలేకపోయాను.

"శంకరం గీశాడురా, మళ్ళీ ఎవరితోనూ అనకు. మన కెందుకొచ్చిన పీడ" ఏదో కొత్తవిషయాన్ని కనిపెట్టినవాడిలా పోజుపెట్టి అన్నాడు రాధాయి.

"మనమా, హుఁ, చస్తే నరమానవుడితో చెప్పను"

క్లాసంతా క్రమంగా నిండిపోయింది.

మూడోగంట ఇంకో నిముషానికి కొడతారనగా విశ్వం ఆదరా బాదరా క్లాసులో ప్రవేశించాడు.

"బాలసైనికునిబొమ్మ చూశావా!" గోడవైపుచూపిస్తూ విశ్వంతో అన్నాను.

విశ్వం ఓసారి బొమ్మవైపు చూశాడు.

"శంకరం గీశాడు; ఎవరిచెవులోనూ ఊదకు మహాను భావా! నీకు పుణ్యముంటుంది"

"అలాంటి పనులుచేసేది నువ్వే.సరేగాని తెలుగుపద్యా లకు తాత్పర్యం వ్రాశావా ?"

"మనం ఎప్పుడో వ్రాశాం" సగర్వంగా జవాబిచ్చాను.

"అయితే నీ తెలుగునోట్సు కాస్త కావాలి. నేను ఆ విషయమే బొత్తిగా మరచాను"

"ఇంకేం వ్రాస్తావులే; మాస్టారు వస్తూంటే"

"మరేం ఫర్వాలేదు; పాఠం వింటూనే వ్రాస్తాను. ఏమనుకున్నావ్ విశ్వం అంటే – సవ్యసాచిని చంపిపుట్టాడు"

"నీ యిష్టం" తెలుగుపుస్తకంతీసి విశ్వానికిచ్చాను.

ఇంతలో విశాలరావుమాస్టారు క్లాసులోకిరావడం జరిగింది. మేము మా పురాణాన్ని ముగించాం.

"గోడలన్నీ ఇలా ఖరాబుచేసిం దెవర్రా? ఊఁ,త్వరగా చెప్పాలి" అన్నారు మాస్టారు.

క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. విశాలరావుమాస్టారి ముఖంలో కోపచ్ఛాయలు ఆవరించాయి.

"ఈ పని చేసినవా డెవ్వడో వెంటనే నిలబడి తనతప్పు ఒప్పుకోవడం మంచిది. తెల్లటిగోడను ఇలా ఖండాలంచేయాల్సిన అగత్యం ఏమొచ్చిపడింది?"

ఎవరూ నిలబడలేదు; తప్పును ఒప్పుకోనూలేదు. విశాలరావుమాస్టారి కోపం ఘనుమసించింది.

"ఇలా వినండి; మీ క్లాసును పరిశుభ్రంగా, చూడముచ్చటగా వుండేట్లు చూసుకోవడం మీ విధి"

"ఇలాంటి పిచ్చిబొమ్మలు గీసి గోడలను ఖరాబుచేయడం తగనిపని. చక్రపాణీ, నువు మానేటరువుకదా, ఈపని ఎవరు చేశారంటావ్ ?"

"నాకే విషయం ఏమీ తెలియదండి. నేను వచ్చేసరికే ఈ పని జరిగిపోయింది"

"విచిత్రంగావుందే. ఎవరికీ తెలియని ఈ అజ్ఞాత చిత్రకారు డెవడు? నిన్న సాయంత్రందాకా మామూలుగా నేవున్న గోడలు యివాళ ప్రొద్దుటి కిప్పుడే యింత పని ఎలా జరిగిందో తెలియకుండావుంది. క్లాలో మొట్టమొదట వచ్చినవారెవరో నిలబడండి"

ఎవ్వడూ నిలబడలేదు. ప్రతివాడు తను క్లా సంతా నిండినతర్వాతగాని రాలేదని ఎన్నో ప్రమాణాలతోసహా నిరూపించాడు.

క్లాసులో ఇంత హడావుడి జరుగుతున్నా విశ్వాముట్టుకు తనపనిలో తాను పూర్తిగా నిమగ్నుడై పోయాడు.

రెండవ పీరియడులో హెడ్మాస్టారు వచ్చారు. హెడ్మాస్టారని గొప్ప చెప్పడంలేదు. స్వతహాగా వారు శాంతస్వభా

వులు, దయార్ద్రహృదయులు. మీదుమిక్కిలి పిల్లలంటే ఎన లేని కరుణ, వాత్సల్యంగలవారు. కాని వారినిచూస్తే నా కెందుకో భయంవేస్తుంది. ఆరడుగులకు మించిన ఎత్తు, అందుకు తగినలావు, బుర్రమీసాలు, పొడుగాటి ఒదులుకోటు మీద మిలమిలా మెరిసే పెద్ద గుండీలు, కళ్ళజోడు - ఈ విగ్రహాన్ని కొత్తవా డెవడైనా మొదటిసారిగా చూసేడంతట సిస్తే హడలెత్తి అరమైలుదూరం తిరిగి చూడకుండా పరుగుతీయాల్సిందే !

హెడ్మాస్టారు మా అందరివైపు చూస్తూ మధ్యమధ్య బుర్రమీసాల్ని సవరించుకుంటూ ప్రారంభించారు. క్లాసంతా నడిరేయిలా నిశ్శబ్దంగావుంది. "మనబడి ఆస్తి పాస్తులకు - అంటే కుర్చీలకు, బెంచీలకు, గోడలకు ఏవిధమైన నష్టంకలిగించేచర్యలు మనం చేయకూడదు. మీరంతా బుద్ధిమంతులని నాకు తెలుసు. ఈ బొమ్మగీసిన పిల్లవాడు కూడ తనబడికి నష్టంకలిగించాలనే ఉద్దేశ్యంతో ఈపని చేయ లేదనీ నాకు తెలుసు. అందుచేత మీలో యీ బొమ్మ వేసిన వాడు లేచి తనతప్పును ఒప్పుకుంటే ఎంతో సంతోషిస్తాను. ఇలాంటిపనిని తెలిక చేసిన అమాయకునిగా భావించి క్షమిస్తాను" అంటూ మమ్మల్ని ఉద్బోధించారు.

ఎవరూ ఏమీ జవాబివ్వలేదు. శంకరం తలవంచుకుని కూచున్నాడు. ఓ అయిదునిముషాలైన తర్వాత హెడ్మాస్టారు నెమ్మదిగా క్లాసునుండి వెళ్ళిపోయారు.

నాలుగోపీరియడు అయిన తర్వాత చక్రపాణి అన్నాడు. "చూడు శంకరం! ఎలాంటిపని చేశావో! అయిందేదో అయి

పోయింది. హెడ్మాస్టారిముందు గనుక తప్పు ఒప్పుకుంటే ఎంత బావుండేది..."

"ఆలోచించకుండా ఏదో యాదాలాపంగా గీశాను,"

"దీనివల్ల ఎవరిక్లాసుకి చెడుపేరు వచ్చిందంటావ్?"

"క్లాసంతకూ ఎందుకువస్తుంది?"

"ఎందుకు రాదు? మనం సహాధ్యాయులమైనప్పుడు, నిన్నంటే మమ్మల్ని అన్నట్లుకాదూ"

"సరే. ఇకముందు యిలాంటిపని చేయను... చేయను... చేయను" అనిశంకరం గబగబాలేచి ఓ పాతగుడ్డ తీసుకుని ఆ బొమ్మను తుడిచాడు. దాంతో గోడ మరికాస్త పాడైంది. చూసేందుకు అసహ్యంగా తయారైంది. ఇప్పుడు బాలసైనికుని చుట్టూ గాఢమైన మబ్బుపట్టింది.

"ఇక చాల్లే, అన్ని తిక్క శంకరంపనులూ నీవూను. చేసిన ఘనకార్యాలు చాలుగాని ఆ పాతగుడ్డ యిలా యివ్వు" చక్రపాణి శంకరంచేతిలోని పాతగుడ్డతీసుకుని వెళ్ళిపోయాడు.

సాయంత్రం మేము ఫుట్ బాల్ ఆడుకున్నాం. ఆట పూర్తయేసరికి కనుచీకటిపడింది.

"మా యింటికి రావోయ్ వేణూ. భలే భలే తమాషాలు చూపిస్తాను" విశ్వం దారిలో కనపడి పిల్చాడు. మొదట సందేహించానుగాని తరువాత వెళ్ళి ఆ తమాషాలేమిటో చూద్దామని నిశ్చయించుకున్నాను.

మా వీధిలోనే మా ఇంటికి ఓ పదిఇళ్ళఅవతల విశ్వం వాళ్ళయిల్లు మా వీధిలోకల్లా చిన్నఇల్లు అది. ఎప్పుడో

తాతలనాడు కట్టించిన కొంప. శిథిలావస్థలో వుంది. ఈ ఇంట్లో విశ్వం ఎలావుంటాడో అని నా కాశ్చర్యం వేసింది.

"లోపలికి రావోయ్, భయపడక. ఇప్పట్లో ఏం ఢోకా లేదు యీ ఇంటికి. అయినా అద్దెమాత్రం పదిరూపాయలకు దమ్మిడీ తగ్గదు"

"నే నింటికి వెళ్తాను. ఇప్పటికే చాలా ఆలస్యమైంది"

"ఏం పర్వాలేదు. ఇప్పుడే వెళ్దువుగాని"

"అమ్మా" బిగ్గరగా పిలిచాడు విశ్వం.

"ఇప్పటిదాకా ఏం జేస్తున్నావురా విస్సాయ్, నీ కెన్ని సార్లు చెప్పాలి?"

"అమ్మా. అమ్మా - యీ అబ్బాయి... వేణు, నా స్నేహితుడు. క్లాసులో మే మిద్దరం ఒకే బెంచీమీద కూచుంటాం"

"అయితే లోపలికిరండి" స్వరంలో మొదటికాఠిన్యం లేదు.

నేను విశ్వంముఖం వంక పరకాయించి చూశాను. నుదుటిమీద, బుగ్గలమీద ఎర్రటి రోడ్డుదుమ్ముపడి మాసికలు వేసినట్లుగావుంది. తలసంగతి వేరేచెప్పనవసరంలేదు. దుమ్ము, చిన్నచిన్న గడ్డిపరకలూ—మహాప్రభో, ఆ తలకంటే ఓ చెత్త కుండీ వందరెట్లు నయంగావుంది. విశ్వం నా బుజంతడుతూ అన్నాడు.

"రా, శుభ్రంగా ముఖంకడుక్కుందాం"

మేము మరోగదిలోకి వెళ్ళాం.

"సుభద్రదపిన్నీ--యీ అబ్బాయి ఎవరో తెలుసా... వేణు, మా క్లాసే"

సుభద్ర చాలచిన్నది. ఇరవై ఏళ్ళలోపు వయసు వుంటుంది. నేను చూడగానే ఆమె విశ్వంఅక్కయ్య కామో అనుకున్నాను. సుభద్ర నావంకచూసి చిన్న మందహాసం చేసింది. ఎంత అందమైనముఖం! నేను చదివిన కథల్లోని దేవకన్యలా వుంది. విశ్వం వెళ్దాం పదమన్నాడు. ఇద్దరమూ ముఖం కడుక్కు నేందుకు బయల్దేరాం."

"నీకు జంతువులంటే ఇష్టమేనా" ముఖానికి సబ్బు పట్టిస్తూ విశ్వం అన్నాడు.

"ఓ, ఇష్టమే. అలాగని సింహాలు, పులులు, మొసళ్ళన్నా ఇష్టమే అనుకోకు. అవి మంచివికావు. పీకి పాకాన పెడతాయి. అవునా?"

"పోనీ చిట్టెలుకలో"

"ఛీ ఛీ. వెధవ్వి. ఇంట్లో ఏ వస్తువునూ బ్రతకనీయవు. పైగా తెగ నసపెడతాయి. అవునా?"

"అవేం నసపెట్టవ్. కొందరు మనుషులకంటె చాల నయం. నీ వెప్పుడన్నా పెంచిచూచావా?"

నేను అడ్డంగా తలత్రిప్పాను.

"నేను చిట్టెలుకల్ని పెంచుతున్నాను. వాటికోసమని ప్రత్యేకంగా ఓ బంగళాకూడ కట్టాను."

"పిచ్చి లక్షవిధాలు. అందులో ఇదోరకం"

"సరేగాని త్వరగా తెముల్చు, చిట్టెలుకల్ని చూపుతాను"

మేమిద్దరం ముఖం కడుక్కుని సామాన్ల గదిలోకి వెళ్లాం. ఆగదిలో ఓ పాతకుర్చీ, దానిక్రింద విశ్వం చెప్పినట్లు జాజిచెక్క లతో కట్టిన ఓ చిన్న బంగళా, ధారాళంగా గాలివచ్చేందుకు చాలినన్ని కిటికీలు అమర్చబడివున్నాయి. చిట్టెలుకలు నిర్భయంగా ఆ బంగళాలో విహరిస్తున్నాయి. ఆ చిన్నచిన్న జంతువుల చిలిపిచేష్టలు చూస్తూంటే బలే సరదాగావుంది.

"ఏమిటివి, యిలావున్నాయి?" అనుమానం వేసి అడిగాను.

"పిటిసి చిట్టెలుక లంటారు."

"మరి చిట్టెలుకలు యిలావుండవుగా, ఇవి తెల్లగా వున్నాయే!"

"నువ్వెప్పుడూ తెల్లచిట్టెలుకలు ఉంటాయని విన లేదా?"

"ఉఁహూఁ"

విశ్వం బంగళాతలుపులు తెరచి ఓ చిట్టెలుకను బయటికితీసి, పట్టుకోమని యిచ్చాడు. మంచులా తెల్లగా వుంది. కాని తోకమాత్రం ముదురు ఎరుపురంగులో వుంది. నా తొడమీద కూచోబెట్టుకున్నాను. శాంతంగా కూచుంది. అప్పుడప్పుడూ కొద్దిగా కదులుతూ తన చిట్టి మూతితో నా లాగూను వాసనచూస్తోంది.

"నువ్వు పెంచుకుంటానంటే ఓ జత ఇస్తాలే, తీసికెళ్దువుగాని"

నేను సరేనన్నట్లుగా తలతిప్పాను.

విశ్వం వెంటనే దగ్గరగావున్న ఓ చిన్న చెక్కపెట్టె తీసుకుని దాంట్లో ఓ జత చిట్టెలుకల్ని పెట్టాడు. పెట్టెను భద్రంగా జేబులో పెట్టుకున్నాడు.

"ఊఁ పద, నేను పట్టుకొస్తాలే"

ఎనిమిది కావస్తోంది. ఐదునిముషాల్లో మాయింటికి చేరాం. ఇంత ఆలస్యంగావచ్చినా చీవాట్లు పెట్టకపోవడం చూసి ఆశ్చర్యంవేసింది. ప్రక్కన విశ్వం వుండటంవల్లనే యిలాజరిగిందని తెలుసుకునేందుకు అట్టేసేపుపట్టలేదు.

"నాతరగతే, పేరు విశ్వేశ్వరరావు" అని అమ్మకు పరిచయంచేశాను.

"నన్ను అందరూ 'విశ్వం' అనే ముద్దుగా పిలుస్తారండీ"

"అలాగా, బావుంది మరి నువ్వు యీ బడికి కొత్తా?"

"అవునండీ. ఈ స్కూల్లో యీ సంవత్సరమే చేరాను."

"ఇంతకుముం దెక్కడ చదివావు ?"

"బాపట్లలో"

"మరి మీవూళ్లో హైస్కూలు లేదా ?"

"లేకేమండీ, ఉంది. కాని మాసుభద్రపిన్ని కాలేజీలో చేరాలంది. ఆ వూళ్లో కాలేజి లేదుగా, అందుచేత యీవూరు వచ్చాం."

"మరి నీకు యీ వూళ్ళో బావుందా, మీ ఊళ్లో బావుందా ?"

"మా ఊళ్లోనే బావుంటుంది. అయినా యీ వూరు కూడా బాగానేవుంది."

"నువ్వు మంచివాడివిలా కన్పిస్తున్నావురా అబ్బాయ్"

"నేనా ? మాఅమ్మ నన్ను ఒట్టి బడుద్ధాయి అంటుందే"

"ప్రేమచేత పెద్దవాళ్ళు అలా అంటూంటారు నాయనా"

"నాకు ఓ జబ్బు వుందిలెండి. మరేమీ కాదు. సక్రమంగా పాఠాలు చదవకపోవడమే"

"అయితే మా వేణూ నువ్వూ ఒకటేనన్న మాట. ఇద్దరూ ఇద్దరే. వేళకు పాఠాలుచదవని మొద్దులు. ఇకనైనా జాగ్రత్తగా చదువుకోండి. మీకేమంచిది"అని అమ్మ వెళ్ళింది.

ఇంతలోకి మా సుగుణ ఎక్కడినుంచో ఊడిపడింది.

"నా చెల్లెలు - సుగుణ. పేరువిని మోసపోయేవు. పేరుకే సుగుణ. ప్రవర్తనలో దుర్గుణ. ఉత్త మొండిఘటం - ఏమే సుగుణా, అవునా ?"

"సంతోషించాం తెలివికి" అంది సుగుణ దీర్ఘాలు తీస్తూ.

"నాకు యిలాంటి చెల్లెలుంటే ఎంత బావుణ్ణు ! కనీసం ఓ చిన్న తమ్ముడుకూడ లేడు నాకెవ్వరూ లేరు"అంటూంటే విశ్వం కళ్ళల్లో నీళ్లు నిండాయి.

"నీకు చెల్లాయన్నా, తమ్ముడన్నా చాలా యిష్టమన్న మాట!" సుగుణ అమాయకంగా అంది.

"కొద్దిగానా, చాలాయిష్టం. నేను వాళ్ళకోసం కొత్త కొత్త బొమ్మల్ని చేశేవాణ్ణి. బజారునుంచి తీయతీయని మిఠాయి కొని తెచ్చేవాణ్ణి. వాళ్ళను ఆడించేవాణ్ణి. ఇంకా ఎన్నో గమ్మత్తులు చేసేవాణ్ణి.

"మీ అమ్మకి ఉద్యోగం ఎక్కడ ?" ధోరణిమార్చే ఉద్దేశ్యంతో అన్నాను.

"ఖద్దరుపడికే సంఘంలో—"అని

"సరేగాని సుగుణా, నీకు చిట్టెలుకలంటే యిష్ట మేనా ?" విశ్వం తలతిప్పుతూ సుగుణవైపుచూసి అన్నాడు.

"చిట్టెలుకలా, ఛీ! అవి మంచివికావు" సుగుణ అదో విధంగా ముఖంపెట్టి అన్నది.

"ఎందుకని ? నేను రెండుచిట్టెలుకల్ని తెచ్చాను, చూస్తావా ?"

"నాకొద్దు బాబోయ్ ! మా వేణుకు చూపించు"

"వేణు యిందాకే చూశాడు. దీన్ని చూడు, ఎంత బావుందో !"

విశ్వం జేబులోంచి పెట్టెను జాగ్రత్తగా బయటికితీసి ఒకదాన్ని సుగుణ కివ్వబోయాడు.

"కరుస్తుందేమో!" సుగుణ ఒక అడుగు వెనక్కువేసి అంది.

"అబ్బే! చాలా సాధువు"

సుగుణ విశ్వంచేతిలోంచి నెమ్మదిగా దాన్నితీసుకుని, పరీక్షించసాగింది.

"వెళ్ళొస్తాను వేణూ—సుగుణా, వెళ్లొస్తాను"

"మంచిది"

విశ్వానికి వీడ్కోలిచ్చాం. వెంటనే మేము సామాను గదిలోంచి ఓ పెద్ద బిస్కత్తులపెట్టె తెచ్చాము. దాన్ని ఓ

యిల్లుకిందమార్చాం. కిటికీలు, ద్వారాలూ పెట్టాం. ఆ పెద్దయింట్లో అవి అటూ ఇటూ తిరుగుతూంటే మాకు పట్టరాని సంతోషం కలిగింది.

ఈ గొడవలోపడి చదువుసంగతే మరచాను. తీరా చూద్దునుగదా తొమ్మిదైంది. అమ్మవస్తున్న చప్పుడైంది గప్‌చిప్‌గా లెక్కలపుస్తకం తీసి సంచీలో పెట్టాను. ఎందుకొచ్చిన రభస, అమ్మ 'యింకా లెక్క చేయనేలేదురా వేణూ' అంటూ నాలుగు చీవాట్లువేయడం, నాన్న 'లెక్క చెబుతాను వుండు' అంటూ వచ్చి, వీపుమీద తాషామర్పా ప్రయోగించడం— యిదంతా కోరి నెత్తిన కొరివిని తెచ్చిపెట్టుకున్నట్లు! హాయిగా రేపు క్లాసులో ఎవడిపుస్తకంలో చూసి వేసుకున్నా తీరిపోతుంది.

నే నీ అవస్థ పడుతూంటే సుగుణ సరదాగా చిట్టెలుకలతో ఆడుకొంటోంది.

నేను నెమ్మదిగా వెళ్ళి వెనుక నిలబడ్డాను.

"ఎంత మంచివాడురా వేణూ!" సుగుణ అంది.

"ఎవరు...విశ్వమా?"

"ఊఁ"

"చాలా మంచివాడు"

"ఎప్పుడూ నవ్వుతూ చక్కగా మాట్లాడతాడు"

నేను విశ్వాన్నిగురించి దానికి చెబుదామనుకున్నాను— ఎప్పుడూ పాఠాలు సరిగా చదవడనీ, క్లాసులో అందరిపుస్తకాల్లోచూసి వ్రాసుకుంటాడనీ, ఒట్టి మతిమరుపు మనిషనీ.

కాని చెప్పేందుకు తటపటాయించాను. అది చప్పున "అన్నిట్లోను నీ కంటె నయమే" అంటే ఏమౌతాను. అంటుంది కూడాను. ఏమాత్రం సందేహంలేదు. మా సుగుణకంట్లో నేనో గడ్డిపోచనని మీ కిదివరకే చెప్పానుగా. అందుకే "చాల మంచివాడు"అని మాత్రమే అనగలిగాను.

# 4

నాకిప్పుడు సరిగా జ్ఞాపకంలేదు గాని, ఓ వారం రోజులతర్వాత అనుకుంటా మా క్లాసు వార్తాపత్రిక సంపాదకుడు మధు విశాలరావుమాస్టారుతో అన్నాడు :

"మన పత్రిక సంపాదకవర్గంలో బొమ్మలుగీసేవాళ్లు ఎవరూ లేరండీ, బొమ్మలు లేకపోతే పత్రిక బాపుండదు గత సంవత్సరం బొమ్మలువేసిన మూర్తి యిప్పుడు లేడాయె. మనకో చిత్రకారుడు కావాలి."

"శంకరం ఉన్నాడుగా. ఏమోయ్ శంకరం! నువ్వు గీసిన చిత్రాలేమైనా ఉన్నాయా ?"

"ఉన్నాయండీ" అని శంకరం జవాబిచ్చాడు.

"అయితే రేపు క్లాసుకు తీసుకువస్తావుకదూ ?"

"సరేనండి"

శంకరం మరునాడు షుమారు వంద చిత్రాలుగల పసుపురంగు ఆల్బం తెచ్చాడు. విశాలరావుమాస్టారు ఒక్కొక్కబొమ్మనే జాగ్రత్తగాచూస్తూ, మధ్యమధ్య శంకరం కళానైపుణ్యాన్నిగూర్చి వ్యాఖ్యానిస్తున్నారు.

మబ్బులనుతాకే శిఖరాగ్రాలు, వాళ్లాళ్లపోకానికి దారులుతీసే పచ్చనిలోయలు, ఎంతో ఎత్తునుంచి పరుగుపందె

గానివలె క్రిందికిదుమికే జలపాతాలు, ఫలవృక్షభరితములైన సుందరోద్యానవనాలు, గంభీరమైన, అనంతమైన నీలిసంద్రము - దానిలో పయనించే ఓడలజాడలు ఎంతో మనోహరంగా, మనోజ్ఞంగా చిత్రించబడ్డాయి. విశాలరావుమాస్టారు యిలా చూస్తూచూస్తూ ఓ పేజీ తీసేసరికి హఠాత్తుగా గళ్ళగళ్ళ చొక్కా, నోట్లో సిగరెట్ పైప్‌గల బాలసైనికుడు ప్రత్యక్షమయ్యాడు. గోడమీదగీసిన బాలసైనికుని బొమ్మకూ దీనికీ తేడా ఏమీ లేదు. విశాలరావుమాస్టారు శంకరంవైపు ఓసారి తీక్షణంగా చూసి "అయితే ఆ బొమ్మగీచింది నీవన్నమాట?" అన్నారు.

"ఆ గోడమీద బాలసైనికుని బొమ్మగీచింది నేనేనండి"

"బుద్ధిమంతుడివి. మరి యీ తెలివితేటలు హెడ్మాస్టారి ముందు ఏమయ్యాయి? అప్పుడేగనుక తప్పు ఒప్పుకునివుంటే ఎంతబావుండేది? దీనికేం జవాబు చెబుతావ్?"

"ఏదో తెలీక చేశానండి. ఇంకెప్పుడూ చేయను మాస్టారూ......"

"మంచిది; ఇప్పటికైనా చేసినదితప్పుని ఒప్పుకున్నావు, చాల సంతోషం ఈ పీరియడు అయినతర్వాత హెడ్మాస్టారు వద్దకువెళ్ళి క్షమార్పణ కోరుకో; తెలిసిందా?"

శంకరం హెడ్మాస్టారువద్దకువెళ్ళి క్షమాపణ కోరాడు.

"మనస్కూలుకు ప్రభుత్వంవారు ప్రతిఏటా చాలా ధనం యిస్తున్నారు. మనం దానిని దుర్వినియోగపర్చకూడదు. ఏమీ తెలియని అజ్ఞానంలో యీపనిచేశావని విశ్వసిస్తూ నిన్ను యీసారికి క్షమిస్తున్నాను. నీవు వెంటనేవెళ్ళి ఆ బొమ్మవేసిన

చోట శుభ్రంగా వెల్లవేయి. తెలిసిందా?'' అంటూ స్కూలు ప్యూనుచేత ఒక బొక్కెనలోసున్నం, కుంచె యిప్పించారు.

శంకరం బొమ్మవున్నంతమేర గోడకు శుభ్రంగా వెల్ల వేశాడు. ఇప్పుడా గోడ పూర్వంలాగా మిలమిల మెరుస్తోంది.

మాలో చాలమందికి యీశిక్ష విధింపు కొత్తగావుంది. ఇంతకుపూర్వం ఫలానా తప్పుచేసినవాడికి యిన్ని దెబ్బలని కోటా వుండేది నాకు మట్టుకు యిప్పుడు హెడ్మాస్టారు వేసిన శిక్ష చాలాబావుంది.

మేము శంకరాన్ని విశాలరావుగారి మాటప్రకారం మా క్లాసుపత్రికకు చిత్రకారునిగా ఎన్నుకున్నాం.

విశ్వం ఉపదేశానుసారంగా నేను యింటి లెక్కలు చేయడానికి పూర్తిగా స్వస్తిచెప్పాను. క్లాసుకుకాస్తముందుగా వెళ్ళి ఎవరిపుస్తకాన్నో తీసుకోవడం, గుట్టుచప్పుడు కాకుండా నా పుస్తకంలో ఆ నాలుగులెక్కలు ఎక్కించుకోవడం – యిదీ కార్యక్రమం.

సాఫీగా జరిగిపోయే యీ కార్యక్రమానికి అడ్డుపుల్లలు వేయడం సాగించాడు చక్రపాణి. ఏదోవిధంగా, మన కెందు కని యెంత సర్దుకుపోతున్నా మరీ పెచ్చరిల్లిపోతున్నాడు. అసలు నా ఉబుసు వాడి కెందుకు? ఏముందీ – దారినపోయే వాడిని పిలిచి పేచీలు వేసుకొనేరకం.

ఒకరోజున నేను క్లాసులో కూర్చొని విశ్వం పుస్త కంలోని లెక్క వేసుకుంటున్నాను. ఏదో పెద్ద పనివున్న వాడిలా వచ్చాడు చక్రపాణి. వచ్చినవాడు వూరుకోవచ్చు,

కాపీ చేయడం తెలివితక్కువపనంటూ హితబోధకు పూను కున్నాడు.

"ఇలా నాదగ్గర పూకదంపు ఉపన్యాసం ఒలకబోసే కంటే యే పార్కులోకో వెళ్ళి ఓ సభచేస్తే సరి – పేరుకు పేరు........."

"కాపీచేసేదిసెవ్వుగాని వ్రాళ్ళోళ్ళవాళ్ళుకాదుగా-అందుకే నీకు చెబుతున్నాను."

"వినే వెధవాయ్ యెవడన్నా వుంటే యిలాంటి ధర్మో పన్యాసాలు నేనూ చెప్పగలను మిత్రమా!"

"ఇలా యితరుల పుస్తకాల్లో చూసి వేసుకుంటే నీకు లెక్కలు వచ్చినట్టే!"

"పోనీవోయ్, రాకపోతే, ఏం ఫర్వాలేదు."

"అని నాకు తెలుసు."

"మరి తెలిస్తే ప్రతివాళ్ళ స్వవిషయాల్లోనూ అడ్డు పడే యీ సైంధవబుద్ధి యేమిటి?"

"ఐతే నేను నీ దృష్టిలో సైంధవుణ్ణన్నమాట?"

"ఆహా, అక్షరాలా........."

"తొందరపడకు మిత్రమా,........." చక్రపాణి నా వంక చురచుర చూస్తూ చరచరా నడిచివెళ్ళాడు.

చక్రపాణితో యింత నిష్కర్షగా మాట్లాడ్డంవల్ల యే పీడ వస్తుందోనని లోపల పీకుతూనే వుంది. నేను ఊహించినట్టే అనుకున్నంతపనీ అయింది మర్నాడు నేను క్లాసుకు వెళ్ళే సరికి – నల్లబల్ల ప్రక్కగా – నేను లెక్కచేసేందుకు నిలబడి, గాడిదచెవుల్లాంటి పెద్ద చెవులతో యెవరో అందిస్తూంటే విన

డానికి యత్నిస్తున్నట్లుగా ఓ బొమ్మ అంటించబడి వుంది. దాని క్రింద యెవరో కవికుమారుడు ఓ పద్యంకూడా వ్రాశాడు.

ఇదు గిదుగో వింతగాడిద
ఎబ్బెబ్బె! గాడిదకాదు
లెక్కలురాని వేణూ గాడిద
చాటుగ చెపితే వినటానికి
ఎంతపెద్ద చెవులో చూడు

నాకు సరిగా గుర్తులేదుగాని, యీ భావం వచ్చేట్లుగా వ్రాసివుంది. ఎంత ధైర్యం వీడికి - ఇంకెవరున్నారు, శంకరం గాడే యీ చిత్రాన్ని గీచివుంటాడు. మహాచెడ్డకోపం వచ్చింది. వెధవ! అందుకే కాబోలు నేను క్లాసులోకి రాగానే పుస్తకం అడ్డుపెట్టుకుని ముసిముసి నవ్వులు నవ్వుతూ కూచున్నాడు. ఐనా అడిగితే సరి, నన్ను యింత నగుబాటుచేసే అవసరం వీడి కేమొచ్చిపడిందో!

తిన్నగా శంకరం కూచునే బెంచీ దగ్గరకు వెళ్ళి అన్నాను.

"ఏమండీ తిక్కశంకరులూ! ఇవేం పనులు? ప్రతి వాళ్ళబొమ్మలు వేసి గోడలు ఖరాబుచేసే ఉద్యోగం ఎన్నాళ్ళ నుండి? మర్యాదగా ఆ బొమ్మను మడిచి సంచీలో పెట్టుకో - ఏం?"

"మాటలు కాస్త తిన్నగా రానియ్. నన్ను గీయ మన్నారు; గీచాను. అంతవరకే నా బాధ్యత. కావాలంటే మధు నడుగు"

నేను నేరుగా మధువద్దకు వెళ్ళాను.

"ఇది తమరి పనన్నమాట! ఊఁహూఁ. నా బొమ్మ అంటించే అవసరం యేమిటో తెలుసుకోవచ్చా?"

"ఆ విషయం చక్రపాణి నడుగు. ఆ గేయం వ్రాసింది కూడా వాడే. క్లాసులో అందించడమునే జబ్బు పోగొట్టేందుకు యిలా చేయాలని నిశ్చయించుకున్నాం."

నేను మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ చక్రపాణివద్దకు వెళ్లాను.

"తమరి ఘనకార్యమన్నమాట యిది! చాల సంతోష మైంది. దాన్ని అక్కడినుంచి త్వరగా తీసేయండి- లేదా..."

"ఊఁ, లేకపోతే......"

"నిన్ను పచ్చడిచేస్తాను. జాగ్రత్త."

"అంటే?"

"ఓహో! పచ్చడంటే నీకు యిష్టంలేదన్నమాట. పోనీ పిండిచేస్తానులే, బావుంటుందా?"

"నీ ఒక్కడివేనా లేక యింకేవరన్నానా?"

"అబ్బో, పెద్దవస్తాదు బయల్దేరాడు. ఈయన్ను పిండి చేసేందుకు యింకొకడు కావాలిట..."

"సరేలే, ఏమాత్రం చేస్తావో చూద్దాం"

"ఏఁవిటోయ్ చూసేది. నేనే ఆ కాగితాన్ని అక్కడి నుండి తీసేస్తాను. ఎవడొస్తాడో చూస్తాను... ..."

"అది తీయి తెలుస్తుంది. దాంట్లోఉన్నది అబద్ధమైతేగా. చెప్పుకునేదేదో స్కూలు లీడరుదగ్గర కెళ్ళి చెప్పుకో...నా దగ్గరెందుకు?"

"చెప్పుకోక, ఊరుకుంటా మేమిటి?"

అప్పటికే క్లాసువాళ్ళందరూ రావడం, బొమ్మవంక చూసి నవ్వుకోవడం, వేళాకోళాలు చేయడం సాగింది. ఏమైతే అదవుతుందని స్కూలులీడరును కలుసుకొని కథంతా వ్రాస ఇచ్చినట్లు చెప్పాను. ఈ అవమానంనుండి తప్పించమని కోరాను.

"అయితే విను. నీవు యికనుండి సక్రమంగా హోంవర్కు చేస్తానని, ఎవరి పుస్తకంలోంచి చూసివేసుకోనని వాగ్దానపత్రం వ్రాసియివ్వాలి. అప్పటిదాకా నీ బొమ్మను తీసివేయడానికి వీలుకాదు"

నేను స్కూలులీడరు చెప్పినట్లుగా వ్రాసి క్రింద సంతకం పెట్టి యిచ్చాను.

మరుసటిరోజు నా బొమ్మ అక్కడలేదు. ఎంతో సంతోషమైంది ఏదో ఘనకార్యం చేసినవాడిలా సంతృప్తి పడసాగాను. కాని విశాలరావుమాస్టారు రేపే క్లాసులో లెక్కల పరీక్షని చెప్పడంతో నా ఉత్సాహం సగమైంది. రేపు లెక్కల పరీక్ష – ఓరిభగవాన్ ! నాకు నోటిలెక్కలు చేయడంకూడ సరిగారాదే, ఎలా ఏడ్చేది ?

లెక్కలపరీక్షలో నా మామూలు 2 మార్కులు వచ్చాయి అవైనా విశ్వం మెల్లగా అందిస్తే వచ్చినబాపతే. నేననుకుంటే నాకుతోడుగా కిష్టాయి వున్నాడు. వాడికీ 2 మార్కులే వచ్చాయి. విశాలరావుమాస్టారు నా మార్కులను ఓ కార్డుమీదవేసి మానాన్నచేత సంతకం పెట్టించుకరమ్మని యిచ్చారు. దారిలో విశ్వం కలిశాడు. నా మార్కులసంగతి చెప్పాను.

"నేనో ఉపాయంచెప్పనా?"

"ఏమిటది?" ఆత్రంగా అడిగాను.

"మా రంగిడు చేసినట్లు చేస్తేసరి"

"ఇది వేళాకోళానికి సమయమేనా విశ్వం? నీకూ వేపకాయంత వెర్రి వుందన్నమాట. రంగడని కలవరిస్తున్నా వేమిటి?"

"నీకు తెలీదులే, మా వూళ్ళో వున్నాడు. వాడు లెక్కల్లో నీకు అన్నయ్య అవుతాడు. అప్పుడు వాడేంచేస్తాడో చెప్పనా?"

"ఊఁ చెప్పు"

"ఏముంది, ఇంటికి వెళ్ళేవాడు మూలగా ఓ పాత కుర్చీ వేసుకుని కూచునేవాడు. అప్పుడు వాడిముఖం చూశామో మనకు ఏడుపువస్తుంది. నిజం. అంటే చూపరులకు చప్పున జాలిపుట్టించేలా అంటే అంత దీనంగా పోజుపెట్టే వాడన్నమాట.

అప్పుడు వాళ్ళ అమ్మ వచ్చేది.

"ఏవిట్రా రంగా, అలా దిగాలుపడి కూర్చున్నావ్, ఏం జరిగింది నాయనా?"

"ఏమీ లేదు"

"మరి ఎందుకా ఏడుపు ముఖం?"

"ఊరికేనే"

"బళ్ళో యేదో అల్లరిచేసుంటావ్. మాస్టారేమన్నా కొప్పడ్డారా?"

"లేదు"

"ఎవరితోనైనా దెబ్బలాడావా ?"

"ఊహుఁ"

"ఏం చేయకపోతే యీ దిగులెందుకురా ?"

"ఏమో, తెలియదు"

ఈ విధంగా సంభాషణ నడిపేవాడు. ఏ ఒక్క ప్రశ్నకు సరైన జవాబులు యిచ్చేవాడుకాదు. భోజనానికూడ యెంతో బ్రతిమాలితేగాని వెళ్ళేవాడు కాదు. పోనీ వెళ్ళి సక్రమంగా భోజనంచేసేవాడా అంటే అదీలేదు. పీట మీద పద్మాసనం వేసుకొని దీనాతిదీనంగా తల్లిముఖం లోకి చూస్తూ ఒక్కో మెతుకు నిదానంగా తీసి యే పీటకో, లాగూకో, చొక్కాకో తినిపిస్తూండేవాడు.

"భోజనంచేయవేరా ? కాస్త మజ్జిగతోనైనా తిను నాయనా"

"వద్దు" ముద్దులుకురిపిస్తూ అనేవాడు.

"ఆకలి లేదా యేం కర్మ"

"ఊహుఁ"

"ఐతే వెళ్ళి పడుకో"

"నిద్ర రావటంలేదు"

"ఇదేం జబ్బురా ? ఏమీ లేదంటావు. ప్రతిదానికి తల అడ్డంగా తాటిబుర్రలా తిప్పుతావు. ఏమిటో సరిగా చెప్పు నాయనా........"

"ఏమీ లేదమ్మా"

ఒళ్ళు వెచ్చబడిందేమోనని ధర్మామీటరు చంకలో

పెట్టి చూసేది. మరి నోరు తెరవడుగా! సుపుత్రుడు. మామూలుగా 98 . 4 వుండేది.

"ని వేదో దిగులు పెట్టుకున్నావ్. నాతో చెప్పు, మా బాబుగా!........ నేను మీ అమ్మను కదూ. ఏమీ అనను. ఊఁ త్వరగా చెప్పాలి."

ఇంత బుజ్జగింపు జరిగినతర్వాత వినీవినపడనట్లనేవాడు:

"నాకు......"

"ఊఁ, చంపక త్వరగా తెములు"

"నాకు లెక్కల్లో 2 మార్కులు వచ్చాయే"

"అందుకోసమన్న మాట - ఇంతనాటకం ఆడింది"

"ఊఁ" ఖైదీలా బెదురుచూపులు చూస్తూ అనేవాడు.

"ఈసారికి వస్తే వచ్చాయ్‌గాని, యికనుంచైనా బాగా చదువు. తెలిసిందా?" అనేది.

'అంతేరా వేఁబా, వాడు పడిన కష్టమంతా ఫలించేది. వాళ్ళమ్మ ఒక తిట్టుకూడా తిట్టేదికాదు.' అన్నాడు విశ్వం.

రంగడు చాల తెలివైనవాడని, ఎంతో యుక్తిపరుడని అనుకున్నాను. నేనుకూడా అలా చేస్తే......ఓ, అమ్మకూడ నన్ను యేఁమీ అనదు.

ఇంట్లో ఓ మూలగా కాళ్లురెండు ముడుచుకుని కూచున్నాను. తల పక్కకు వాల్చి కుడిచేతితో పట్టుకున్నాను. చెక్కుచెదరకుండా వున్న క్రాపును చిక్కిరిబిక్కిరిగా రేపేశాను. ఏడుపుముఖం పెడదామనుకున్నానుగాని - దాన్ని తగలేసి - ఎంతసేపటికి కుదిరిందికాదు. మా రఘును జ్ఞాపకం చేసుకున్నాను. ఐదేళ్ళకిందట చచ్చి స్వర్గానవున్న మా

అమ్మమ్మనుకూడ స్మరించాను. అందరూ సహాయం చేయడానికి నిరాకరించారు.

"ఎంతసేపు అయిందిరా వచ్చి" అమ్మగదిలోకి బెడ్ లాంప్ తీసుకొచ్చి అంది ఇలా చీకటిలో కూర్చోకూడదు నాయనా, పురుగు-పుట్రా వుంటాయి"

"ఇప్పుడే వచ్చాను. ఓ పదినిముషాలు అయివుంటుంది"

"లెక్కల్లో మళ్ళీ 2 మార్కులే వచ్చాయాఏమిటి?" మా అమ్మ సరిగానే ఊహించింది. సూటిగా నా ముఖంలోకి చూస్తూ అంది. ఆమె యిలాంటి విషయాల్ని యిట్టే గ్రహిస్తుంది. నేను జౌనని తలత్రిప్పడంమినహా ఏమిచేయడానికి అవకాశం లభించలేదు. వేసుకొన్న సుదీర్ఘ కార్యక్రమమంతా గాలిమేడవలె కూలిపోయింది.

మరుసటిరోజున ఓ వ్యంగ్యచిత్రం పూర్వస్థానంలోనే అంటించబడివుంది నాకు విశ్వానికి చొక్కాలమీద "2" అంకెలువేసి, మేము బజార్లవెంట పచార్లుచేస్తున్నట్లుగా చిత్రించారు.

ఇద్దరముకలిసి స్కూలులీడరువద్దకు వెళ్లాం. మా వాగ్దానపత్రాలను సమర్పించి ఆ చిత్రాన్ని తీసివేసేటట్లు చూడమని కోరాము.

"అలాగే. వెళ్ళిరండి" అన్నాడు

మేము స్కూలులీడరును ఎంతగానో అభినందించాం. విశ్వం యింతమంచివాళ్ళు లోకంలో చాలా కొద్దిమందే ఉంటారంటూ కొనియాడాడు.

మరునటిరోజు వెళ్ళిచూస్తే యథాప్రకారంగా మా బొమ్మ వుంది.

మేము నాలుగో పీరియడు కాగానే స్కూలులీడరును కలుసుకున్నాం. జరిగినకథను వినిపించాం.

"నేను తీసివేయమని చెబుతాను. త్వరలో యీ విషయంమీద ఓ సారి మీ క్లాసుల్లో చర్చ జరపాలను కుంటున్నాం. మీ విషయం అప్పుడు ఆలోచిస్తాం" అన్నాడు.

"అప్పటివరకు యిలా ఉండాల్సిందేనా?"

"ఆహా! ఇప్పుడు మనంచేసే కార్యక్రమం ఆషా మాషీ వ్యవహారం కాదు. మన స్కూలు గౌరవానికి సంబం ధించిన విషయం. విద్యార్థుల అభివృద్ధికి చేసినకృషిని తెలిపే యీ వ్రాతప్రతుల నన్నింటినీ జాగ్రత్తపరచడం జరుగుతుంది. భవిష్యత్తులో మీలో ఒకరు కవికావచ్చు, మరొకరు గాయ కుడు, యింకొకరు శాస్త్రవేత్త కావచ్చు. మీ జీవిత విశే షాలను భావితరాలవారికి తెలియపరచడంద్వారా మనం వారికి మార్గదర్శకులం అవుతాం. ఫలానా కవి, గాయకుడు లేక శాస్త్రవేత్త - గారివారి విద్యార్థి జీవితంలో యింత కష్ట పడి పైకివచ్చారని తెలుసుకునేందుకు అవకాశం కల్పించిన వారమౌతాం. ఏమంటావు?" అన్నాడు లీడరు మళ్ళీ.

నాకు స్కూలులీడరు చెప్పినదంతా నచ్చింది. చిన్న తనంనుంచి నాకు శాస్త్రవేత్త కావాలని-ప్రజలకు సుఖశాంతు లను ప్రసాదించే కొత్తకొత్త సాధనాలను కనిపెట్టాలని మహా చెడ్డఉబలాటం. నిజంగా నా కలలు ఫలించి, నేను గొప్పశాస్త్ర

వేత్తనై - ఏదో నూత్న విషయాన్ని కనిపెట్టాననుకోండి, అప్పుడు ప్రతివారు మా స్కూలు వార్తపత్రికలనుచూసి అనుకుంటారు "అలా చూడండిరా - క్లాసులో 2 మార్కులు వచ్చేవేణు, కష్టపడి చదవబట్టేకదా యింత గొప్పవాడైంది, కష్టే ఫలీ అన్న పెద్దలమాట వృధాపోతుందా ఎక్కడైనా" ...అని.

ఇలాంటి మధురమైన ఆలోచనలతో యింటివైపు సాగాను.

# 5

ఓ వారంరోజులు ఆ వ్యంగ్యచిత్రం గోడమీద వేలాడుతూనేవుంది రేపు సమావేశమనగా దాన్ని అక్కడనుంచి తొలగించారు. ఇప్పుడు సరిగా చెప్పలేనుగాని ఆనెల పత్రికలో మా వ్యంగ్య చిత్రంతోబాటు నేను విశ్వం వ్రాసిచ్చినవార్తాపత్రాలు, మా తరగతివాళ్లు రచించిన వ్యాసాలు, కథలు, గేయాలు వగైరా వున్నాయి.

చక్రపాణి మాకు సమావేశంలో ప్రతివిద్యార్థి చదువు ప్రివర్తననుగూర్చిన చర్చవుంటుందని, అందుకోసం సిద్ధంగా వుండమనీ హెచ్చరించారు.

మరుసటిరోజున సమావేశం ప్రారంభమైంది. మొదటగా విశాలరావుమాస్టరు - సమావేశం ఏర్పాటుచేయడంలోగల ఉద్దేశ్యాన్ని వివరించారు ఇలాంటి సమావేశాలు విద్యార్థుల పురోభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతాయని, సమావేశానికి అందరు హాజరైనందుకు తనకు చాలా సంతోషంగావుందని చెప్పారు.

"ప్రతివిద్యార్థి తనకు కష్టమైన విషయంలోనే యింకో ధికకృషి జరపాలి. ఏదో 30 మార్కులు వస్తాయి. కృతార్థులం కాకపోతామా అనే భావం వుండరాదు. అన్నిటికంటె ముఖ్యమైనది మరోటుంది. అది క్రమశిక్షణ. మన తరగతిలో క్రమశిక్షణ బొత్తిగా కొరవడింది. పాఠాలు చెబుతున్నప్పుడు గుసగుసలాడడం, తోటి విద్యార్థులకు జవాబులు అందించడం అలవాటు అయిపోయింది. ఇది చాల విచారకరమైనవిషయం. మీరు క్రమశిక్షణవలన, నియమబద్ధమైన కృషిద్వారా ఒక్క బడిలోనేకాదు, భావి జీవితంలోకూడా రాణించగలరు. అందుకు ప్రతి విద్యార్థి యీ సమావేశంలో ప్రతిన తీసుకోవాలని కోరుతున్నాను." అన్నారు మాష్టారు

నేను మాట్లాడుదామని లేవబోయాను. వెంటనే నా మార్కులసంగతి జ్ఞప్తికివచ్చింది. ఎక్కడలేని నీరసంపట్టుకుంది. 2 మార్కులు వచ్చిన నేను ఏ ముఖంపెట్టుకొని నలుగురిలో నిలబడగలను చెప్పండి !

విశాలరావు మాష్టారుసమావేశాన్ని ముగిస్తూఅన్నారు:

"మీరు బాగా చదువుకోవాలంటె మొదటగా ఓ కార్యక్రమం వేసుకోవాలి. తొందరగానే నిద్రపోవడం, పెందలకడనే మేల్కొవడం అలవర్చుకోవాలి. పొద్దుట క్రమం తప్పకుండా వ్యాయామంచేయడం, పరిశుభ్రమైన గాలి పీల్చడం అవసరం. ఆహారం మితంగా నియమితవేళలోనే తీసుకోవాలి. బడినుంచి రాగానే పుస్తకం ముందరేసుకు కూచోకూడదు. (నేను మా సుగుణకు రోజూ చెబుతున్నదే!) కనీసం ఓ గంట

సేపైనా విశ్రాంతి తీసుకోనిదే హం శ్రమ చేయకూడదు. రాత్రిళ్ళు చూచివ్రాత వ్రాయడం, లెక్కలుచేయడం మాను కోవాలి. ఎందుచేతంటే కళ్ళు, మెదడు పగలంతా పనిజేసి అలసి అలసివుంటాయి గనుక. ఈవిధంగా చేశావంటే అటు ఆరోగ్యము యిటు చదువు రెండూ వస్తాయి.”

సమావేశం ముగిసింది.

మేము ఇళ్ళకు బయల్దేరాం. దారిలో మధు అన్నాడు: “భలే తెలివిగా తప్పించుకున్నారా!”

“ఎవరు ?”

“ఇంకెవరు, మీ యిద్దరే. క్లాసులో అందరూ 40 మార్కులకు తక్కువ తెచ్చుకోమని వాగ్దానంచేస్తే మీరు 20 మార్కులకు ససేమిరా తక్కువ తెచ్చుకోమన్న ఘనులు కదూ !”

“ఇంతకీ నీ బాధ ఏమిటో చెప్పరా” కిష్టాయ్ నవ్వుతూ అన్నాడు.

“అందరూ ముందుకు వెళదామనుకుంటే మీరు వెనక్కి పరుగెత్తడానికి ప్రయత్నిస్తారేమిటని బాధ, మరేమీ కాదు”

“నాకు శ్రద్ధగా చదువుదామనే వుంది కాని పరిస్థితులు అనుకూలించందే ! ఇవాళనుంచైనా ప్రారంభిస్తాను” అన్నాను మధుతో.

“ఓహో వేణుగోపాలరావుగారా, యీ ఘోర శపథం చేసింది! అవునుమరి. ఆడినమాట తప్పని అపర శిబి చక్రవర్తి కదూ...హాహ్హాహ్హా !”

# 6

విశ్వం విషయం ఏమోగాని నేనుమాత్రం ఓ కార్య క్రమం వేసుకున్నాను. పొందలకడనే నిద్రలేవడం, కాలకృత్యాలు తీర్చుకోవడం, కొద్దిసేపు వ్యాయామం, స్నానం, స్కూలుకుపోయేముందు పాఠాలన్నిటినీ ఓసారిచూసుకోవడం, సాయంకాలం ఓ గంటసేపు ఫుట్ బాల్ ఆడుకోవడం, శుభ్రంగా స్నానంచేసి హోంవర్కు చేసుకోవడం, తరువాత భోజనం, కొద్దిసేపు సుగుణతో కబుర్లుచెప్పుకోవడం, హాయిగా నిద్రపోవడం— ఎలావుందంటారు నా కార్యక్రమం ?

ఏమైనాసరే ఈ కార్యక్రమాన్ని తు. చ. తప్పకుండా అమలు జరపాలని నిశ్చయించుకున్నాను. ఫుట్ బాల్ ఓగంట సేపు... మహాఅయితే యింకో అరగంటకంటె ఎక్కువ ఆడ కూడదనే నిశ్చయంతోనే వెళ్ళాను. ఆటస్థలంలో ప్రవేశించానో లేదో నా ఆలోచనలన్నీ రెక్కలువచ్చి ఎగిరిపోయాయి. తీరా కార్యక్రమంసంగతి జ్ఞప్తికి వచ్చేసరికి చీకటిపడింది. "ఓరి భగవాన్, ఏమి టీ మతిమరుపు" అనుకుంటూ యింటికి దారి తీశాను.

రెండోరోజు ఏమైనాసరే ఓగంటకంటె ఎక్కువసేపు ఆడకూడదని నిశ్చయించుకున్నాను. కాని మతిమరుపు మహాత్మ్యం ! యధాప్రకారం చీకటిపడేసరికి తెలివొచ్చింది. ఇలాగే మూడవరోజు, నాలుగవరోజూను......

ఈ వల్లమాలిన మతిమరుపుకు నామీద నాకే చెప్ప రాని చిరాకు పుట్టుకరావడం ఆరంభమైంది. వేసుకున్న కార్య

క్రమమంతా ఈ మతిమరుపువల్ల నాశనమౌతోంది. ఏమైనా యికముందు యిలా జరిగేందుకు వీల్లేదనుకున్నాను. కాని ఎన్నిసార్లు అనుకోవడము మరచిపోవడమూను ? ఎందువల్ల అనుకున్నట్లుగా చేయలేకుండా వున్నాను ? ఆలోచించగా నాకో జవాబు దొరికింది. దీని కంతకు కారణం "ఆత్మనిగ్రహం" లేకపోవడం.

అందువల్ల యిప్పటినుంచీ ఆత్మనిగ్రహాన్ని సాధించాలని నిశ్చయించుకున్నాను. మరి ఆత్మనిగ్రహాన్ని సాధనజేసే మహానుభావులు యేంచేస్తారోనని ఆలోచించాను. ఆc, తట్టింది. ఏం చేస్తారు-ఇష్టంలేనిపనులు అమితశ్రద్ధతో చేయుడం, ఇష్టం వున్నవాటిని అంటరానివాటిగాచూసి దూరంగా వుంచడం. "ఆత్మనిగ్రహ"మంటే నాచిన్నబుర్రకు తోచిన నిర్వచన మిది!

ఒక రోజున జరిగిన సంఘటన చెబుతా వినండి. పాలకోవా అంటే నా కెంతో యిష్టం. ఆ నాడు మా అమ్మ పాలకోవా చేసి నాకు చాలా యిష్టమనికామోసు ఓ పెద్ద ముక్క పళ్ళెంలో పెట్టి యిచ్చింది. మొట్టమొదట దాన్ని చూడగానే నోరూరినమాట వాస్తవమే. కాని, 'ఆత్మనిగ్రహం' సంగతి బుర్రలో మెదిలింది. వెంటనే తమాయించుకున్నాను. దాని వంకైనా చూడడం మానేశాను.

"తినరా వేణూ, నీకు యిష్టమనేగా నాయనా చేసిందీ" అన్నది అమ్మ యెంతో ప్రేమగా.

"నాకేం యిష్టం లేదమ్మా, 'వెధవ' పాలకోవా. ఐనా యిప్పుడు తినను. ఎల్లుండి తింటాను."

"ఒంట్లో బాగా లేదా ?"

"ఊహుఁ, బాగానేవుంది తర్వాత తింటానన్నాగా"

"మరి యిప్పుడే తింటే......" సుగుణ ప్రశ్నించింది.

"నీ కెందుకంటాను యీ వెధవప్రశ్నలు. నీసుమల్లే యేపబడితే అపు తింటా ననుకున్నావా ?"

"చూదాంగా, ఏమాత్రం వుంటావో" సుగుణ వెక్కిరింపుగా అంది.

"సరే కానీయ్, చూదాం"

పొద్దుటే లేచి చన్నీళ్ళు స్నానం చేశాను. నాన్న ఆశ్చర్యానికి అంతులేదు. ఎప్పుడూ వేణ్ణీళ్ళుతప్ప పోసుకోనని మారాంచేసే నేను యివాళ యిలా చన్నీళ్ళు పోసుకోడం ఆశ్చర్యం వేయదూ మరి! అమ్మ కాఫీ యివ్వబోయింది. పాలు కావాలన్నాను పాలు చూస్తేనే అసహ్యపడి డోకున్నేంత పనిజేసే నేను పాలు అడగడం చూసి యేమను కుంటుంది చెప్పండి!

సుగుణ నా డ్రాయింగుపుస్తకం తీసి పేజీలు తిరగేస్తున్నది. ఇంతకు పూర్వమైతే దాన్ని నాలుగు చీవాట్లువేసి కొట్టేంత హంగామాచేసి పుస్తకాన్ని బలవంతంగా లాక్కునే నేను—నేను యెంతో శాంతంగా "ఏదీ సుగుణా! ఆ పుస్తకం ఇలా యివ్వు. బడి టైమైందికదూ, తర్వాత చూద్దువుగానిలే" అనడంతో అది నావంక తెల్లబోయి చూడసాగింది.

ఇంటికొచ్చేసరికి యింకా పాలకోవాముక్క అక్కడే వుంది. దుమ్ము పడుతుందేమోనని అమ్మ దానిమీద ఓ గాజు పళ్ళెం మూతపెట్టింది.

సాయంత్రం ఫుట్‌బాల్ ఆడకూడ దనుకున్నాను. వెంటనే మా అరుగుమీదకు వెళ్ళి అలా ఆకాశంవంక చూస్తూ కూచున్నాను. అప్పుడే క్రుంకుతూన్న సూర్యుని అరుణ కిరణాలు, ఆ సంధ్యాకాంతుల్లో - ఓ సారి ఏనుగు, మరోసారి గుర్రం, ఇంకోసారి ఓడ—యిలా వివిధాకృతులుగా యేర్పడి మెల్లగా పయనిస్తూన్న మేఘ శకలాలు, విశాల గగన పథంలో రెక్కలారుస్తూ స్వేచ్ఛగా విహరించే విహంగాలు— యెంత ఆహ్లాదకరమైన దృశ్యం! హృదయమంతా క్రొత్త క్రొత్త ఆలోచనలు అలముకున్నాయ్. కాని, ఓ అరగంట మాత్రమే కూచోగలిగాను. తరువాత విసుగెత్తింది. మనసు మళ్లీ ఫుట్‌బాల్ ఆటమీదకు పరుగులెట్టింది. ఊరకే చూసొద్దామనే తలంపుతోనే బయల్దేరాను.

నేను ఆటస్థలం చేరేసరికి అక్కడ చాలా కోలాహలంగా వుంది. హుషారుగా కేకలు వేసుకుంటూ ఆడుతున్నారు. విశ్వం నన్ను చూచి అన్నాడు:

"రారా వేణూ! వాళ్ళప్పుడే పదిగోలులు చేశారు. అలా విస్తుబోయి చూస్తావేం. ఊఁ, త్వరగా రావాలి"

నేను మంత్రముగ్ధుడికిమల్లే వెళ్ళి ఆటలో ప్రవేశించాను. మరి ఇంటికి జేరేసరికి చీకటిపడింది.

ప్చ్, ఎంత ఆత్మనిగ్రహం లేనివాణ్ణి. హుఁ, ప్రొద్దుటి నుంచీ చేసినదంతా మట్టిపాలు.

వెంటనే టేబుల్‌మీదనున్న పాలకోవాముక్కను నోట్లో వేసుకున్నాను, అయిన వ్రతభంగంఎలాగూఅయిందని.

అంతలోకి సుగుణ ప్రవేశించింది. తల నిలువునా ఆడిస్తూ కళ్లు పెద్దవి చేసుకుని ఆశ్చర్యంగా చూస్తూ అంది:

"ఎల్లుండిదాకా ఉంటానన్నావ్ కద రా వేణూ!

నేను ఏమీ తెలియనట్లు ముఖం పెట్టాను.

"మరి అప్పుడే తినేశావే?"

"ఏమిటి?"

"అబ్బో, తెలీనట్లు. పాలకోవా ముక్క తిన్నావే"

"సదేం కాదుగా. నాది నేను తిన్నాను, మధ్య నీకేం?"

అది తెల్లముఖం వేసింది.

"ఎందుకురా అన్నాయ్ అంతకోపం. నిజానికి నీకున్న పాటి ఆత్మనిగ్రహం నాకుం టేనా..."

నాకు చెప్పరాని ఆశ్చర్యం వేసింది మా సుగుణ నన్ను యింతకుముందు ఎప్పుడూ తనకంటె గొప్పవాడినని ఒప్పుకో లేదు. ఇవాళ ఏమిటీ విపరీతం! సంతోషంతో ఉక్కిరి బిక్కి రవుతూ అడిగాను. "నిజంగానా సుగుణా?"

"ఓ, నీవు గనుక యింకొంచెం సేపు ఆముక్కను అక్కడ అట్టే పెడితే నేనే తినేసేదాన్నేమో!"

"ఊఁ, భలే, నాకు ఆత్మనిగ్రహం వుందంటావా?"

"ఆహా"

నేను యీ మాట అన్నందుకు సుగుణను ఎంతగానో అభినందించాను. చాల మంచిపిల్లవని, తెలివిగలదానివని, చమత్కారివని, అందగత్తెవని—ఇప్పుడు సరిగా చెప్పలేనుగాని, యిలాంటివే యింకో అరడజను విశేషణాలను చేర్చి దాన్ని తెగ పొగిడేశాను. నిజానికి అంతేకదా! సుగుణ నాకు ఆత్మనిగ్రహం

వుందని అనడంవల్ల ఎంత ఉత్సాహంవచ్చింది. ఏమైనాసరే ఆత్మనిగ్రహాన్ని సాధించాలనే పట్టుదల ఎక్కువైంది.

మరునాడు ఫుట్‌బాల్ ఆటకు వెళ్ళకూడదని తీర్మానించుకున్నాను. కాని విధికృతం! ఆనాడు వాన రావడం మూలాన ఆట సాగలేదని తెలిసింది అసలు ఆటే ఆడకపోతే నేను ఆడకూడదనుకోవడంవల్ల ప్రయోజనం! ఇక ఆత్మనిగ్రహానికి స్థానమెక్కడ?

రెండోరోజున బయట అరుగుమీద కూచుని లెక్కలు చేద్దామనుకున్నాను. సాయంకాలం చక్కని వాతావరణం. ఫుట్‌బాల్ ఆట, విశ్వం - వరుసగా జ్ఞాపకంవచ్చారు. పంజరంలో చిలుకలా హృదయంరెపరెపలాడింది. లెక్కతీసి చదువనారంభించాను. అర్థంకాలేదు సరికదా పైగా తలనొప్పి పట్టుకుంది ఎవరి సహాయమన్నా లేనిదే అసాధ్యమని అనవసరశ్రమ అనీ తోచింది.

వెంటనే సారథిగాడి యింటికి వెళ్లాను. లెక్కల్లో వాణ్ణి మా క్లాసులో కొట్టేవాడు లేడు. ఎలాంటి జటిలమైన లెక్కనైనా చిటికెలో చేయగల దిట్ట. నేను ఎరిగివున్నంతలో వాడికి లెక్కల్లో 90 కి తక్కువ మార్కులు రాలేదు.

నేను వెళ్ళేసరికి వాడు ఒంటరిగా చదరంగం బోర్డు ముందేసుకొని పావులను సర్దుతూ కూచున్నాడు.

"ఒహో వేణూ! రారా" సారథి చేయూపుతూ ఆహ్వానించాడు "ఓ ఎత్తు కేద్దామా?"

"నేను ఎత్తులూ, జిత్తులూ వేసేందుకు రాలేదు మిత్రమా? లెక్కలు చేసుకుందామని వచ్చాను"

"లెక్కలు చేద్దామని వచ్చావా? ఓ, మహారాజులా చేసుకో. అయినా ఓ ఎత్తు వేసి... ఆఁ మరచారోయ్, నే నెందు వల్ల ఇంత బాగా లెక్కలు చేస్తానో తెలుసా?"

"ఊహుఁ, తెలీదే"

"చదరంగం ఆడటంవల్ల..."

"నిజం?" వాడిమాట నమ్మలేక అన్నాను.

"నిజమే, ఒట్టు"

"అయితే ఓ ఎత్తు వేద్దామంటావా?"

"సిద్ధమే"

మేమిద్దరం ఆట ప్రారంభించాము. నాకు తెల్లపావులు, సారథికి నల్లవి వచ్చాయి. ఎలాగైనా సారథ నాకంటె బాగా ఆడుతాడు. వాడి దాడినుంచి రక్షించుకోవడమే నాకు కష్టమైంది. దానికితోడు ఏదో మునిగిపోయినట్లు వాడు అదే పనిగా గర్జించడం ఆరంభించాడు. దాంతో నాస్థితి మరింత అధ్వాన్నమైంది. వాడి గర్జనలవల్ల తప్పుడుఎత్తులు పడుతు న్నాయినాకు. ఇంకేముంది? వాడు మరీ రెచ్చిపోయాడు. గర్జించడంమాని ముందుకు లంఘించే ప్రయత్నాలు చేస్తున్నాడు.

నా పరిస్థితి పూర్తిగా విషమించింది. నేను వేసే ఎత్తులు నాకే అర్థంకావడంలేదు. ఓపిక కాస్తా పోయింది. ఉండబట్టలేక చివరికి ధైర్యంచేసి అన్నాను:

"ఏంవిటోయ్ యీ గర్జనలు. శివమెత్తినట్టు?"

"హుఁ, మరి నీ తప్పుడునడక లేమిటి?"

"ఏం తప్పు ఆడానో కాస్త చెప్పు చూద్దాం"

"చెప్పడమంటూ లేదు. నీ గుర్రాన్ని నా శకటం స్వాహాచేయడమే తరువాయి"

"ఓహో, అలాగా లక్షణం తీసుకో. గుర్రానికి కాపు వున్న ఏనుగ గాడిదలు కాస్తుందనా నీ అభిప్రాయం? అయినా ఆ రంకె లేమిటి మొదలనుండా ఆడక ..."

"వెధవాట లాడుతూంటే విసుగెత్తి అరవబుద్ధేస్తుంది"

"వెధవాట లాడుతూంటే నీకే మంచిదిగా, తొందరగా గెలుస్తావుగా"

"సమఉజ్జీతో ఆడి, గెలిచినా ఓడినా అందం చందం. నీలాంటి మందబుద్ధిమీద గెలిచి ఏం ప్రయోజనం?"

"నేను మందబుద్ధినన్నమాట? ఊఁహు! వ్యవహారం శ్రుతిమించిందన్నమాట?"

"శుద్ధ మందబుద్ధివి కాకపోవచ్చుగాని, నాసిరకం ఆటగాడివి"

సారథి నన్ను ఆట ఆడినంతసేపు ఏదోఒకటి అంటూనే వున్నాడు. చివరకు ఆ ఆట వాడే గెల్చాడు.

"చూశావుగా మన తడాఖా. సారథి మామూలు ఆటగాడు అనుకున్నావు కాబోలు. జాగ్రత్త! సరేగాని, ఇంకో ఎత్తువేద్దామా?" అన్నాడు.

"పిచ్చి పిచ్చి అరుపులూ అవీ లేకుండావుంటే ఆడతాను. లేకపోతే వచ్చినదారిని చక్కాపోతాను."

ఆ ఆట అయినతర్వాత వాడూ నేనూ దాదాపు మూడుగంటలకుపైగా సతమతమైనా లెక్కలు నాకు అర్థం కాలేదు. అదీగాక వాణ్ణి చదరంగంలో ఒక్కసారైనా చిత్తు

చేయలేకపోయాననే జిజ్ఞాస పట్టుకుని పీడిస్తున్నది. ఎలాగైనా సారథిని "జితోస్మి" అనిపించాలనుకున్నాను. లెక్కలు నేర్చుకునే సాకుతో రోజూ వాడింటికి వెళ్ళి గంటలతరబడి చదరంగం ఆడటంలో గడిపేవాణ్ణి.

ఇలా కొంతకాలం గడిచేసరికి నాకు చదరంగమంటే కొట్టినపిండి అయిపోయింది సారథిని ఒక్కోసారి ముప్పతిప్పలు పెట్టి మూడుచెఱువుల నీళ్లు త్రాగించేవాణ్ణి. నేను ఆట గెల్చుకునే సూచనలు కనుపించగానే సారథి పులిలా గర్జించేవాడు, కోతిలా మీదికి దూకబోయేవాడు, శివమెత్తినట్లు చిందులు త్రొక్కేవాడు. ఇలా నానా రభస చేసేవాడు వాడు పడే హైరాను, బాధ చూస్తూంటే నాకు నవ్వు వచ్చేది. ఆట గెలిస్తే పళ్ళన్నీ బయటపెట్టి పక పక నవ్వే మనిషి, ఎప్పుడన్నా ఓసారి ఓడిపోతే యీ వికారపుచేష్టలు చేయడం చూస్తే నవ్వు రాదూ ?

ఈ చదరంగం పిచ్చితో చదువుకు సలాం కొట్టాను. ఎప్పుడూ ఆటనుగురించిన ఆలోచనలే బుర్రలో మెదులుతూండేవి మా సుగుణకుకూడ చదరంగం నేర్పాను. ఇక మేము సాయంకాలంపూట ఆటలాడేందుకు యెక్కడికీ వెళ్ళేవాళ్ళంకాదు. మా నాన్నకూడ అప్పు డప్పుడు ఆడేవారు.

కథలపుస్తకమేదైనా దొరుకుతుందేమోనని ఒకరోజున అటకమీది పుస్తకాలు వెదుకుతూంటే హఠాత్తుగా "చదరంగ బోధిని" అనే పుస్తకం కన్పించింది. పదేళ్ళక్రితం మా నాన్నగారు కొన్నబాపతు అది. అట్ట చినిగిపోయి నామ మాత్రంగా మిగిలింది. చదివితే అర్థంకాదేమో నను

కున్నాను. కాని తీరా ప్రారంభిస్తే వదల బుద్ధిపుట్టలేదు. తేలికభాషలో ఎంతో సుబోధకంగా వ్రాశాడు.

"యుద్ధంలోవలె సాధ్యమైనంత వేగంతో మెరుపు దాడులుచేస్తూ, శత్రురక్షణస్థానాలను తీవ్రంగా దెబ్బకొడుతూ రాజును పట్టుకునేందుకు ప్రయత్నించడం చదరంగంలో చాలా ప్రధానవిషయం." ఈ విధంగా ఆ పుస్తకంలో ఆటను ఎలా ప్రారంభించాలో, ఏవిధంగా శత్రువుమీద దాడిచేయాలో ఏమాదిరిగా ఆత్మరక్షణచేసుకోవాలో - యింకా అనేక విషయాలు వివరించబడినాయి.

కొద్దిరోజుల్లోనే ఆ పుస్తకాన్ని క్షుణ్ణంగా మననం చేశాను. ఇహచూడండి-ప్రతిఆటలోనూ సారథిని నిముషాల్లో చిత్తుచేయడం, వాడు తెల్లమొహంవేయడం జరిగేది.

మేము రోజూ రెండుగంటలకుపైగా చదరంగం ఆడే వాళ్ళం. దాంతో బుర్ర వేడెక్కిపోయేది. ఆదరాబాదరా ఓ అరగంటసేపు లెక్కలుచేసుకుని యింటిముఖంపట్టేవాణ్ణి. హోంవర్కుకు యిచ్చిన లెక్కలు చేయకుండా వెళ్తే విశాల రావుమాష్టారు చీవాట్లువేసేవారు. లెక్కలు వస్తాయికదాఅనే ఆశతో చదరంగం ఆడటమేమిటి-లెక్కలు రాకపోగా రోజూ క్లాసులో మాస్టారుచే సంభావనలు స్వీకరించడమేమిటి? నా పరిస్థితికి నాకే చాలా సిగ్గువేసింది. అందువల్ల చదరంగంఆడటం పూర్తిగా మానివెయ్యాలని నిర్ణయించుకొని ఆవిషయాన్ని సారథికి చెప్పాను.

"అమావాస్య దగ్గరలో వస్తుందాఏమిటి? పిచ్చిక బుర్రా నీవూను. ఒకటోతరగతిఆటగాడివికదా, ఇలా అమాంతం

మానివేయడంలోగల ఉద్దేశ్యం అర్థంకావడంలేదు నా మాట విని అలాంటి వెర్రిమొర్రిప్రయత్నాలు చేయకు. మన స్కూలులో నిన్నుకొట్టేవాడేలేడని గట్టిగా చెప్పగలను" అన్నాడు.

'సరేగాని, సారధీ! నేను చదరంగం యింతబాగా ఆడటంలో రహస్యం తెలుసా ?" అన్నాను నేను.

"ఊఁహూ, తెలియదే"

"అయితే విను. 'చదరంగబోధిని' అనే ఓ పుస్తకం వుంది దాన్ని నేను పూర్తిగాచదివాను. చాలా తేలికభాషలో అందరికీ అర్థమయ్యేట్లుగావుంది. అందుచేత..."

"ఏమిటీ ! పుస్తకం చదివి యింతఆట ఆడగలిగావంటే నేను నమ్మను. చదరంగపు ఆటకు తెలివికావాలి. తెలిసిందా? మామూలు నాటురకం ఆటనుకున్నావా ?" అన్నాడు.

నేను జవాబివ్వలేదు.

"నిజంగా ఆ పుస్తకంవుంటే నాకోమాటు యిస్తావా మరి ?"

"ఓ, మా ఇంటికి రా, అలాగే యిస్తాను."

సారధి మాయింటికి నాకూడా వచ్చాడు. పుస్తకంతీసుకున్నాడో లేదో మారుమాటలేకుండా అదే పరుగు. నేను మాత్రం లెక్కలుచేయడం బాగా వచ్చిందాకా చదరంగం ముఖం చూడకూడదని శపథం చేశాను. ఏమౌతుందో మరి !

# 7

ప్రతిసంవత్సరంకంటె మిన్నగా యీ ఏడు మా స్కూలు వార్షికోత్సవం జరుపుటకు హెడ్మాస్టారు నిర్ణయించారని చక్రపాణి తాజా భోగట్టా యిచ్చాడు. ఉత్సవాలు రెండు రోజులపాటు జరుగుతాయనీ, రెండురోజులూ ఉపన్యాసాలు, నాటక ప్రదర్శనములు; విచిత్ర వేషాలు వగైరా ఉంటాయనీ చెప్పాడు.

మా క్లాసులో చాలామందికి ఇలాంటి వాటిల్లో నలుగురితోను 'శభాష్' అనిపించుకోవాలనే అభిలాషమట్టుకు అధికంగావుంది, కాని ధైర్యంలేదు.

"మీలో ఎవరన్నా యీ ప్రదర్శనలలో పాల్గొనదలచుకుంటే చెప్పండి. బిడియపడితే ప్రయోజనంలేదు" చక్రపాణి మా అందరివైపూ చూస్తూ అన్నాడు.

"నేను గురజాడవారి పూర్ణమ్మ గేయగానం చేస్తాను. ఏమంటావురా చక్రపాణీ "అన్నాడు రాజేశ్వరరావు జవాబు కోసం నిరీక్షిస్తూ. మా క్లాసులో కాస్త కంఠమాధుర్యం, లయజ్ఞానంగలవాడు వాడొక్కడే.

"ఓ, దివ్యంగా పాడు" అన్నాడు చక్రపాణి.

"నన్ను డ్యాన్సు చేయమంటారా?" ఇది మా సుందరంగాడి గొంతు. ఇట్టే పసిగట్టవచ్చు. వాడు పుట్టింది మొగపుట్టుకేగాని మాటలు, నడకా అంతా ఆడంగితనమే. 'ఆంధ్ర దేశానికి "రెండోస్థానం" మన సోమసుందరం' అని

విశాలరావుమాస్టారు చమత్కరించేవారు. అక్షరాలా అది నిజంకూడాను.

"రెండు కళ్లు చాలవేమో - నీ డ్యాన్సు చూడ్డానికి" సుందరం అంటే ఒంటికాలిమీద లేచే కిష్టాయి అన్నాడు— 'సరేగాని సుందరం, మచ్చుకు ఓ భంగిమ ప్రదర్శించరా చూద్దాం"

"పరిహాసాలు చాలించండోయ్. ఇంకెవరన్నా వున్నారా ?" అని చక్రిపాణి అడిగాడు.

భీమేశ్వరరావు బలప్రదర్శనం చేస్తానన్నాడు. ప్రకాశం రాధాయికలసి "ఖడ్గతిక్కన"లో ఓ దృశ్యాన్ని ప్రదర్శిస్తామని చెప్పారు. వీటన్నిటిలో నాకు నచ్చింది యిదే సుమండీ! ఎందువల్లనంటే "ఖడ్గతిక్కన" నాటకాన్ని మా యింట్లో ఉంటే చదివాను. అందులో వీళ్లు ప్రదర్శించబోయేది యుద్ధంలో పరాజయాన్నంది ఇంటికి తిరిగివచ్చినందుకు తల్లిచేత, భార్యచేత పరాభూతుడై, ఆత్మాభిమానం బుసలుకొట్టగా, దెబ్బతిన్న బెబ్బులివలె మరల రణరంగానికి పయనమయ్యే వీరమూర్తి తిక్కనకు నెల్లూరు పురవాసులు జయజయ ధ్వానాలతో వీడ్కోలిస్తున్న దృశ్యం! ఎంత రసవత్తర ఘట్టం !

నేను విశ్వం విశాలరావు మాస్టారివద్దకు వెళ్ళి నాటకంలో పాల్గొనే అవకాశం యిప్పించవలసిందిగా కోరాం.

"ముందు చదువుసంగతి చూచుకోండి నాటకాలకేమొచ్చె, లక్ష ఆడుకోవచ్చు......" అన్నారు మాస్టారు.

ఇలా అవుతుందని నాకు ముందే తెలుసు. విశ్వం నోట మాట రానంతగా బిక్కచచ్చిపోయాడు. ఉత్త బెంబేలు మనిషి. ఇట్టే తేలిపోతాడు

రిహార్సులు జోరుగా సాగుతున్నాయ్. విశాలరావు మాస్టారు ప్రతి చిన్న విషయాన్ని శ్రద్ధగా పరిశీలిస్తూ మధ్య మధ్య ఖడ్గతిక్కన పాత్రధారికి సూచన లిస్తున్నారు. నాటక దర్శకత్వబాధ్యత విశాలరావుమాస్టారికే అప్పగించబడింది.

మరునాటి సాయంత్రం విశ్వం మా యింటికి వచ్చాడు. ముఖంలో సంతోష చిహ్నాలు గోచరించాయి.

"నిన్న రాత్రి 'ఖడ్గతిక్కన' నాటకం చదివానాత్రి" అన్నాడు రావటంతోనే.

"ఘనకార్యం చేశావ్ లే" అన్నాను.

"వెధవ వ్యాఖ్యానాలు చేయక విను. నాటకంలో ఖడ్గతిక్కన పంచకల్యాణి గుర్రమెక్కి యుద్ధానికి పోతున్నట్లుందికదా; మరి మన ఖడ్గతిక్కన కాలినడకన బయలు దేరా డేమిటి?"

"ఏమోగాని, నీ బుర్ర సరిగా పనిచేయడం లేదురా విశ్వం. లేకపోతే నాటకంకోసమని గుర్రాన్నెక్కడ పట్టుకు రమ్మంటావ్? ఒకవేళ తీసుకొచ్చినా రంగస్థలంమీద ఎలా ప్రదర్శిస్తారు?..."

"నాకో మంచి ఆలోచన తట్టింది; చెప్పమంటావా?"

"ఊఁ, కానియ్"

"నువ్వూ నేనూ కలిస్తే ఓగుర్రం తయారవుతుందిరా"

"ఎలా?"

"చెబుతా విను. మా ఇంట్లో "ఆట - పాట" అ పత్రిక ఒకటి వుంది. ఇప్పటిది కాదులే, ఐదేళ్ళనాటిది దాంట్ల ఇద్దరు పిల్లలు కలిసి ఓ గుర్రం లా ఎలా రంగస్థలంమీద నటిం వచ్చో వివరంగా వ్రాసివుంది"

"భలే భలే! అయితే మనం పంచకల్యాణి గుర్రంల మారిపోతామన్నమాట"

"మరి చివరికంటా విను. మొదట మా స్కూలు గు మీద ఓ గుర్రపు బొమ్మను - తల, తోక, కాళ్లు అన్ని చక్కగా స్పష్టంగా వుండేటట్లుగా గీయాలి. తరువాత గుడ్డను ఏభాగాని కాభాగం కత్తిరించి, గుర్రపు ఆకారంతో దారంతో కుట్టాలి. అప్పటికి ఓ గుడ్డగుర్రం తయారైందన మాట. ఇక మిగిలిన పని చాలా తేలిక ఆ గుడ్డ గుర్రంల ముందు భాగాన్ని నేను, వెనక భాగానివినువ్వూ. నేను గుర్రం తలలో నాతల దూర్చి అచ్చం గుర్రంలాగే నుంచుంటాన నువ్వు వంగి నా నడుము పట్టుకుంటావు అంటే నీవు గుర్ర వెనుకభాగానివన్నమాట. ముందరి కాళ్లు నావి, వెనుక కాళ్లునీవి కలిపితే గుర్రానికి ఉండే నాలుగు కాళ్ళు సరిపోతాయి. విశ మంటే ఏమనుకున్నావ్, విశ్వామిత్రునిలా ప్రతిసృష్టి చేయ గలను - హుఁ!"

"సరేగాని, మనకి గుడ్డగుర్రం ఎలా వస్తుంది చెప్పు మన కేమో కుట్టడం చేతకాదాయె. ఆడపిల్లలైతే నిమిషంలో చేయగలరు. వాళ్ళకి స్కూల్లో కుట్టుపని నేర్పుతారు. మంటావ్?"

"అయితే మా చెల్లెలు సుగుణ ఉందిగా, అడిగితేనో?

"అలాగే అడిగిచూద్దాంలే; దానికేమిటి ?"

నేను మా సుగుణనుపిలిచి విషయమంతా సవిస్తరంగా చెప్పాను. నీవుతప్ప ప్రపంచంలో ఈపనిని ఎవరూ చేయలేరనీ, మాకుగనక బహుమతివస్తే నీకే యిస్తామంటూ దానికి నమ్మిక కలిగేటట్లుగా కోశాను. అది ఒప్పుకుంది. దాంతో నాకు ఓ గొప్ప విషయం తెలిసినట్లయింది — ఆడపిల్లలచేత ఏపని చేయించుకోవాలన్నా ముందు కాసేపు పొగడటంఅవసరమని.

"నేను కుట్టిపెడతాను కాని గుడ్డముట్టుకు మీరేతెచ్చుకోవాలి" అంది సుగుణ.

నేను విశ్వంవైపు "ఏమిటి కర్తవ్యం ?" అన్నట్లుగా చూశాను. విశ్వం ఒక క్షణం బుర్రపైకెత్తి, యింటికప్పు కేసి చూసి గబగబా పరుగెత్తుకెళ్ళాడు. ఐదు నిముషాల్లో ఓ పాతచీరెతో వాడు ప్రత్యక్షం. సుగుణ దాన్ని చాలాసేపు పరిశీలించినమీదటగాని మాకు గుర్రంబొమ్మ గీయడానికి యివ్వలేదు. విశ్వం గుర్రపుతల, కాళ్ళు, నడుము, తోక - దేనికది విడిగా గీశాడు. సుగుణ ఏ భాగానికి ఆ భాగం కత్తిరించి కుట్టడం మొదలెట్టింది. మేమేదో సహాయం చేద్దామనుకున్నాం. కాని వేళ్లకు సూది గుచ్చుకోవడంతప్ప ఓ అంగుళంమేరైనా కుట్టు పడితేనా! ఒక గంట కుస్తీపట్టిన మీదట ఏదో విధంగా పనిపూర్తయిందనిపించాం.

మరునాడు గుర్రంతలలో గడ్డి కుక్కి కుట్టేశాం. తోకకూడా గడ్డితోనే తయారుచేసి పైన పాతగుడ్డలూ అవీ చుట్టాం. సుగుణ జూలు, తోకకుచ్చును లావుపాటి దారాలతో తయారుచేసింది. తరువాత సుగుణసలహామీద గుర్రానికి

ఎర్రరంగు వేశాం. విశ్వం చక్కగా గుర్రం కళ్లు, ముక్కు నోరు, గిట్టలు రంగులతో సరిదిద్దాము. కాని ఇంతా చేసి చెవులమాటే మరచిపోయాం. సుగుణగనుక చెప్పకపోతే యెంత నవ్వులాటపని ! చెవుల్లేని గుర్రం అంటూ నలుగురూ హేళనచేసేవారే !

తరువాత మేము గుర్రంలోదూరి గంతులు ప్రారంభించాం. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయ మేమంటే విశ్వం గుర్రంలాగా సకిలించడం, చెవులు ఆడించడం చేసే వాడు. మా గంతులు, సకిలింపులుచూసి సుగుణ పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుతూ చప్పట్లు కొట్టింది.

"అచ్చంగా గుర్రంలా వుందిరా అన్నాయ్" అని సుగుణ వ్యాఖ్యానించింది.

మేము మరింత హుషారుగా ఆటగుర్రంవలె యెగురుతున్నాం. ఈ గల్లంతు ఏమిటా అని అమ్మ రానే వచ్చింది.

"ఈ గుర్రంవేషం అదీ ఏవి్టా. మీా ఇల్లు బంగారం గానూ..." అమ్మ కళ్ళు పెద్దవిజేసుకుని కుడిచేతితో దవడలు నొక్కుకుంటూ అంది.

"మన ఇంటికి ఆటగుర్రమేదైనా వచ్చిందేమిటి?" అప్పుడే ఆఫీసునుండి తిరిగివచ్చిన నాన్న అన్నాడు.

"నిజం గుర్రంకాదు నాన్నా; అన్నయ్యా విశ్వం కలసి గుర్రంవేషం వేశారు" అన్నది సుగుణ ఏదో కని పెట్టినదానిలా

"ఎందుకురా యీావేషం వేణూ ?"

నేను గుర్రం ముసుగులోనుంచి బయటకువచ్చిఅన్నాను "వచ్చే శని, ఆది వారాల్లో మా స్కూలు వార్షికోత్సవం

జరుగుతుంది నాన్నా. అప్పుడు మా క్లాసువాళ్లు 'ఖడ్గతిక్కన' నాటకాన్ని వేయబోతున్నారు. మరి తిక్కన ఎక్కేందుకు గుర్రం కావాలిగా. అందుకని మేమే గుర్రం వేషం వేస్తున్నాం..."

"మంచిదే. వచ్చే శని, ఆదివారాల్లోనే కదూ; వీలుంటే నేనూ వస్తాలే మీ ఉత్సవాలకి"

"ఓసారి మా ఇంటికి వెళ్ళి మా అమ్మకు మనవేషం చూపుదాం, ఏమంటావురా వేణూ?" అన్నాడు విశ్వం.

"సరే, పద" అన్నాను.

మేము విశ్వంఇంటికివెళ్ళి ఓ ఐదునిముషాలసేపు మా విద్యను ప్రదర్శించాం. విశ్వం అమ్మ, పిన్ని పగలబడినవ్వారు.

"ఇద్దరూ యిద్దరే, కోతులు !" విశ్వం అమ్మ ఓ దీవన పారేసి లోపలికి వెళ్ళింది.

"ఏరా విశ్వం, మా నాన్న నాటకానికి వస్తానన్నారు కదా - ఒకవేళ మాస్టారు మనల్ని వద్దంటేనో?" అన్నాను.

"శకునపక్షిలా ఏంవిటీ మాటలు ? ఆ తంతు నేను చూసుకుంటాగా. నువ్వుమాత్రం నోరు మూసుకుని నేను చెప్పినట్లు చెయ్యి."

ప్రతిరోజూ సాయంకాలం ఓ గంటసేపు రిహార్సలు వేసేవాళ్లం. ఎప్పుడూ ఇదే ధ్యాస కావడంవల్ల చదువుకాస్తా సన్నగిలింది స్కూల్లో చీవాట్లు తినడం అలవాటయింది. ఈ ప్రదర్శన పూర్తయ్యేదాకా ఎలాగో భరించేందుకే నిర్ణయించుకున్నాం. రోజు ఒకయుగంలా ఆదివారంకోసం నిరీక్షిస్తున్నాం.

చివరికి మేము ప్రతీక్షిస్తున్న ఆ ఆదివారం వచ్చేసింది. నాటకం మొదలెట్టే సమయం సమీపిస్తున్నకొద్దీ మాస్టా రేమంటారోనన్న దడ కూడా యెక్కువ హెచ్చసాగింది.

నాటకం యింకా ఒక అరగంటకు ప్రారంభించుతా రనగా నేనూ, విశ్వం యెవరూ చూడకుండా బిక్కుబిక్కు మంటూ రంగస్థలంమీదికి ప్రవేశించాం. విశ్వం 'ఖడతిక్కన' వేషంవేసే ప్రకాశాన్ని చాటుగ పిల్చి అన్నాడు—"ఏరా, ప్రకాశం! యేదైనా ఒక బక్కగుర్రాన్ని సంపాదించావా?"

"గుర్రమా! ఎందుకూ?" ప్రకాశం విస్తుబోయిఅన్నాడు.

"పెద్ద తెలీనట్లు నాటకంలో ఖడ్గతిక్కన గుర్రంమీద రణరంగానికి వెళ్తాడుగాని, కాలినడకను బయల్దేరడుగా! మా దగ్గర ఒక గుర్రం వుందిలే. కావాలేమోనని......"

"ఏమిటీ! నిజంగుర్రమే? ఐనా నాకు గుర్రంతో రిహా ర్సలు యివ్వలేదుగా"

"ఇవ్వకపోయినా ఫర్వాలేదులే, తెలిసిందా? ఇది మామూలు నాటుగుర్రమనుకుంటున్నావేమో, మొదటితరగతి యుద్ధగుర్రం"

"ఆఁ!"

"ఆఁ లేదు, ఊఁ లేదు. తెర యెత్తబోయేందుకింకా రెండునిముషా లుండనగానే గుర్రం సిద్ధంగా వుంటుంది. ఈ మాట యెవరికీ చెప్పవుకదూ?"

"ఊఁహుఁ, బ్రహ్మకుకూడా తెలియదు"

నాటకం ప్రారంభించడానికి యింక పదిహేనునిముషాలు మాత్రమే వుంది. విశాలరావుమాసారు హడావిడిగా అటూ

యిటూ తిరుగుతూ రంగస్థలాలంకరణకు తుదిమెరుగులు దిద్దుతున్నారు.

"సిద్ధంగా వున్నారుకదూ! ఐదునిముషాలుమాత్రమే వుంది" అని విశాలరావుమాస్టారు ప్రార్థన చేయవలసిందిగా నాగేశ్వరరావును పిలిచారు.

ఒకవైపున ప్రార్థన జరుగుతూండగానే ప్రకాశం మా వద్దకు వచ్చాడు. వాడి వేషంమట్టుకు మహా ఠీవిగా వుంది. సైన్యాధిపతి దుస్తులు, వీరత్వాన్ని సూచించే పతకాలు, ఉక్కుశిరస్త్రాణం, ఎడమవైపున వ్రేలాడుతున్న సుదీర్ఘ కరవాలం—చాల గంభీరంగావుంది, వేషం!

"మా గుర్రం యెక్కడోయ్? త్వరగా తీసుకురండి!" అన్నాడు ప్రకాశం.

మేము గబగబా వెళ్ళి గుడ్డగుర్రంలో దూరాం.

"ఇదిగో పంచకల్యాణి గుర్రం. అధిరోహింపుమో అపరతిక్కనా!" నాటకంలోలాగ అన్నాను.

తీరా ఎక్కినతర్వాతగాని నాకు తెలిసిరాలేదు బాధ. "ప్చ, పాపం! గుర్రం జీవితం యావత్తు ఇలా వెళ్ళబుచ్చాల్సిందేగదా!..." నా నడుములో చెప్పరాని బాధ బయల్దేరింది. వెన్నుపూస విరిగిపోతుందేమోనన్న సందేహంకల్గింది. కాని ఆపనిమాత్రం జరగలేదు. ఇప్పుడేమనుకుంటే ఏం లాభం? గట్టిగా విశ్వంనడుము పట్టుకున్నాను.

కిరకిరమంటూ తెర లేచింది.

"ఊఁ, ముందుకు నడవండి" అని ప్రకాశం నెమ్మదిగా గొణిగాడు.

మేము మెల్లగా రంగస్థలంమీదికి వచ్చాం. పిల్లలందరు గట్టిగా అరుపులు ప్రారంభించారు. పిచ్చిపిల్లలు! నిజం గుర్తిమని భ్రిమపడిఉంటారు.

నేపథ్యంలోంచి గంభీరంగా తీయగా ఓ గీతం వినిపిస్తోంది.

"జయం జయం! జయం జయం!
జయం జయం! జయం జయం!
జయం నీకు జననాయక
జయం నీకు ప్రియనాయక
అరి భయంకరుడా, ఘనుడా,
వరియింపుము విజయము వీరా
జయం జయం! జయం జయం!
జయం నిజం! నిజం జయం!"

విశ్వం చెవులు ఆడించడం మొదలెట్టాడు. ఒకసారి రంగస్థలమంతా దద్దరిల్లేటుగా సకిలించాడు. దాంతో ప్రేక్షకులలో గందరగోళం ఎక్కువైంది ఇష్టంవచ్చినట్లు కేకలు వేస్తున్నారు.

"కాస్త ముందుకు కదలండిరా..." ప్రకాశం మెల్లగా అన్నాడు.

అబ్బే! విశ్వం యీలోకంలో ఉంటేనా? వాడి సకిలింపు లేమిటో వాడేమిటో, ముందుచూపులేని మనిషి. నా కంతా అయోమయంగాఉంది. ఏం చేసేందుకు తోచడం లేదు. 'హప్' అంటూ ప్రకాశం రెండు కాళ్ళతో లాగి తన్నాడు—ఎంతసేపటికి కదలకపోయేసరికి ఆతన్నుతో విశ్వాన్ని

ఒక్కతోపు తోశాను. నా ప్రక్క ఎముకలు విరిగినట్లున్నాయి ఒక టే నొప్పి, తల తిరగడం, కళ్లు చీకట్లు కమ్మడం జరిగింది. విశ్వం ఆ తాపుతో గాఢనిద్రలోంచి హఠాత్తుగా లేచిన వాడిలా ఉలిక్కిపడి వెనక్కి అడుగువేశాడు.

"నాపాదం పచ్చడయిందిరోయ్ విస్సాయ్,అమ్మో". అంటూ ఓ పొలికేక వేశాను.

"హుష్" అంటూ ప్రకాశం గట్టిగా మరో తన్ను డొక్కలో తన్నాడు.

" చచ్చాంరోయ్, నా డొక్కంతా పచ్చిపుండు అయిందిరోయ్" అని గావుకేక పెట్టాను మళ్ళీ.

"భగవంతుని కృపవలన, మీ ఆశీర్వాదబలంతో ప్రాణాలకు తెగించి పోరాడుతాను. నెల్లూరుసీమకు విజయ లక్ష్మిని తీసుకొస్తాను" అంటూ ప్రకాశం అనడమే తరువాయి మేము వేగంగా లోపలికి పరుగెత్తాం. ప్రేక్షకులు బ్రహ్మాండంగా చప్పట్లు చరిచారు. తెర పడింది.

మా గుండెల్లో రాయిపడింది. ఎవరూ చూడకండా చప్పున తప్పుకుందామనుకున్నాం గాని, మా పప్పు ఉడకలేదు. చక్రపాణి అమాంతంగా వచ్చి మా ఇద్దరిచెవులు పట్టుకుని "మీ రన్నమాట ! నే నప్పుడే అనుమానించాను. ఎవర్ని అడిగి మీ రీ పని చేశారో చెప్పండి. అయినా ఆ వెర్రికేకలూ పిచ్చిగంతులూ ఏమిటి ?" అన్నాడు.

"ఏం చేస్తాంరా చక్రపాణీ ! ప్రకాశంగాడి బరువు సామాన్యమా. ఓ టన్ను బరువుండా" అన్నాను.

"అందుకని గంభీరమైన దృశ్యం జరుగుతూంటే మీారు మధ్యలో ప్రేక్షకులు నవ్వేలా కోతిచేష్టలు చేస్తారా? రంగం జరిగినంతసేపూ చెవులు ఆడిస్తూనే వుంటిరి. ఎప్పుడైనా గుర్రంముఖం చూస్తేగా..."

"గుర్రా లెప్పుడూ చెవులాడిస్తూంటాయ్ తెలుసా?" అన్నాడు విశ్వం.

"ఎందుకు?"

"తన యజమాని ఆజ్ఞలను ఆలకించేందుకు."

"తెలివికి సంతోషించాంగాని యికముందు ఇలాంటి పిచ్చిపిచ్చి వ్యవహారాలు సాగిస్తే హెడ్మాస్టారికి తెలియపర్చడం ఖాయం. అయిందేదో అయింది, యిక గుట్టుచప్పుడు కాకుండా బయటపడండి."

మేము యిక యింటిదారి పట్టాం. విశ్వం మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. ఎలావుంటుందీ! వారం రోజులు చదువుకు స్వస్తిజెప్పి యింతా కష్టపడితే—పొందిన బహుమానం, చీవాట్లు!

చదరంగంఆట, తర్వాత యీా నాటకప్రదర్శన—ఈ రెండింటితో నా చదువు కుంటుపడింది. క్వార్టర్లీ పరీక్షలుకూడ యీా విషయాన్ని ధృవపరిచాయి. నాకు లెక్కల్లో ఐదు మార్కులు, విశ్వానికి తెలుగులో ఐదుమార్కులు వచ్చాయి. అసలు అంతకుమించి మార్కులు వస్తాయని అనుకుంటేకదా, తక్కువవచ్చాయని మేము విచారించడానికి!

# 8

ఆగస్టు పదిహేను వచ్చింది.

నేను తెలతెలవారుతూండగానే లేచి సరాసరి కిటికీ వద్దకు వెళ్ళి బయటికి చూశాను. ఇంకా సూర్యోదయం కాలేదుకాని వెలుగు రేఖలుమాత్రం నలువైపులా వ్యాపించాయ్. లోకబాంధవుని రాకకు సిగ్గుపడిన ప్రకృతికాంత తెల్లని మేలిముసుగును సవరించుకున్నట్లుగా మంచు పట్టింది. ఆకాశవీధుల్లో తెల్లని తలపాగా పెట్టుకుని సగర్వంగా తలెత్తి చూస్తున్న దూరపు నీలగిరులు, కనుపించీ కనుపించని ఉన్నత తరుశాఖలపై అక్కడక్కడ అద్దినట్లు రంగురంగులపూలు, వెర్రిఆనందంతో స్వాగతగీతికలు పాడుతూ పల్లటీలుకొడుతున్న పక్షిసంతానం-లోకమంతా మునుపటికంటె యెంతో సజీవంగాను, సౌకర్యంగాను ఉన్నట్టు తోచింది.

ఆకాశం నీలంగా, నిర్మలంగా వుంది. ప్రతి యింటి మీద త్రివర్ణ పతాకాలు రెపరెపలాడుతున్నాయ్. అలాగే నా హృదయంలోను ఆనందం పురివిప్పి నాట్యం చేయసాగింది. నా ఒక్కడికేకాదు. ప్రతి భారతీయునికి యీ రోజు పర్వదినం. రెండు శతాబ్దాలుగా దాస్యశృంఖలాబద్ధమైన భారతమాత స్వేచ్ఛావాయువులుపీల్చినరోజు! పారతంత్ర్యభారంతో కృంగిపోతున్న భారతీయులు స్వాతంత్ర్యులైనది ఈనాడే! మన కలలు నిజమై ఆశలు మోసులెత్తినది యీ రోజునే!

నాలో ఎన్నో కొత్త కొత్త ఊహలు రెకెత్తినై. నేను అమాంతం పెద్దవాణ్ణి కావాలని, అజేయమైన అత్యున్నత

పర్వత శిఖరాగ్రాలను అధిరోహించాలని అగాధమైన సాగర గర్భాలను అన్వేషించాలని, విమానంలో కూచుని అలా గాలిలో తేలిపోతూ వివిధ దేశాలను చూడాలని, కొత్త విషయాన్ని కనిపెట్టి మా నాన్నకు అమ్మకు, విశాలరావు మాస్టారికి పేరు తీసుకురావాలని—ఇంకా యేవేవో పిచ్చి పిచ్చి వూహాలు!

గబగబా ముఖం కడుక్కొని, స్నానంచేసి, నాన్న కుట్టించిన కొత్తఖద్దరుబట్టలు కట్టుకున్నాను. రాత్రి కొనుక్కొన్న మూడురంగుల జండాను ముచ్చటగా చొక్కాకు పెట్టుకున్నాను అమ్మయిచ్చిన వేడికాఫీ త్రాగి బడికి బయల్దేరాను. దారి అంతా కొత్తగా వుంది. వీధులన్నిటిని శుభ్రంచేశారు. ఇరువైపులా త్రివర్ణపతాకాల తోరణాలతో స్వాగత మిస్తున్నట్లుగా వున్నాయ్. ప్రతిచోట మహాత్మగాంధి, సుబాస్ చంద్రబోస్, జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు స్వాతంత్ర్య రథసారథుల చిత్తరువులు సాక్షాత్కరిస్తున్నాయ్. పట్టరాని సంతోషంతో గంతులు వేస్తూ దిక్కులు చూసుకుంటూ వెడుతున్నాను. బడి యింకో ఫర్లాంగుదూరం వుండగానే విశ్వం కలిశాడు.

"ఏరోయ్ వేణూ! చూశావా మనబొమ్మ!" విశ్వం తన చొక్కాకు తగిలించుకున్న గాంధీబొమ్మను సగర్వంగాచూపిస్తూ అన్నాడు.

"అబ్బో! నీకే ననుకున్నావ్ కాబోలు వుంది—ఇదిగో యిటుచూడు, మనకూ......" నా జండాను చూపుతూ అన్నాను.

"తర్వాత తీరిగ్గా చూసుకుందాంగాని త్వరగా తగులడు. ఆలస్యమైతే మిఠాయి కాస్తా అయిపోతుంది" అంటూ విశ్వం పరుగు లంకించుకున్నాడు.

మిఠాయిపేరు వినేసరికి నాకూ నోరూరింది. వాడితో పాటు నేనూ పరుగు లంకించుకున్నాను.

"మేము వెళ్ళేసరికి హెడ్మాస్టారు జండా ప్రతిష్ఠాపన చేస్తున్నారు. తరువాత నాగేశ్వరరావు జాతీయగీతం పాడారు. దిక్కులు పిక్కటిల్లేట్టుగా అందరం గొంతులుకలిపి పాడాం. జాతీయపతాకానికి గౌరవ వందనంచేసి కూచున్నాం.

హెడ్మాస్టారు ఆగష్టు పదిహేను ప్రాముఖ్యాన్ని గురించి మాట్లాడారు. స్వాతంత్ర్యాన్ని యెందరో మహానుభావులు తమ సర్వస్వాన్ని అర్పించి - మనకు సాధించిపెట్టారని, దానిని పరిరక్షించుకునేబాధ్యత ప్రతి ఒక్కరిమీద కలదనీ, ప్రతి విద్యార్థి శ్రద్ధగా చదువుకుని వృద్ధిలోకివచ్చి తన దేశానికి సేవచేయాలనీ చెప్పి ముగించారు.

తరువాత తెలుగుమాస్టారు, ఇద్దరు విద్యార్థులు మాట్లాడిన తరువాత పంచిపెట్టిన మిఠాయి తింటూ యింటిదారి పట్టాం.

ఆ రోజున మా అమ్మ నాకిష్టమైన పాలకోవాచేసింది. నాన్నగారికికూడా సెలవుకావడంవల్ల ఇంటిదగ్గరే వున్నారు. మధ్యాహ్నం భోజనాలైన తర్వాత అమ్మ, నాన్న, నేను, సుగుణకలిసి కేరమ్సు ఆడుకున్నాం. చెప్పుకోతగ్గ విశేష మేమిటంటే నాన్నగాని, అమ్మగాని - నన్ను సుగుణను పల్లెత్తుమాటైనా అనలేదు. ఎంతో శాంతంగా మాట్లాడారు.

రోజూ యిలాంటి ఆగష్టు పదిహేనైతే ఎంత బావుంటుందో ననిపించింది !

సాయంత్రం నాన్నతో కలిసి బజారుకు వెళ్ళాం. నేను ఓ మాజిక్ లాంతరు, సుగుణ స్వెట్టర్లు అల్లే సూదులు, ఊలు నగైరా కొనుక్కున్నాం. అలా ఓ గంటసేపు బజారు వెంట పచార్లుచేసి చివరకు ఇల్లుచేరుకున్నాం.

రాత్రి భోజనాలయ్యాయి. ఇంతలోకి నాన్న ఆఫీసులో పనిచేసే మా రాఘవేంద్రరావు మామయ్య వచ్చాడు. చేతిలో ఏదో చిన్నపెట్టెవుండడం పసిగట్టడంతో మా ఆనం దానికి అంతులేదు. సుగుణ మల్లెమొగ్గలాంటి తెల్లని పళ్ళు బయటపడేలా నవ్వుతూ నన్ను నెమ్మదిగా గిల్లింది.

నేను 'హుష్ కొంటెపిల్లా!" అనేలోగానే మామయ్య మా దగ్గరకు రానే వచ్చాడు.

"ఏరా వేణూ, బాగా చదువుతున్నావా ? ఏమే సుగుణా, నీ చదు వెలా వుంది ?"అన్నాడు మామయ్య.

మే మిద్దరం ఔ నన్నట్లు తలలాడించాం.

"మీ అమ్మ మాట వింటున్నారా ?"

"ఓ"ఇద్దరం ఒక్కసారిగా అన్నాం.

"మీ నాన్న మాట ?"

"మా నాన్న మాట కూడాను" నెమ్మదిగా తలవంచుకుని అన్నాం.

నాన్న మామయ్యవైపు చిరునవ్వుతో చూశారు.

మామయ్య నాకో చక్కని కలం, సుగుణకో బొమ్మల కథలపుస్తకం, రంగులపెట్టె బహుమతిగా యిచ్చాడు.

తరువాత రామకృష్ణరావు బాబాయి వచ్చాడు. వచ్చీ రావడంతోటే ఏదో మునిగిపోయినట్లు "ఏరా వేణూ! లెక్కలు బాగా చేస్తున్నావా?" అన్నాడు.

"ఆ" ఊపిరి బిగపట్టుకుని జవాబిచ్చాను. ఇంకేమన్నా లెక్కలనుగురించి అడుగుతాడేమోనని భయపడ్డాను. అదృష్ట వశాత్తు అలాంటి ప్రమాదమేమీ జరుగలేదు. కాని లెక్కల పేరు వినడంతోటే నా పండుగ సంతోషంలో సగంభాగం చచ్చిపోయింది. లెక్కలు... ఐదు మార్కులు...విశాలరావు మాస్టారు అన్నీ వరుసగా బుర్రలో కదిలాయి. ఈ దిక్కు మాలిన లెక్కలనుగూర్చిన ఆలోచనలతో నాబుర్ర చెడి పోతోంది. ఏమైనాసరే లెక్కల అంతు తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాను తిరుగులేని ప్రతిజ్ఞ-ఆగస్టు పదిహేను సాక్షిగా దీక్షపట్టాను దాంతో మనసు కాస్త తేలికపడింది. ఆ రాత్రి నాన్న చదవమననేలేదు. నేను చదవనూలేదు. పండుగ సరదాలను నెమరువేసుకుంటూ నిద్రపోయాను.

తెల్లవారేసరికి బడి ఉన్నట్లు జ్ఞాపకంవచ్చింది. చచ్చే బద్ధకంగావుంది. ఉండదూ మరి! సెలవలతర్వాత బడంటే యెంత బుద్ధిమంతుడికైనా బద్ధకంవేస్తుంది.

మొదటి పీరియడు ఆఖరున విశాలరావుమాస్టారు నా చేతికో చీటీముక్క యిచ్చి మా నాన్నగారిచేత సంతకం పెట్టించుకురమ్మన్నారు. నా కంతా అర్థమైంది. గుండెల్లో దడపట్టుకుంది. ఇది తప్పక నా లెక్కలమార్కులనుగురించే అయివుంటుందని తెలుసుకునేందుకు యెంతోసేపు పట్టలేదు. బిక్కుబిక్కుమంటూ యింటికి వచ్చాను.

రాగానే అమ్మ మార్కులనుగురించి అడుగుతుందేమో నని భయపడ్డాను సంచీ మెల్లగా గదిలోపెట్టి చల్లగా తప్పుకునే ప్రయత్నంలో వున్నాను.

"ఎక్కడికిరా వేణూ!" అమ్మ హాల్లోకివస్తూ కేక పెట్టింది.

ఎక్కడికని చెప్పుకు, బిక్కమొగం వేశాను.

"లెక్కల్లో యెన్ని మార్కులు వచ్చాయిరా? పేప ర్లిచ్చారా?" అని అడిగింది అమ్మ దగ్గరకొచ్చి.

మారు మాట లేకుండా విశాలరావుమేస్టారు యిచ్చిన చీటీ యిచ్చాను.

అమ్మ కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యార్థకంగాచూస్తూ అంది. "అనుకున్నంతా అయిందీ. మరి చదువూ సంధ్యా మానేసి అదేపనిగా ఆటలాడుతూ కూచుని మార్కులు రమ్మంటే వస్తాయా? నే నెన్నిసార్లు మొత్తుకున్నా వింటేనా? వేలెడు లేడు, వెధవకి నామాటంటే చిన్నమెత్తు లక్ష్యంలేదు. ఏమో బాబూ! మీ నాన్నగారు రాగానే చూపించు; తర్వాత నీ యిష్టం, మీ నాన్నగారి యిష్టం" అంటూండగానే నాన్న వచ్చారు. నెమ్మదిగావెళ్ళి నాన్నగారికి చీటి యిచ్చి "ఇక కష్టపడి చదువుతానండి" అన్నాను.

"ఇంతకుపూర్వం యిలా ఎన్నిసార్లు అనలేదు"

"ఇంతకుపూర్వం అన్నాను. ఈసారి చేస్తాను"

"ఏడిశావులే, వెధవకబుర్లు యెన్నైనా చెబుతావు. చూద్దాంగా, ఏమాత్రం మాట నిలబెట్టుకుంటావో!"

పీటీమీాద సంతకంచేసి యిచ్చారు. ఈ హఠాత్సంఘటన నాకు సంతోషానికి బదులు తీవ్రమైన ఆశాభంగమే కల్గించిందని చెప్పాలి ఓ పావుగంటసేపు నాలుగు తిట్టి, ఇంకో అరగంట లెక్కలమీాద ఉపన్యాసం దంచి, మరో గంటదాకా హితబోధచేసి, తుదకు 'ఈసారికి మాత్రమే నిన్ను వదులుతున్నాను, జాగ్రత' అన్నట్లు తీక్షణంగాచూసి, చివరకు ఇష్టంలేనట్లు సణిగిస్తూ సంతకం పెడతాగని ఊహించుకుని— అందుకు సిద్ధపడే వచ్చాను. కాని ఇప్పుడు పూర్తిగా వ్యతిరేకం జరిగింది. బహుశః నన్ను చదవమని చెప్పడం కూడా వృథా ప్రయాసగా భావించివుంటారు. కర్మవశాత్తు ఆరోజున హోంవర్కు ఏమీాలేదు ఉంటే, ఏమైనాసరే, యెంత పొద్దుపోయినా కూచుని హోంవర్కు పూర్తిచేసిగాని నిద్రపోయేవాణ్ణికాదు.

మరునాడు విశ్వంతో యీా కథయావత్తూ జరిగింది జరిగినట్లు చెప్పాను.

"అదృష్టవంతుడివి మా అమ్మ ఎంతసేపటికి సంతకం పెట్టనేలేదు! 'చదవలేకపోతే చెప్పు. ఎందుకొచ్చిన చదువు, మాన్పిస్తా'నంటూ కూచుంది. మా పిన్నికూడా తెలుగులో 5 మార్కులు రావడం ఏమిటని యెగతాళిచేసింది. ఛీ, ఛీ, వెధవతెలుగు. ఎందుకొచ్చిన తెలుగురా నాయినా! మన ప్రాణాలు నిలువునా తీస్తోంది"

"బావుంది తెనుగు యెందుకనేదాకా వచ్చిందన్న మాట వ్యవహారం?" అన్నాను.

"మరి తనురు లెక్కలను దిక్కుమాలినవంటూ దీవించడం ఎందుకో సెలవిస్తారా ?" అన్నాను.

"ఊరికే తమాషాకుగాని, నిజంగా ననుకున్నావా ?"

"నేనూ అంతే"

సాయంత్రం డ్రిల్లు మాస్టారు స్కూలుకు బాస్కెట్‌బాల్ సామగ్రి అదీ తెప్పించాలనుకుని, మా క్లాసులోంచి మంచి టీము తయారుకావాలని చెప్పారు. మా అందరిలోను కొత్త ఉత్సాహం వెల్లివిరిసింది. నేను, విశ్వం వెళ్ళి మమ్మల్ని కూడ టీములో చేర్చుకోవలసిందిగా డ్రిల్లు మాస్టార్ని అభ్యర్థించాం.

బాగా మార్కులు వచ్చిన వాళ్ళని మాత్రమే చేర్చుకుంటాను అన్నారాయన. విశ్వం బిక్కమొగం వేసి నా వైపు జాలిగా చూశాడు. నేనుమాత్రం మామూలుగానే ఉన్నాను. నేను ఇంతకుపూర్వమే మంచి మార్కులు తెచ్చుకోవాలని నిర్ణయించుకున్నాను. గనుక త్వరలో టీములో చేరేందుకు అవకాశం వస్తుందనే ధైర్యం ఉంది.

ఇంటికి వెళుతూంటే దారిలో గోపాలరావు మాస్టారు కలిశారు. నన్ను, విశ్వాన్ని బాగా చదవమని చెప్పారు. కేకలేస్తారేమోనని జడిశాను. కాని అలాంటిదేమీ జరుగలేదు.

గడబిడలు చేసుకుంటూ వచ్చిన జడివాన వెలిసినట్లయింది. విశ్వంవద్ద సెలవు తీసుకుని తేలికపడిన హృదయంతో ఇంటివైపుకు సాగాను.

# 9

ఇంటికి వెళ్ళడంతోటే. లెక్కల పుస్తకం ముందేసుకు కూచున్నాను. నా పట్టుదలను చూసి నాకే ఆశ్చర్యంవేసింది. మొట్టమొదటే కఠినమైన లెక్కనుచేయ నిశ్చయించుకున్నాను. లెక్కను బాగా చదివి అర్థంచేసుకుని ఆపైన చేయాలని చెప్పిన విశాలరావు మాస్టారి మాట జ్ఞప్తికి వచ్చింది. లెక్కల పుస్తకంతీసి లెక్కను కాస్త బిగ్గరగా చదువ నారంభించాను.

ఒక అంగడిలో 8 బీరువాలు. అంతకు మూడురెట్లు కుర్చీలు గలవు. అందులో Aకి, $\frac{1}{2}$ వంతు కుర్చీలు, 3 బీరువాలు కలిపి 84 రూపాయలకు అమ్మబడెను. మిగిలిన బీరువాలు, కుర్చీలును Bకి 100 రూపాయలకు అమ్మబడెను. అయిన ఒక్కొక్క బీరువా ఖరీ దెంత ? కుర్చీఖరీ దెంత ?—

మొట్టమొదట ఏమీ అర్థంకాలేదు. అంతా అగమ్యంగా తోచింది. మళ్ళీ ఇంకోసారి చదివాను. ఊఁ హూఁ, ఏమైనా అంతు చిక్కితేనా ? ఇలా కాదనుకుని మొదటి వాక్యాన్నే మరల మరల చదువ నారంభించాను—ఒక అంగడిలో 8 బీరువాలు, అంతకు మూడురెట్లు కుర్చీలు గలవు. కాసేపటికి బండి కాస్త దారిలో పడింది. ఒక అంగడిలో 8 బీరువాలున్నాయి—సరే బాగానేఉంది. అంతకు మూడు రెట్లుకుర్చీలు గలవు—అంటే ఎనిమిది మూళ్ళు 24 కుర్చీలున్నాయన్న మాట. లెక్కలపుస్తకం రచయితమీద పట్టరాని కోపం వచ్చింది. ప్చ్, పెద్ద చదువు లున్నాయన్న మాటేగాని బుర్ర ఉండి చస్తేనా? ఇలాంటి చిన్నవిషయాలకుకూడ, అడ్డమైన

మెలికలుపెట్టి పిల్లలను చంపుకుతినకపోతే సూటిగా అఘో రించకూడదూ ? ఒట్టి డొంకతిరుగుడు వ్యవహారం. లేకపోతే ఏమిటి చెప్పండి ?

మళ్ళీ ఆలోచించాను. ఎన్నిరకాలుగా ఆలోచించినా సరైన ఆన్సరు రానేలేదు. ఇంక బుర్ర పాడుచేసుకోవటం వల్ల ప్రయోజనం లేదనిపించింది. విసుగెత్తి లేచాను, అయితే యెలాగైనా లెక్క చేసితీరాలనే పట్టుదలమాత్రం సడలలేదు. ఇప్పుడే వస్తానని మా అమ్మతో చెప్పి, తిన్నగా సారధియింటికి వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి సారధి పుస్తకాలు ముందేసుకుని వుసూరుమంటూ కూర్చున్నాడు. వాడు చదువుతున్నది ఇంగ్లీషుపాఠం అయివుంటుందని నా కప్పుడే అనుమానం వేసింది. అదేమోగాని, ఇంగ్లీషుకీ వాడికీ నిముషం పడదు. దాని పేరు చెబితేనే సారధి దిగులుపడతాడు.

"రారా వేణూ ! చదరంగం ఆడడానికి వచ్చావా యేమిటి ?" అన్నాడు నన్ను చూచి.

"ఇప్పుడేం చదరంగంరా, లెక్క తెలియకచస్తూంటే. ముందు......"

"ఏం లెక్క ?"

"నా మొహంలెక్క. ఏమనిచెప్పేది! 3 బీరువాలు, 12 కుర్చీలు కలిసి 84 రూపాయలు; 5 బీరువాలు, 12 కుర్చీలు కలసి 100 రూపాయలైన ఒక బీరువా ఖరీ దెంత ? ఒక కుర్చీ ఖరీ దెంత?"

"ఏం చేద్దామనుకున్నావ్?" అన్నాడు సారధి.

"ఎలా యేమిటి? 3 బీరువాలు, 12 కుర్చీలను కలపగా వచ్చినదానితో 84 ను విభాగిస్తేసరి!"

"చంపేశావ్. అసలు బీరువాలు, కుర్చీలు కలపడం యెందుకంటాను?"

"ఎందుకా? ఏంతోచక! 3 బీరువాలు, 12 కుర్చీల ఖరీదు 84 రూపాయలైనప్పుడు, ఒకదాని ఖరీదు కావాలంటే యేంచేయాలంటావ్?"

"ఒకదానిఖరీదంటే, ఒక బీరువాఖరీదనా? లేక ఒక కుర్చీ ఖరీదనా?"

"అటు బీరువా ఖరీదూ కావచ్చు, ఇటు కుర్చీఖరీదూ కావచ్చు."

"అంటే రెండువస్తువులఖరీదు సమానమే నంటావ్; అవునా?"

"ఆఁ. సమానమే. తప్పా?"

"తప్పా, తప్పున్నరానా. లెక్కల్లో వాటి రెంటిఖరీదు సమానమని యెక్కడైనా యిచ్చాడా? లేదే; విడివిడిగానే ఒక బీరువా ఖరీదు, ఒక కుర్చీఖరీదు తెలుసుకోవాలన్నమాట!"

"చిత్తం. ఈ ఉపోద్ఘాతంతోనే సరిపెడతావా లేక లెక్క ఏమైనా చెబుతావా?"

"ఆ తొందరే లెక్కల్లో పనికిరాదు. నెమ్మదిగా ఒక పద్ధతిప్రకారం చేసుకుంటూ పోవాలి."

"ఉపన్యాసాలు చాలించి అసలు విషయంలోకి రావోయ్"

"సరే కాని, మళ్ళీ ఓసారి బిగ్గరగా చదువు."

"3 బీరువాలు, 12 కుర్చీలు కలిసి 84 రూపాయలు; 5 బీరువాలు, 12 కుర్చీలు కలిసి 100 రూపాయలు"

"ఊఁ, లెక్కలో ఏమని ఇచ్చారు. మొదటిసారి 3 బీరువాలు, 12 కుర్చీలు; రెండవసారి 5 బీరువాలు, 12 కుర్చీలు విక్రయించారు. అవునా ?"

"ఊఁ"

"అంటే, మొదటిసారి అమ్మినకుర్చీలు రెండవసారి అమ్మినకుర్చీలు సమానంగానే ఉన్నాయి. ఇక పోతే బీరువాల విషయం. మొదటిసారికంటె రెండవసారి ఎక్కువ అమ్మిన బీరువాల సంఖ్య 2, అవునా ?"

"అవును"

"మొదటిసారికంటె రెండవసారి ఎక్కువగా వచ్చిన రూపాయలు 16. అవునా ?"

"అవును. మొదటిసారి 84 రూపాయలు వచ్చాయి. రెండవసారి వచ్చింది 100 రూపాయిలు. 100 లోంచి 84 తీసివేస్తే 16 యెక్కువ వచ్చాయి."

"అయితే రెండవసారి 16 రూపాయలెందుకు ఎక్కువ వచ్చాయో చెప్పు, చూద్దాం"

"ఓస్, ఇది చెప్పడం చాల తేలిక. రెండు బీరువాలు ఎక్కువ విక్రయించారు గనుక 16 రూపాయలు ఎక్కువ వచ్చాయి.

"అంటే రెండు బీరువాల ఖరీదు 16 రూపాయలన్న మాట. ఏమంటావు ?"

"ఊఁ"

"మరి ఒక బీరువా ఖరీదు"

"రెండు బీరువాల ఖరీదు 16 రూపాయలైతే అందులో సగం 8 రూపాయలన్నమాట"

"ఇక మనం కుర్చీ ఖరీదెంతో తెలుసుకోవాలి"

"ఓ తెలిసిపోయింది. నేనే చెప్తాను, వింటూండు. 3 బీరువాలు, 12 కుర్చీల ఖరీదు 84 రూపాయలు. అందులో 3 బీరువాల ఖరీదు 24రూాయలన్నమాట. 84 రూపాయల్లోంచి బీరువాలఖరీదు 24 రూపాయలు తీసివేస్తే 60 రూాలు. అంటే 12 కుర్చీల ఖరీదు 60 రూాలు. ఒకకుర్చీ 5 రూపాయలు."

సారథికి కృతజ్ఞత తెల్పి ఇంటికి చక్కావచ్చాను. కాని మనసు యెందువల్లనో బావుండలేదు. నా అసమర్థతనుచూసి నాకే అసహ్యంవేసింది. వెధవది యిలాంటి చిన్నలెక్క చేసేందుకే యింతకాలంపడితే ఇక పెద్దలెక్కలమాట! ఒక్కొక్కదానికి కనీసం ఓ వారం పట్టవచ్చు. ఎంతసేపైనా సరే, వచ్చే లెక్కనుమాత్రం స్వయంగానే చేసేందుకు నిశ్చయించుకున్నాను.

మరుసటిరోజున నాకు యింటికి లెక్కలు యివ్వలేదు. ఒకరోజు అయినా లెక్కలనుండి విశ్రాంతి లభించినందుకు సంతోషించాను.

కాని యింతలో మరో అవాంతరంవచ్చిపడింది. తెలుగు పద్యాలను తీయగా, హాయిగా చదువుకుంటూంటే మా సుగుణవచ్చింది. వచ్చింది కూచోవచ్చా, కబుర్లు మొదలెట్టింది.

"నన్ను అనవసరంగా మాట్లాడించకు. నీతో కబుర్లు చెప్పే తీరికలేదు నాకు" అన్నాను.

"నాకు హోంవర్కు యిచ్చిన లెక్క తెలియటల్లేదురా అన్నాయ్" అంది.

నేను మారుమాట లేకుండా సుగుణచేతిలోంచి పుస్తకం తీసుకుని లెక్కను లోపలే చదువనారంభించాను. ఒకసారి రెండుసార్లు... మూడుసార్లు. ఊంహుం, ఏమీా అర్థంకాలేదు. ఆమాట బయటికంటేయింకేమైనాఉందా! సుగుణ నన్ను ఓగడ్డిపోచక్రింద జమకడుతుంది. నా పెద్దరికంకాస్తా ఎగిరిపోతుంది. కనుక దాన్ని మెల్లగా కబుర్లలోకి దించి అసలువిషయాన్నించి దృష్టి మరల్చాలని చూశాను.

ఊంహుం, నా యెత్తు ఏమీా పారలేదు. సినిమాపేరు చెబితే నిద్ర మానుకుని ఎన్నిగంటలయినా ఓపికగా కూచునే సుగుణ, ఎందువల్లనో సినిమా ప్రస్తావన తెచ్చేసరికి ముఖం చిట్లించి, "పోనీరా అన్నాయ్, వెధవ సినిమాలు, నీ కెప్పుడూ అదే గొడవ. ముందు లెక్క చెప్పు. తరువాత తీరిగ్గా కబుర్లు చెప్పుకుందాం" అని పట్టుపట్టింది.

ఇక లాభంలేదనుకుని అనునయంగా అన్నాను: "ఇలా చూడు సుగుణా! ఇవాళ నాకు బోలెడంత హోం వర్కు వుంది. ముందు అది పూర్తిచేసి, తర్వాత నీకు లెక్క చెబుతాను. ఏం లెక్క. ముండమోపి లెక్క! సరిగాచేస్తే మూడు నిముషాలుపట్టదు. అలా కొంచెంసేపు పార్వతిగారింటికివెళ్ళి ఆడుకొనిరా, ఏం" అన్నాను.

"అలాగే వెళ్తానుగాని, నువ్వుమాత్రం నేను తిరిగివచ్చేసరికి లెక్కంతా చేసి సిద్ధంగా వుంచాలి."

"ఓ, తప్పకుండా"

సుగుణ కూనరాగాలు తీసుకుంటూ లేడిలా బయటకు పరుగెత్తింది. అది అలా వెళ్ళగానే మళ్ళీ లెక్కలపుస్తకం తెరచి బిగ్గరగా చదువనారంభించాను-

ఒక వూరిలో అన్నా చెల్లెలూ కలసి మామిడితోటకు వెళ్ళిరి. వారు మొత్తం 120 కాయలు కోసిరి. అన్న కోసిన కాయల్లో సగంమాత్రమే చెల్లెలు కోసెను. అందులో అన్న కోసిన కాయ లెన్ని? చెల్లెలుకోసిన కాయ లెన్ని?—ఇదీ లెక్క.

ఈ లెక్కను చూసేసరికి నవ్వువచ్చింది. పొట్ట చెక్కలయ్యేట్టుగా నవ్వాను. ఇదీ ఒక లెక్కేనా అనిపించింది. ఈ భాగ్యానికి కాగితం,కలం యెందుకని లోలోపలే చేయసాగేను. "ఇద్దరూ కలిసికోసిన కాయలు 120. సరే ఒకరు కోసినవి-120 ని 2 పెట్టి విభజిస్తే—60 వచ్చింది. అంటే చెల్లెలు కోసినకాయలు 60. ఇక అన్న కోసినకాయలు కనుక్కోవడం చాలా తేలిక. 120 లోంచి 60 తీసివేస్తేసరి—మళ్ళీ 60 వచ్చింది. అరే! భలే ఆశ్చర్యంగావుందే! ఐతే అన్నకోసిన కాయలు, చెల్లెలుకోసినకాయలు సమానంగా వున్నాయన్న మాట. ఊఁహుఁ, ఏదో తప్పచేశాను ఇద్దరూ సమానంగా కోశారనికాదుగా లెక్కలో యిచ్చింది. అన్నకోసిన కాయల్లో సగంమాత్రమే చెల్లెలు కోసింది అలాంటప్పుడు 60 ని 2 చేత విభజిస్తే— 30 వచ్చింది. అంటే అన్నకోసినకాయలు 60, చెల్లెలుకోసిన కాయలు 30. గబగబా ఆన్సరు చూశాను. హాతోస్మి. గుండెఆగినట్లయింది. దాంట్లో 'అన్నకోసిన కాయలు 80, చెల్లెలుకోసినకాయలు 40' అని వుంది. కళ్ళు నలుము

కుని మరీ చూశాను. అంతే! ఆన్సర్ల మీద చెడ్డ చిరాకు పుట్టుకొచ్చింది. ఎందుకొచ్చిన ఆన్సర్లు చెప్పండి! మన కో విధంగావస్తే, వాటిలో మరోవిధంగా వుంటుంది. నిజం చెప్పా లంటే నాకువచ్చిన ఆన్సరుకు పుస్తకంలోనిదానికి యెప్పుడూ సంబంధం వుండేదికాదు. ఆజన్మశతృవులవలె యెడముఖం పెడముఖంగా ఉండేవి.

ఏం చేయడానికీ తోచలేదు. కుస్తీ పోట్లాడి పోట్లాడి, ఓడిపోయిన ఏడుపుగొట్టు వస్తాదులా ఉంది. నా వ్యవహారం. సుగుణ వస్తుందేమోనని చూశాను. అదృష్టవశాత్తు ఆ ప్రమాదం జరుగలేదు.

ధర్మఘారంవాళ్ళని తలచుకుంటే విచారం వేసింది. ఘోర్తు ఘారం వాళ్ళకే ఎంత గింజుకున్నా అంతు దొరకని లెక్కను వాళ్ళు ఏం చేస్తారు పాపం !"

తుదిప్రయత్నంగా మరోసారి ఆలోచించేందుకు పూను కున్నాను. ఉన్నవి రెండు సంఖ్యలు—120, 2. ఈ రెండింటితో ఎన్నో పరిశోధనలు చేశాను. కూడిక, తీసివేత, హెచ్చవేత, భాగహారం – ఈ నాలుగు విధానాలతో ఎంతలేదన్నా కనీసం ఓ డజను సార్లయినా ప్రయత్నించి చూశాను. ఎన్ని విధా లుగా చేసినా అటు 80 గాని ఇటు 10 గాని వచ్చిన పాపాన పో లేదు.

లెక్కకు సరియైన జవాబు వస్తుందనే ఆశ పూర్తిగా నశించింది. సారధిదగ్గరకు వెళ్దామనుకున్నాను. కాని వెళ్ళ లేకపోయాను ఇలాంటి తేలిక లెక్క కూడ తెలియదని వెళ్తే రేపు క్లాసులో నలుగురి ముందు ఏడిపిస్తాడని జంకాను.

ఏమీ తోచక చివరకు నోటుపుస్తకం మార్జిన్‌లో మామిడి చెట్టు బొమ్మ వేశాను. మహావృక్షం కాకపోయినా కొంచెం పెద్దచెట్టువలె కన్పించేటట్లు వేశాను. కొమ్మలు, రెమ్మలుగాక 120 కాయలుకూడ ఉన్నట్లుగా గీచాను. చెట్టుమీద చిటారు కొమ్మల్లో కూచుని కాయలు కోస్తున్నట్లుగా అన్నచిత్రాన్ని, చెట్టుక్రింద మునివేళ్ళమీద నిలబడి కాయలు కోస్తున్నట్లుగా చెల్లెలి చిత్రాన్ని వేశాను. నాకు బంగినపల్లి కాయలంటే ఇష్టం గనుక చెట్టుక్రింద బంగినపల్లి మామిడిచెట్టు అని వ్రాశాను. బొమ్మ పూర్తిఅయినదే తడవుగా అనుమానాలు తామర తంపరగా రాసాగాయి. అసలు మామిడిచెట్టుకు 120 కాయలేపమిటని ఓ ధర్మసందేహం పుట్టుకొచ్చింది. నేను చూసిన మామిడిచెట్లలో వెయ్యికాయలకు తక్కువ ఉన్నదేదీ లేదు. ఇది తప్పక మరో ఊరిచెట్టు అయివుండాలి. మాఊళ్లో ఇలాంటి చెట్టే లేదని ఘంటాపథంగా చెప్పగలను. బహుశః లెక్కలపుస్తకం వ్రాసిన మాస్టారి గ్రామానికి చెందినదయి ఉంటుంది. ఏ ఊరిదైతే మన కెందుకని సరిపెట్టుకున్నాను. కాయలు కోయడం దగ్గర మళ్లీ ఓ అనుమానం పట్టుకుంది. చెల్లెలుకంటె అన్న ఎలా ఎక్కువ కాయలు కోయగలడాఅని! ఒకటీ అరా అయితే ఎలాగో సర్దుకుపోవచ్చునుగాని, సగానికి సగమా ! మొగబిడ్డ గనుక కోశాడని సమర్థించుకుందాం. అయినా అంత ఎక్కువా ? ఈ సంగతి మా సుగుణకు తెలిస్తే ఒక్కసారిగా పెంకు లెగరకొడుతుందని జడిశాను. ఆడపిల్లల నేదైనా అంటే దానికి వల్లమాలిన ఉడుకు మోతుతనం వచ్చేది. ఒక గంటవరకు తీవ్రస్థాయిలో రాగా

లాపన, మగవాళ్ళను తిట్టిపోయడం, కనపడిన వస్తువుకల్లా పాతరూపంమార్చి కొత్తరూపం యివ్వడం వగైరా కార్య క్రమం సాగించేది.

అన్న పెద్దవాడుగనుక చిటారుకొమ్మలవరకు వెళ్ళి చాలా కాయలు కోసిఉంటాడని, చెల్లెలు క్రింది కొమ్మలకు ఉన్న కాయలనుమాత్రమే కోసిందని తీర్మానించుకున్నాను. అందుకు గుర్తుగా అన్న చొక్కాకు రెండుజేబులు. చెల్లెలు గౌనుకు ఒక జేబు మాత్రమే వేశాను. తరువాత నిజంగా కాయలు 'కోయడం' ప్రారంభించాను. కోసిన కాయల్లో రెండు కాయలు అన్నకు, ఒక కాయ చెల్లెలికి-ఈ విధంగా పంచాను. ఎవరికాయలమీాద వారి పేరులోని మొదటి అక్షరాన్ని గుర్తుగా వేశాను. తరువాత అన్న రెండుజేబులు నిండుగా వున్నట్లు, చెల్లెలు ఒక్క జేబు కాస్త వెలితిగా వున్నట్లు దిద్దాను. అప్పుడు చటుక్కున నా బుర్రలో మెరుపు మెరిసినట్లయింది. మొత్తం కోసిన కాయలు 120. జేబులు 3. అంటే చెల్లెలు ఒక కాయ కోసే సమయంలోనే అన్న రెండు కాయలు కోసివుండాలి. అలా అయితే చెల్లెలికి ఒక వంతు వస్తే, అన్నకు రెండు వంతులు వస్తాయి. ఆలస్యం చేయకుండా 120 ని 3 చేత విభజించాను - 40 వచ్చింది. దాన్ని రెండుపెట్టి గుణించాను - 80 వచ్చింది. ఓ ! సరైనఆన్సరు ఇప్పటికి తేలింది. మరోసారి సగర్వంగా ఆన్సరు చూశాను. సరిగానే వుంది ! ఏమీా తేడా లేదు.

నా ఆనందానికి హద్దులేదు. మనసులో ఏవేవో తీయని భావాలు కదిలాయి. ఎలాగైనా ఈ సువార్తను సారథికి

చెప్పి వాడి మెప్పు పొందాలని సంకల్పించుకున్నాను. వెంటనే పుస్తకం పుచ్చుకుని బయల్దేరాను.

పట్టరాని ఉత్సాహంతో పరుగెత్తుకుంటూ వెళ్తుంటే దారిలో విశ్వం కనిపించాడు. ఎందుచేతో విచారంగా వున్నాడు. ఒంట్లో బాగుండలేదేమోనని అడిగి చూశాను. జవాబు లేదు. "సరేగాని, ఇలాచూడు. ఓ అన్నాచెల్లెలు తోటకెళ్ళారు. ఇద్దరూ కలిసి మొత్తం 120 కాయలు కోశారు. అన్న కోసిన వాటిలో సగం మాత్రం చెల్లెలు కోసింది. అయిన చెల్లెలు ఎన్ని కాయలు కోసింది? అన్న ఎన్ని కాయలు కోశాడు? ఈ లెక్క ఎలా చేస్తావో చెప్పు చూద్దాం, నీ తెలివి బయట పడుతుంది" అన్నాను.

"హుఁ, ఉట్టి పీనాసి వెధవ అయివుంటాడు"

"ఎవడు?" చికాకుగా అన్నాను.

"ఆ లెక్కలో అన్న. వాడుగనుక కనపడితే ముక్కు పచ్చడి చేయకుండా వదలను, తెలిసిందా? విశ్వం......"

"ఎందుకు?" అనడిగాను.

"ఎందుకా చెల్లెలుకంటె ఎక్కువ తీసుకున్నందుకు. నాకు చిన్న చెల్లెలే ఉంటేనా..."

"అది కాదోయ్ దద్దమ్మా. వాళ్ళకు మొత్తం కాయలను ఏవిధంగా పంచుతావని అడుగుతున్నాను."

"ఆ తంతు నాకు వదిలేయ్, నే చూసుకుంటాను. నేను చచ్చినా ఎవరికీ పంచను ఎవడొస్తాడో చూస్తాను..."

"ఏమిటోయ్ వచ్చేది, పిచ్చి పట్టిందా యేమిటి?"

'పిచ్చి గిచ్చి అవతలపెట్టు. ఇలాంటి వ్యవహారాల్లో మొగమాటం ససేమిరా పనికిరాదు. లేకపోతే సునిద్దరం చెరి సగం పంచుకుంటేనో... ఇష్టమైతే చెప్పు..."

"అది లెక్కలోరా బాబూ ! నిజం మామిడికాయ లనుకున్నా వేమిటి?"

"ఓస్, లెక్కా ! చంపేశావ్. నిజం మామిడికాయ లేమో ననుకున్నాను"

"అయితే తక్షణం బుర్రను మరమ్మత్తుకు పంపించు"

"వేళాకోళాలు ఆపవోయ్. కుక్కపోయి నే నేడుస్తుంటే మధ్యలో ఈ వెధవ లెక్కతో ప్రాణాలు తీస్తుంటివి." అని దారి పట్టాడు.

బాణంలా రివ్వున నేనూ ఒక్క పరుగున సారధి ఇంటికి వెళ్ళాను వాడితో లెక్క సంగతి చెప్పి ఇంటికి వచ్చాను. సుగుణకు ఎప్పుడు చెబుదామా అని తహతహగావుంది.

"ఏరా అన్నాయ్, లెక్క చేశావా ?" అని అడిగింది.

"ఇంతసేపా, యీ వెధవ లెక్క చేయడానికి ? ఎప్పుడో చేసేశాను" అన్నాను దర్జాగా.

"అమ్మో, అంత చులాగ్గా చేశావన్నమాట!"

"ఊఁ, ఏమనుకున్నావ్ మరి. ఇంకొక తమాషా చూడు..." చెట్టుబొమ్మనుచూపుతూ దానికి అంతా క్షుణ్ణంగా వివరించాను.

"భలే, భలే అన్నాయ్‌వి. అబ్బ, చెట్టుబొమ్మ ఎంత బావుంది! ఆ కొమ్మలు, ఆకులు, కాయలు, అచ్చం నిజం చెట్టులా వుంది. నువు ప్రతిదీ అద్భుతంగా చేస్తావురా వేణూ"

సుగుణ బొమ్మనుచూసి మహా మురిసిపోతోంది నన్ను తెగ పొగిడింది. నేను దాని మాటలకు పొంగిపోయాను. మా సుగుణ పూర్వం నన్ను కలలోకూడ ఇంత ఘనంగా పొగిడి వుండదు.

"హుఁ వేణు అంటే ఏమనుకున్నావ్? నీకు ఎప్పుడు ఎలాంటి లెక్క కావాలన్నా నేచెబుతాలే, సరేనా ?"

సుగుణ అంగీకారసూచకంగా తల త్రిప్పింది.

మానవు లెంత త్వరగా మారిపోతారు ! అంతా ఆశ్చర్యం ! ఇంతవరకు నాకు లెక్కలలో ఎవరి సహాయమైనా కావల్సివచ్చేది. ఇప్పుడో - తారుమారు. నేనే మరొకరికి తోడ్పడే స్థితిలో ఉన్నాను. ఇంకా ఆశ్చర్యకరమైన విషయ మేమంటే ఇంతాచేస్తే నాకు లెక్కలలో మామూలుమార్కులకు మించ లేదు.

## 10

మామూలుగానే బడికి వెళ్లాను. నిన్నటి సంఘటన మనసులో దాగివుండి మాటి మాటికి స్ఫురణకు రాసాగింది. ఆనాడుమట్టుకు క్లాసులో సగర్వంగా తలెత్తుకుని ఠీవిగా కూచున్నాను. ఏమంటే మాస్టారు ఎలాంటి జటిలమైన లెక్క ఇచ్చినా ఓ నిముషంలో చేయగలననే ధైర్యంతో ఉన్నాను. కాని, ఆనాడు నాకు తీరని ఆశాభంగం కలిగిందనే చెప్పాలి. రోజూనామీద ప్రశ్నల వర్షం కురిపించే విశాలరావుమాస్టారు ఆ వాళ నావంకే చూడలేదు. చాలసార్లు ఆయన దృష్టి మరల్చాలని చూశాను. కాని, నా ప్రయత్నం ఫలించ లేదు.

సాయంత్రం ఆటలాడాలనిపించలేదు. తిన్నగా ఇంటికి వచ్చి లెక్కలు చెయ్యడం మొదలెట్టాను. నాలుగు లెక్కలు పూర్తిచేసేసరికి గంటపట్టింది. అంతటితో నాకు సంతృప్తి కలుగలేదు. మా సుగుణ పుస్తకం తీసుకుని ఓ పది లెక్కలదాకా చేశాను. ఏ సుముహూర్తాన మొదలెట్టానోగాని చేసిన ప్రతి లెక్కకు సరియైన ఆన్సరే వచ్చింది. ఐతే గత సంవత్సరం చేయక విడిచిపెట్టిన లెక్కలన్నీ పూర్తిచేయాలని సంకల్పించుకున్నాను. పోయినసంవత్సరము చేయలేనని ఆశ వదలుకున్న లెక్కలను చూస్తుంటే ఇవి పూర్వపువేనా లేక కొత్తవా, అన్న సందేహం కల్గింది. ఎంతో జటిలమనుకున్న లెక్కలను కూడ తృటలో ఆన్సరు రావడంచూసి నా తెలివికి నేనే మురిసిపోయాను. అయితే ఇప్పటికి అసాధ్యమైన బాపతు ఒకటీ అరా లేకపోలేదు. వాటిని గురించి నే నాట్టే బెంగపడ లేదు. తరువాత తీరికగా వాటి సంగతి తేల్చుకుందామని గుర్తుపెట్టి ఉంచాను. అయినా అలాంటి చిక్కులు ఎప్పుడూ తప్పవు. పిట్టకథలాగా ఎక్కడా కామా, ఫుల్‌స్టాప్ లేకుండా కవిత్వం చెప్పగల దిట్టనైనా హఠాత్తుగా వెళ్ళి తెలుగుఅక్షరాలు ఎన్నని అడిగితే తెల్లమొహంవేస్తాడు. ఇది నా స్వానుభవంమీద చెబుతూన్న విషయమే. ఒక్కోసారి నేను మా సుగుణఅడిగే లెక్కలకే తల్లక్రిందులవుతాను. అక్కడిదాకా ఎందుకు? ఒకసారి విశాలరావుమాస్టారు రెండు రెళ్ళు ఎంతని అడిగితే కళ్ళుతేలవేసి గది దూలాలను లెక్కపెట్టాను.

(14)

మూడవఫారం లెక్కలపుస్తకాన్ని పూర్తిచేసేసరికి మూడువారాలు పట్టింది. దాంతో నాకు లెక్కలంటే పూర్వం ఉన్న ద్వేషం, కోపం, భయం—అన్నీ సంపూర్ణంగా తుడిచి పెట్టుకుపోయాయి, ఎటువంటి చిక్కులెక్కనైనా తేలిగ్గా చేయగలననే ధైర్యం వచ్చింది. ఒక్కముక్కలో చెప్పాలంటే నేనిప్పుడు లెక్కలకు ప్రియమిత్రుణ్ణి. వాటినిచేయడమే నాకు ఆనందం. నాన్న, అమ్మ నాకృషినిచూసి ముక్కుమీదవేలేసుకున్నారు. సుగుణకూ నేనంటే గౌరవం హెచ్చింది.

విశాలరావుమాస్టారు నాలోకలిగిన ఈ పరిణామానికి ఆశ్చర్యపోయారు. నన్ను మొద్దబ్బాయని వెక్కిరించిన చక్రిపాణి మెచ్చుకోసాగాడు. డ్రిల్లుమాస్టారు నాకు వాలీబాల్ టీములో చేరేందుకు అనుమతినిచ్చారు. ప్రత్యేకంగా తర్ఫీదు ఇవ్వడానికి వాగ్దానం చేశారు కూడాను.

ఇక విశ్వంవిషయం దీనికిపూర్తిగా వ్యతిరేకం. ఒట్టి సోమరిగా తయారయ్యాడు. ఇప్పుడు వాడి జంతుసంతానం—ఒక కుక్కపిల్ల, రెండుచిట్టెలుకలు. వాటినిపోషించలేక వయసుమీరిన సంసారిలా సతమతమయ్యేవాడు. ఆ పెంపుడు బిడ్డలకు నివాసగృహాలు తయారుచెయ్యడం, వాటినిస్నానంచేయించడం, ఆహారం పెట్టడం, షికారుతిప్పడం విశ్వానికి నిత్యకృత్యాలైపోయినై. అందులో మరీ కుక్కపిల్లను గురించి అధికశ్రద్ధ తీసుకునేవాడు. దానినామకరణంకోసం ఓ చిన్న యజ్ఞం చేసినంత హంగామాచేశాడు. కనబడిన ప్రతివాణ్ణి అందమైన పేర్లుంటే చెప్పమని ప్రాధేయపడేవాడు. ఈ పేర్ల సేకరణ ప్రయత్నంలో నన్ను కనీసం ఓ పాతికసార్లయినా వేటాడి

వుంటాడు. ఈ బాధ భరించలేక చివరకు విసుగెత్తి అన్నాను:

"ఏమిటోయ్, కనపడ్డవాణ్ణల్లా యీ వేట? వెధవ కుక్క పిల్లకి పేరుపెట్టడం కోసం ఇంతమంది ప్రాణాలు తీయకపోతే.."

"ఇదిగో వేణూ, చేతనైతే చెప్పడం లేకపోతే నోరు మూసుకోవడం మంచిది. అంతేగాని, కుక్కనిమాత్రం తిట్టకోయ్" అన్నాడు విశ్వం.

"అయితే నీ యిష్టంవచ్చినట్లు అఘోరించు, నా దేం పోయింది" అని తప్పుకున్నాను.

తదుపరి ఓ వారంరోజులకు కుక్కకి 'భైరవి' అని నామకరణం చేసినట్టుగా చెప్పాడు. ఘనకార్యం చేశావులే అన్నా న్నేను. తల పంకించి, ముఖం చిట్లించి కుక్కకు రొట్టె పెట్టాలంటూ వెళ్ళిపోయాడు.

విశ్వానికి పూర్తిగా చదువంటే శ్రద్ధ తప్పింది. వాళ్ళ అమ్మకూడా వీడికి చెప్పడం శుద్ధ దండుగమారిపని అని మానుకుంది. పుస్తకాలను బూజుకు, చెదపురుగులకు ఆహారంగా సమర్పించి, రాత్రింబవళ్ళు కుక్క పెంపకంతో కాలం వెళ్ళబుచ్చేవాడు. క్లాసుకురావడంకూడా తగ్గించాడు. కాంపోజిషన్ క్లాసుకు ఎప్పుడూ వచ్చేవాడు కాదు. తలనొప్పి, కడుపులో బాధ, చెవిలో పోటు, కళ్ళు కలగడం - ఇత్యాది 'కాంపోజిషన్ రోగాలు' చెప్పి వాళ్ళమ్మచేత సెలవుచీటీ పంపించేవాడు. సర్వసామాన్యంగా ఈ రోగాల గరిష్టకాలం ఒక్కరోజు. మరుసటిరోజుకల్లా ఆ బాధలన్నీపోయి మామూలుగా తయారయ్యేవాడు.

రేపు కాంపోజిషన్ క్లాసని తెలుగు మేష్టారు చెప్పడంతో విశ్వానికి మూర్ఛ వచ్చినంత పనైంది. ఇంటికెళ్ళడంతోటే తలకు తువాలు కట్టుకుని పడుకున్నాడు. తల పగిలిపోతోందని, మాష్టారికి సెలవుచీటీ వ్రాసిపంపమని వాళ్ళమ్మతో చెప్పాడు. పాపం ! ఆమె గాభరా అంతా ఇంతా కాదు ఓసారి దిష్టి తీసిపారేసింది. తలపట్టుకుని చూసింది. "నొప్పి బాబోయ్" అంటూ పొలికేక వేశాడు. ఆమె పూర్తిగా నమ్మింది. బడీ వద్దు, బండలూ వద్దు. ఇంటిపట్టునపడుండు నాయనా" అంటూ సెలవుచీటీ పంపించింది. మళ్ళీ అదేరోజున కడుపులో నొప్పి అంటూ మెలికలుతిరిగిపోయాడు. వాళ్ళమ్మ ఈసారికూడా సెలవుచీటీ పంపించింది. గంట గడిచిందో లేదో కడుపులో కాలి అన్నమంటూ దీర్ఘాలు సాగించాడు.

"కడుపునొప్పితో బాధపడుతూ అన్నమేమిటో? నీ మొహం !" అంది తల్లి.

"ఆకలవుతోందే, ఏం చేయమంటావ్ ?"

"నీ ఇష్టం బాబూ, నాకేం. తర్వాత నువ్వే బాధ పడతావు,"

అన్నం తిని హాయిగా తిరగడంచూసి వాళ్ళమ్మకు అనుమానం వేసింది. కాని ఏమీ అనలేదు. మళ్ళీ అదేరోజున చెవిపోటంటూ మొదలెట్టాడు. ఆమె నమ్మలేదు. ప్రతివారం ఒకే రోజున ఈ రోగాలు యెందుకు వస్తున్నాయో ఆమెకు అర్థమైంది. "ఆ సత్యనారాయణ డాక్టరుగారిని పిలుస్తానుండు. ఓ యింజక్షను యిస్తాడు. రోగం కుదురుతుంది" అన్నది.

ఇంజక్షను పేరు చెప్పగానే విశ్వానికి భయం వేసింది.

"దీనికి ఇంజక్షను ఎందుకే? రేపటికదే తగ్గిపోతుందిలే" అన్నాడు తప్పించుకోటానికి.

"ఊహుఁ. అలా కాదు. నే నిప్పుడే వెళ్ళి పిలుచుకు వస్తాను." అన్నది గట్టిగా.

విశ్వానికి వాళ్ళమ్మ సంగతి తెలుసు. ఆమె ఏదైనా అనుకుంటే చాలు. అక్షరాలా చేసితీరుతుంది. పోనీ దబాయించి చూస్తేనో అని ఆపనీ చేశాడు. సాగలేదు. తప్పు ఒప్పుకోక తప్పిందికాదు. ఇంకెప్పుడూ ఇలా అబద్ధాలాడనని చెంపలు వేసుకుంటేనేగాని ఆమె క్షమించలేదు.

మరునాటి సాయంకాలం బడి వదలినతర్వాత నేను ఇంటికి వెళ్తుంటే దారిలో కలిశాడు. మహా సంతోషంగాను, హుషారుగాను ఉన్నట్లు కనపించాడు.

"మా ఇంటికి వెళ్దాం రారా, భైరవిని చూద్దువుగాని" అన్నాడు.

"భైరవిని చూసేదేమిటి? నిన్నటిలాగే ఉందా లేక నక్కగా మారిందా!" అన్నాను నేను.

"వేళాకోళం ఆపవోయ్; భైరవికి ఓ కొత్త ఫీటు నేర్పానులే"

"ఏమిటది? వంకరగా ఉన్న తోకను తిన్నగా చేయడమా?

"ఉఁహుఁ, బంతిని నోటితో పట్టుకుని గెంతడం భలేగా ఉంటుందిలే, చూసితీరాలి..."

"అదీ గొప్పే నంటావ్"

"కాదంటావా ? ఏమీ తెలియని కుక్క అలాచేయడం వింత కాదూ ?"

"ముండమోపి బంతిని నోటితో పట్టుకుని గెంతడం కూడ వింతన్నమాట"

"నోరుమూసుకుని పద, చూసినతర్వాత నీ ఇష్టంవచ్చినట్లు వ్యాఖ్యానిద్దువుగాని"

ఎలాగూ వదిలేఘటం కాదని వెళ్ళాను. విశ్వం ఇంట్లో నుంచి ఓ ఆడుకునే బంతి, రెండు పాలకోవాముక్కలు పట్టుకొచ్చాడు. పాలకోవా ఉన్నట్లు వాసన పసిగట్టగానే భైరవి తోకాడించుకుంటూ వచ్చింది విశ్వంమీదికి ముందు కాళ్లు ఎత్తి, గురగురమని మొరుగుతూ ఎగర సాగింది. విశ్వం బంతిని కుక్క నోటిదగ్గరగాపెట్టి అన్నాడు.

"ఊఁ భైరవీ ! ముందు ఈ బంతి పట్టుకో, పాలకోవా ముక్క—ఇస్తాను" అన్నాడు.

బంతిని చూడగానే భైరవి తోక ముడిచి మొరుగుతూ దూరంగా వెళ్ళి మూల కూచుంది.

"పాలకోవాముక్క ఇస్తాను. ముందు బంతిపట్టుకో" విశ్వం కోపంగా అరిచాడు మళ్ళీ.

భైరవి ఉన్నచోటునుంచి కదల్లేదు. విశ్వానికి భైరవి చర్య అవమానకరంగా తోచింది. గబగబావెళ్ళి బలవంతంగా దానినోరు పగలతీసి బంతి కుక్కివచ్చాడు. అంతే, వాడటు తిరిగాడో లేదో భైరవి ఆ బంతినికాస్తా కిందపడేసి ఏమీ తెలియనట్లు దిక్కులుచూడ్డం మొదలెట్టింది.

"కుక్కబుద్ధి పోనిచ్చిందికాదు. నిన్న నాలుగు గంటల

సేపు చెప్పిందంతా మర్చిపోయింది. మళ్ళీ మొదటినుంచి ఏడ వాలి" విశ్వం చికాకుగావెళ్ళి భైరవిని లాగి డొక్కలో తన్నాడు. అది ఓ పావుగంటసేపు పెంకులెగిరేటట్లు వివిధ స్థాయిల్లో రాగాలు తీస్తూనేవుంది. ఇక లాభంలేదనుకొని ఓ పాలకోవాముక్క విసిరేశాడు. రాగాలుమాని గబగబా పాలకోవాముక్కను స్వాహాచేసి మళ్ళీ యధాప్రకారం తీవ్ర స్థాయిలో అందుకుంది భైరవి

"ఒసి దీన్ని తగలెయ్య. పాలకోవాలు మింగేందుకు భలే ఉపాయం కనిపెట్టిందే !" అని దండంతో పనికాదనుకుని విశ్వం భైరవిని సామంతో లొంగదీయడానికి పూనుకున్నాడు. కాని అదీ ఫలించలేదు.

విశ్వం ఇంకో పాలకోవాముక్కను భైరవికి అందిచ్చాడు. అది దానిని ఆప్యాయంగాతింటూ విశ్వంకాళ్ళచుట్టూ తిరుగ నారంభించింది.

"ఊఁ, రెడీ" అంటూ విశ్వం భైరవికి బంతినందించాడు అది కాసేపు పరీక్షచేసిన మీదటగాని బంతిని అందుకోలేదు.

"ఒక్కగంతువెయ్యి, మరోపాలకోవాముక్కయిస్తాను" అన్నాడు విశ్వం పాలకోవాముక్కను పైకెత్తిచూపుతూ.

పాలకోవాముక్క చూసేసరికి భైరవికి హుషారు హెచ్చింది. గురగురలాడుతూ ముందుకాళ్లు రెండూ పైకెత్తింది.

విశ్వం సంతృప్తిగా నవ్వాడు. ఓ పెద్ద ఘనకార్యం సాధించినవాడిలా సంబరపడుతూ అన్నాడు: "చూశావా మూర్తి, ఎలా గెంతిందో. హుఁ, విశ్వమంటే ఏమనుకున్నావ్ !"

"ఏమిటీ గెంతడం. రెండుకాళ్ళూ పైకెత్తగానే గెంతి నట్లవుతుందేమిటి ?" అన్నాను నవ్వుతూ నేను.

విశ్వం కుక్కలు అలాగే గెంతుతాయని చెప్పాడు. గెంతడంలో ఎన్నో రకాలు ఉన్నాయని, దేనికిష్టమైన విధా నాన్ని అది అనుసరిస్తుందని, భైరవికి ముందుకాళ్ళతో గెంత డమే అలవాటని చెప్పాడు.

విశ్వం చదువు సంధ్యలు వదలి భైరవితో ఊరేగడం మరి కాస్త జోరుచేశాడు. దానికి బంతి పట్టుకుని గెంతడమే కాకుండా, బంతి దూరంగా విసరడం, విసరివేసిన బంతిని అది తెచ్చియివ్వడం, ఇంటికెవరన్నా వస్తే సలాంచేయడం వగైరా తమాషాలు నేర్పాడు. కుక్కకు నేర్పడంతోబాటు తానుకూడ నేర్చుకున్నట్లయితే చాలా సంతోషించేవాణ్ణి కాని విశ్వం అలా చేయలేదు.

## 11

ఊళ్ళోకి కొత్తగా సర్కసు కంపెని ఒకటి వచ్చిందన్న వార్త రాధాయి మోసుకొచ్చాడు. ఇది మామూలు నాటు రకం సర్కసులాంటిదికాదనీ, ప్రపంచమంతా పేరుప్రఖ్యాతుల నార్జించుకున్నట్టిదనీ చెప్పాడు. సింహాలు, పెద్దపులులు, ఎలుగుబంట్లు, గుర్రాలు, లొట్టిపిట్టలు ఇత్యాది మామూలు జంతువులేగాక—మాట్లాడే చిలుక, పోట్లాడేఎలుక, లెక్కలు చేసే కుక్క లాంటి వింత వింత రకాలు ఉన్నాయనీ, అన్నిటి కంటె గొప్పది మోటారుసైకిల్ ఫీట్లని ప్రత్యక్ష సాక్షిలా ఓ

చిన్న కథగా చెప్పుకొచ్చాడు. సర్కసుపేరు వినగానే నా మనసులో ఎన్నో ఆలోచనలు కలిగాయి. నేను చిన్నప్పుడు అంటే ఎనిమిదేళ్ళప్పుడు ఓసారి సర్కసు చూశాను. అదీ చాల చిన్నది. నాకు ఆ వింత లేవీ జ్ఞాపకంలేవుగాని ఓపులి ఘట్టుకు చూచాయగా బుర్రలో ఉంది. ఆ దృశ్యం నా కళ్ళ ముందు ఇప్పటికీ అవుపిస్తూనే ఉంటుంది. అది బోనులోంచి ఒక్క గెంతులో రంగస్థలంమీదికి దుమకడం, ఆ జ్యోతుల్లాంటి కళ్ళతో క్రోధంగా నలువైపులా చూస్తూ, భీకరంగా గుండెలు పగిలేట్లుగా గర్జించడం, నాన్న భయంలేదని చెప్పి నన్ను దగ్గరకు తీసుకోవడం, అన్నీ కళ్ళముందు కదిలాయి. ఈ మధ్య సర్కసంటూ చూడటమే పడలేదు. బాగా సినిమాలకు వెళ్ళడం అలవాటయింది. మళ్ళీ ఈనాటికి వచ్చింది సర్కసు.

ఇక విశ్వంసంగతి చెప్పనక్కర్లేదు. అసలు తనకు సర్కసు ముక్కూ, మొఖం తెలియవనీ, కేవలం వినికిడిమాత్రమేననీ చెప్పాడు. ఇద్దరమూ తప్పకుండా సర్కసు చూడాలని నిశ్చయించుకున్నాం.

మా క్లాసువాళ్ళందరంకలసి సర్కసుకు వెళ్దామనుకున్నాం. చక్రపాణి తను టికెట్లు చౌకగా లభించేవర్పాటు చేస్తానని చెప్పాడు. దాంతో మాకు సర్కసును గురించిన ఉత్సాహం రెట్టింపయింది.

మరునాడు చక్రపాణి మా అందరికీ టికెట్లు తెచ్చాడు. పావలాకే మేము రెండో క్లాసులో కూచునేందుకు అనుమతి సంపాయించాడు. అందరం చక్రపాణికి ధన్యవాదాలు చెబుతూ హుషారుగా సర్కసుకు బయల్దేరాం.

(15)

మేము వెళ్ళేసరికి, సర్కసు మొదలెట్టడానికి ఇంకా అర గంట పైముందని తెలిసింది. మా ముఠా అందరం ఒకే వరుసలో కూచున్నాం. సర్కసుకబుర్లు జోరుగా సాగాయి.

డేరా అంతా విద్యుద్దీపాలతో శోభాయమానంగా వుంది. పై కప్పునుంచి ఉయ్యాలతాళ్లు వేలాడుతున్నాయ్. కింద వలయాకారంగా ఓ గట్టులాంటిది వేశారు. ప్రక్కన నిచ్చెనలు, పెద్ద పెద్ద రింగులు, తాళ్లు వగైరా సర్కసుసామగ్రి వుంది. క్రమక్రమంగా ప్రేక్షకులు రాసాగారు. ఓ పావుగంట గడిచేసరికి డేరా అంతా నిండిపోయింది. పట్టణమంతా తరలి వచ్చినట్లుంది. నేను లెక్కవేద్దామని చూశానుగాని సాధ్యం కాలేదు. రెండువందల ముప్ఫయిదాకా లెక్కించాను. తరువాత వరుసతప్పింది. ఇంతలో రంగురంగుల లైట్లు వెలిగాయి. డేరా చూసేందుకు చాలా మనోహరంగాను, సజీవంగాను వుంది. దీపాలవంక కళ్లు పెద్దవిచేసుకుని పరిశీలనగా చూస్తూన్న నేను పెద్ద శబ్దం వినడంతో రంగస్థలంవైపు దృష్టి సారించాను. తెల్లని పొట్టిచొక్కాలు, ఎరుపు నిక్కర్లుతొడుక్కున్న ఓ అరడ జనుమంది యువతులు రంగస్థలానికి వచ్చి ప్రేక్షకులందరికీ నమస్కారంచేసి, గబగబా కోతుల్లా నిచ్చెనలమీాది కెగ్రబాకి ఉయ్యాలమీాదకు చేరారు. ఇదంతా ఓ క్షణంలో జరిగిపో యింది. వాళ్లు రకరకాల ఫీట్లుచేశారు. ప్రతిదీ చాలా చక్క గాను, క్రమబద్ధంగాను వుంది. ఆరుగురుకలిసి ఒకరినొకరు పట్టుకొని మొగ్గలేస్తూ ఉయ్యాలలూగిన ఫీటు అన్నింటిలోకి ఉత్తమంగావుంది. ఓ పదిహేను నిముషాలపాటు అలాచేసి వాళ్లు మెరుపులవలె లోనికి వెళ్ళారు.

వెంటనే ఏనుగులతోపాటు ఒక ఆజానుబాహుడైన వ్యక్తివచ్చాడు. ఆరడుగులకుపైగా పొడవున్నాడు. నుదుటి మీదకు వంగిన తెల్లనిటోపీ, లావుఫ్రేము కళ్ళజోడు, చొక్కా మీద తళతళమెరిసే వివిధాకృతుల పతాకాలు – ఈ వేషం చూసి మేము తప్పక జంతువులకు తర్ఫీదుఇచ్చేవాడయి ఉంటాడని ఊహించాం. వచ్చీరావడంతోటే అతడు కొరడా ఝుళిపించి ఏనుగులను ఒకసారి అదలించాడు. అవి మెదలకుండా బుద్ధిమంతులవలె రంగస్థలంలో వలయంగా తిరుగనారంభించాయి. అలా కొంచెంసేపు తిరిగి రంగస్థలంమధ్యలోనున్న చిన్న ముక్కాలిపీటమీద ఒక ఏనుగు సావకాశంగా కూచుంది. తదుపరి ఇంకోకుర్చీ వేయబడింది. దానిమీద మరొక ఏనుగ ముందుకాళ్ళుపెట్టి నిలబడింది. రెండూ తొండాలెత్తి ప్రేక్షకులకు సలాం చేశాయి. ఓ నిముషంసేపు గుండ్రంగాతిరిగి తరువాత నిష్క్రమించాయి.

తదుపరి మొట్టమొదటవచ్చిన యువతులు మళ్ళీ వచ్చారు. అయితే ఈసారి దుస్తులుమారాయి. తెల్ల సక్కర్ల మీద పసుపుపచ్చ చొక్కాలువేసుకున్నారు. కాళ్ళకు తెల్లని బూట్లున్నాయి. వచ్చీరావడంతోటే పూర్వంవలెనే నమస్కారం చేశారు. రింగుల్లోంచి దూరడం, తీగమీద చకచకా నడవడం సీసాలమీద దీర్ఘచతురస్రపుపీటపెట్టి దానిమీద నాట్యం చేయడం వగైరా తమాషాలెన్నో చేశారు. వీటిల్లో నాకు నచ్చింది తీగమీదనడవటం.

ఇంతలో ఓ అరడజను కుక్కలువచ్చాయి. ఆరూ ఆరు రంగులు. బహుశః రంగులు వేసివుంటారు. చూడటానికిముట్టుకు

భలే తమాషాగా ఉన్నాయి. ముఖం కనపడకుండా పెద్దజూలు అప్పుడప్పుడూ ఆజూలులోంచి మిణుగురుపురుగులవలె మెరుస్తూ అగుపించే చిన్నకళ్లు, మెడలో గొలుసులా తోలుపటకా, మళ్ళీమళ్ళీ చూడబుద్ధివేసేట్లున్నాయి. అవన్నీకలసి మొదట రంగస్థలంచుట్టూ షికార్లుచేశాయి. తరువాత వెనుక కాళ్ళ మీద నడిచాయి. ఒకదానిమీద మరొకటి కూచుని స్వారీ చేశాయి. రెండుపార్టీలుగా చీలి ఫుట్‌బాల్ ఆడాయి. ఆఖరుకు అలసిపోయినట్లు మెల్లగా నడచి నియమితస్థానాల్లో కూచున్నాయి. ఇంతలో లోపలనుంచి ఓ కుక్క అరుస్తూ వచ్చి వాటిమధ్య నిలబడింది. వేషం మామూలుగానే వుందిగాని, నడుముమీదమట్టుకు బంగారు రంగుగుడ్డ పట్టీ మెరుస్తోంది. ఏనుగులవెంట వచ్చిన జంతువులకుతర్ఫీదుయిచ్చేవాడు మళ్ళీవచ్చి ఆ కుక్కనుగూర్చిన ముచ్చట్లు చెప్పాడు. ఈ కుక్క సామాన్యమైనది కాదని, లెక్కలు చేయగలదని, లోగడ యెన్నో బహుమతులు పొందిందని, జమీందారు ఒకాయన దీని తెలివికి మెచ్చి వెండిమువ్వల గొలుసును బహూకరించాడని చెప్పుకొచ్చాడు. ఓ పెద్ద స్టూలు తెప్పించాడు. కుక్క చెంగుమని యెగిరి దానిమీద కూర్చున్నది. దాని ముందు మూడు కొయ్యముక్కలను పెట్టి లెక్కించమన్నాడు. మేమంతా మహా ఆశ్చర్యపోయాం. కుక్క మాట్లాడలేదుకదా, అన్నరు యెలా చెబుతుందో చూద్దామని వూపిరిబిగపట్టుకుని, చెవులు రిక్కించుకుని చూస్తున్నాం. ఆశ్చర్యం! కుక్క ఏమీ మాట్లాడ లేదు. మూడుసార్లు బిగ్గరగా ఉఫ్ ఉఫ్ ఉఫ్ అని అరిచింది. కుక్కకు బహుమానం యేదో యిచ్చాడు.

ఒక నిముషం విరామం. పూర్వం పెట్టిన మూడు కొయ్యముక్కలను తీసి యీ సారి ఐదు పెట్టాడు. "ఊఁ, లెక్కించు" అన్నాడు.

కుక్క అందరికి వినపడేలా ఐదుసార్లు అరిచింది.

తరువాత జంతువులను తర్ఫీదు చేసేవాడు ఓ నల్లబల్ల తెప్పించాడు. దానిమీద ఒక అంకె వేయడం కుక్క వెంటనే ఆ అంకె యెంతో అన్నిసార్లు అరవడం చేసింది. మమ్మల్ని యింతకంటె ఆశ్చర్యపరచినది కుక్క కూడిక, తీసివేత లెక్కలు కూడా చేయడం.

"రెండు రెళ్ళెంత?" కుక్కవంక చూస్తూ జంతువుల మాష్టరు కుక్కను అడిగాడు. కుక్క నాలుగుసార్లు అరిచింది.

"మూడు, నాలుగు కలిపితే?" - కుక్క యేడుసార్లు అరిచింది.

"పదిలోంచి నాలుగు తీసివేస్తే?" కుక్క ఆరుసార్లు అరిచింది. మేము స్తబ్ధులమైపోయాం. బుద్ధి యెరిగినతర్వాత యిలాంటి వింతను చూడటం యిదే ప్రథమపర్యాయం!

మళ్ళీ యువతులు వచ్చారు. ఈసారి ముగ్గురే వచ్చారు. ఒక్కొక్క చేతిలో నాలుగు గాజు పళ్ళాలు ఉన్నాయి. వాళ్ళు వాటిని గిరగిరా త్రిప్పుతూ, గాలిలోకి ఎగరవేస్తూ చాలసేపు ఆడుకున్నారు. మేము అందులో ఏ ఒక్కపళ్ళెమైనా క్రింద పడుతుందేమోనని ఆశించాం కాని అలా జరుగలేదు.

అరె! ఈ తమాషాల్లోపడి బఫూన్ సంగతే మరచిపోయానే అని అనుకుంటూండగానే ఎగురుకుంటూ వెకిలిగా నవ్వుతూ ప్రత్యక్షమయ్యాడు. నీలిరంగు పొడుగులాగు, ఎరుపు

చారల వదులు చొక్కా, ఆకుపచ్చ టోపీతో వాడు తయా రయ్యాడు. ముఖానికి అంగుళం మందాన పౌడరు కొట్టాడు. కళ్ళ చుట్టూ వెడల్పుగా కాటుక పెట్టుకున్నాడు. ముక్కు మాత్రం ఎర్రగా పండిన దొండపండులా వుంది. ఇక అలం కారాలకు కొదువలేదు. మెళ్లో ఓ పలుపులాంటి గొలుసు, నెత్తిమీద కాకి యీకల కిరీటం, చేతిలో మంత్రదండంలా చిన్న కర్రముక్క వగైరా అస్త్రశస్త్రాలతో తయారయ్యాడు. వచ్చి రావడంతో ప్రేక్షకు లందరికీ ఎడమకాలు క్రిందుగా పురచెయ్యెత్తి సలాం చేశాడు. 'హీ, హీ, హీ!' అంటూ ఓ ఐదు నిముషాలు నవ్వేసి అమాంతం క్రిందకూలబడ్డాడు. హఠాత్తుగా చిన్న బఫూను ఒకడు హాజరయ్యాడు. పెద్దవాడి కంటె వాడే రెండు ఆకులు చదివినట్లు కన్పించాడు. వస్తూనే పెద్ద బఫూనుగాణ్ణి నడ్డి విరిగేట్టు యీడ్చి కాలితో ఓ తాపు వడ్డించాడు ఏమిటో అని పెద్ద బఫూను బిత్తరపోయి వెనక్కి తిరిగేసరికి మూడు పగిలేట్టు మొట్టికాయ పడింది తల తడుము కోబోయేసరికి గూబ కాస్తా గుయ్యిమంది. అన్నితన్నులు తిని పెద్ద బఫూను బిగ్గరగా నవ్వుతూ వాడి చేతిలోని గాజుపళ్లెం లాక్కొని మోకాళ్ళు విరిగేట్లుగా మంత్రదండంతో ఒక్కటి పుచ్చుకున్నాడు. లబోదిబోమంటూ వాంటే లాగి ఓ లెంపకాయ పుచ్చుకున్నాడు. ఏమిస్తూనే వాణ్ణి మెడపట్టి తెరమీదికి వెళ్లి పడేటట్లుగా గ్రోశాడు తరువాతి తెలిసింది- అది ఒత్తి దెబ్బలాటని. పెద్ద బఫూను ఆ గాజు పళ్ళాన్ని గాలిలో ఎగ రేస్తూ ఆడుకొన్నాడు కొంతసేపు అలా ఎగరేసి చివరకు బుద్ధిపూర్వకంగా దాన్ని బుర్రమీద వేసుకుని కాసేపు ఏడ

వటంద్వారా మమ్మల్ని నవ్వించాడు. ఇంతలో మళ్ళీ చిన్న బఫూనుగాడు ఓ గుర్రాన్ని వెంటబెట్టుకుని వచ్చాడు. ఈసారి ఎందువల్లనో వీళ్ళిద్దరు పోట్లాడుకోలేదు. ప్రాణమిత్రులవలె కాసేపు కబుర్లు చెప్పుకుని ఇద్దరూ కలిసి గుర్రంమీద షికారు వెళ్ళిరావాలని నిశ్చయించుకున్నారు అయితే గుర్రం ఎలా అనే సమస్య చాలాసేపు చర్చించారు. ఓ నిముషంసేపు డేరా కప్పువంక చూస్తూ మధ్య మధ్య తమ బుర్రమీద మంత్రి దండంతో కొట్టుకుంటూగడిపారు. పెద్ద బఫూను చిన్నవాడు గుర్రపు చెవులను జాగ్రత్తగా పట్టుకుంటే తను వెనుకవైపు నుంచి తోక పట్టుకుని ఎక్కగలనని చెప్పాడు. తోక పట్టు కోగానే గుర్రం సాచి తన్నింది. ఆశ్చర్యం! పెద్ద బఫూను మూతిపై రెండు పళ్లూ లక్షణంగా ఊడిపడినై. మాకు వరుసగా లెక్కిస్తూ, పళ్ళన్నిటినీ చూపాడు. నిజమేనని నమ్మాం. తరువాత తెలిసింది- అవి మాయపళ్ళని.

ఇక ఒక్క మోటారుసైకిలు ఫీటుమాత్రమే మిగిలింది. విశ్రాంతి సమయంలో మేము బయటికి వెళ్ళలేదు. కాల క్షేపానికి తలా ఒక అర్ధణా బఠాణీలు కొనుక్కుని తీరిగ్గా తింటూ కూచున్నాం. విశ్రాంతి అయిపోయింది. బయటకు వెళ్ళినవాళ్ళంతా మళ్ళీ చేరుకున్నారు. లైట్లన్నీ ఒక్కసారే వెలిగాయి. మోటారుసైకిలు ఫీటుచేసే ఉక్కు మందిరంలోనికి కాంతి ప్రసారించబడింది. ఆ ఉక్కుమందిరాన్ని గురించి కొద్దిగా తెలియబరుస్తాను.

ఉక్కుమందిరం స్థూపాకారంలో సుమారు 25 అడుగుల ఎత్తు. 35 అడుగుల చుట్టుకొలత కలిగివుంది. పల్చని

ఉక్కురేకులతో తయారుచేశారు. ఈ ఉక్కురేకులు కదలకుండా వుండేందుకుగాను ప్రతి అడుగుకి ఒకచోట బలమైన ఉక్కు పట్టాలతో తాపడంచేశారు. ఉక్కు మందిరంలో ప్రవేశించడానికి ఓ చిన్న ద్వారం వుంది.

ఇంతలో గంట మోగింది. మోటారుసైకిల్ రొద చేస్తూ ఉక్కు మందిరంలో ప్రవేశించింది. దానిమీద పూర్తి తెల్లని దుస్తులను ధరించిన యువకుడు వున్నాడు. మెడచుట్టూ ఎర్రని రిబ్బను కట్టుకున్నాడు. సైనికులుధరించే టోపీ కాళ్ళకు నల్లగా మెరుస్తూన్న నిండు బూట్లు—చూడటానికి చాలా అందంగా వున్నాడు. ఫీటు ప్రారంభించబోయేముందు ప్రేక్షకులకు నమస్కారంచేశాడు. జేబులోంచి ఓ ఫోటోతీసి కళ్ళ కద్దుకొని తిరిగి జేబులో పెట్టుకుని మోటారుసైకి లెక్కాడు. మొదట నేలమీద నెమ్మదిగా కొద్దిసేపు తిరిగి హఠాత్తుగా పైకి పోనారంభించాడు. క్రమంగా వేగం హెచ్చించబడింది. ఝువన్ గన్ మోతలా గుండెలుపగిలే ధ్వని ప్రారంభమైంది. ఒక్కొక్కచుట్టే తిరుగుతూ ఉక్కుమందిరం చివరికంటా వెళ్ళింది. మాకు ఆ వేగంచూస్తే నిజంగా భయంవేసింది. ఎప్పుడు క్రింద పడిపోతుందోనని ఆదుర్దాగా చూస్తూ అనుకున్నాను - "ఒక వేళ మధ్యలో యింజను చెడిపోతే?" అని. అమ్మో! యింకేమైనా వుందా? ఈ ఆలోచన వచ్చినందుకు నేనే సిగ్గుపడ్డాను. మోటారుసైకిలు భద్రంగా క్రిందికి దిగింది. మళ్ళీ ఓ సారి అందరివైపు తిరిగి నమస్కారం చేసి మోటారుసైకిలు నడుపుకుంటూ లోనికి వెళ్ళిపోయాడు. ప్రేక్షకు లంతా డేరా లేచిపోయేట్లు హర్ష ధ్వానాలు చేశారు.

సర్కసు సమాప్తమైంది. జన మంతా యేదో కొంప మునిగినట్టు తోసుకుంటూ రాసుకుంటూ సాగిపోతున్నారు. కాని, నాకుమాత్రం ఆ ప్రదేశం వదలి వెళ్ళా లనిపించలేదు. నేను పెద్దవాణ్ణయినతర్వాత రోజూ కాకపోయినా వారాని కొకసారైనా సర్కసుకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. సర్కస్ అంటే నాకు మహాసరదా!

## 12

రెండు రోజుల తర్వాత విశ్వంఇంటికి వెళ్లాను. నేను వెళ్ళేసరికి వాడు గదిలో వెల్లకిలా పడుకుని, కాళ్ళు పైకెత్తి పై కప్పువంక చూస్తున్నాడు. చేతుల్లో పెద్దట్రంకుపెట్టె ఉంది.

"ఏమిట్రోయ్ తల్లకిందులుగా తపస్సు చేస్తున్నావ్! చేతిలో పెట్టేమిటి?" అని అడిగాను.

"ఉత్తపెట్టెలే. సరేకాని, నే నో తమాషాచేస్తాను, చూస్తుండు."

విశ్వం మెల్లగా పెట్టె నెత్తి అరికాళ్ళమీద పెట్టు కున్నాడు. పెట్టుకున్నవాడు పోనీ ఊరుకోవచ్చు పైకి ఎగ రేయబోయాడు. పెట్టె శబ్దం చేసుకుంటూ క్రింద పడింది.

"ఈసారి చూడు" అంటూ విశ్వం మళ్లీ పెట్టెను కాళ్ళమీద పెట్టుకునేందుకు యత్నించాడు; కాని సాధ్యం కాలేదు.

"వేణూ! కాస్తసహాయంచెయ్యరా"దీనంగాఅడిగాడు.

నేను పెట్టెనుకాస్త ఎత్తి వాడి కాళ్ళమీద పెట్టాను. రెండు నిముషాలసేపు అలాగే ఉంచాడు. తరువాత బుర్ర

తిరిగిందికాబోలు మళ్లీ పెట్టెను పైకివిసరేయ పూనుకున్నాడు. పెట్టె అమాంతం జారి సూటిగా వెళ్ళి విశ్వాం గుండెలమీద పడింది. దాంతో ఓ గావుకేక వేసి ఏడుపు లంకించుకున్నాడు.

పెద్దగాయం తగల్లేదుగాని గుండెమీద కాస్తమేర గీచుకుపోయి రక్తం వచ్చింది. ముక్కు కాస్తా పచ్చడయింది. నేను లోపలికివెళ్ళి చన్నీళ్ళు తెచ్చి ముఖంమీద చల్లాను. కాసేపటికి మామూలు మనిషయ్యాడు. ముక్కు తడిమి చూసుకుని బిక్కమొగంవేశాడు.

"ఏం, అణిగిందా తిక్క. ఇలాంటి చేతా వాతా గాని తమాషాలెందుకు?" అన్నాను.

"నోర్మూయ్, ఒక్తి పిరికిరకం. అట్టే వాగకుండా తేలిక రకం వస్తువేదైనా చూడు, మళ్లీ తమాషా చేద్దాం."

"బహువచనంలో ఏడవకు. నీ సంగతి చూసుకో."

గదంతా కలయజూశాను.నాకేమీఅవుపించలేదు. పెద్ద సామానులంటూ ఉండి చస్తేనా? ఉన్నవి నాలుగూ శిధిలావస్థలో ఉన్నాయి. చివరికి విశ్వామే ఓ పాత దిండును బయటికి తీశాడు.

"వేణూ! ఇందాకటిమాదిరిగా కాకుండా యీ దిండును నువ్వు పట్టుకుని దూరంగా వెళ్ళు. నేను మామూలుగా వెల్లకిలా పడుంటాను నా కాళ్ళకు అందేట్లుగా దిండును విసరివేసి తరువాత చూడు మన తమాషా......"

నేను మెదలకుండా వెళ్ళి దూరంగా నిలబడ్డాను. విశ్వాం వెల్లకిలాపడుకుని 'రెడీ'అన్నాడు. నేనుదిండునువిసురుగా విశ్వాం వైపు విసిరాను. అది సరిగా వాడి కాళ్ళదగ్గరకు వెళ్ళేసరికి

వాడికి భయంవేసిందికాబోలు కాళ్ళు ముడిచాడు. అది తిన్నగా వెళ్ళి వాడి ముఖానికి కొట్టుకుంది.

"అదేంగురిరా. సరిగా వెయ్యలేవూ?" అని బిగ్గరగా అరిచాడు.

'అఘోరించు. చేతులారా చేసుకున్నదేగా"

"నీ కసలు గురి తెలిసియేడిస్తేగా! ఈసారైనా జాగ్రత్తగా విసురు. తెలిసిందా?"

విశ్వం మళ్ళీ పడుకుని 'ఊఁ' అన్నాడు. చాల నెమ్మదిగా విసిరాను. కాని, పట్టుకోలేకపోయాడు. చివరికి యెలాగైతేనేం ఒకసారిమాత్రం యీ తమాషాను సాధించగలిగాడు.

నేనుకూడా చేద్దామనుకున్నాను. కాని, విశ్వం ముక్కు సంగతి జ్ఞప్తికివచ్చి ఆ ప్రయత్నంనుంచి విరమించుకున్నాను.

"ఇక దిండు తమాషా చాల్లే. కాసేపు కుర్చీఫీటు చేస్తాను చూడు" అన్నాడు విశ్వం.

విశ్వం మూలగావున్న ఓ పాతకుర్చీని మోసుకొచ్చి గది మధ్యగా వేశాడు. దానిమీద కూచుని వెనక్కు వొరగడం ప్రారంభించాడు. చివరకు కుర్చీ వెనుకకాళ్ళమీద నిలబడింది. అదీ ఒక్క క్షణంసేపు. విశ్వం సంతోషం పట్టలేక మరికాస్త వెనక్కు వొరిగాడు. అంతే! కుర్చీ తల్లక్రిందులైంది. మాడు పగిలిందేమోనని చూచుకునేందుకు చెయ్యెత్తబోయి కెవ్వుమని కేకవేశాడు. ఏమిటో అని కంగారుగా చెయ్యిపట్టుకుని చూడబోయాను. ఇంకేముంది, గిలగిల తన్నుకోసాగాడు. చన్నీళ్లు తెచ్చి చల్లాను. ఓ పావుగంటకు చెప్పాడు – 'చెయ్యి బెణికి, స్వాధీనంకాస్త తప్పిం' దని.

"మంచిది. ఇకముందైనా యిలాంటి పిచ్చిచేష్టలు చేయకుండా తగిన శాస్త్రి జరిగిందిలే!"

"హుఁ, దీనికే జడిస్తే మన గొప్పేమిటి?" అంటూ చెయ్యి నొక్కసారి విదిలించాడు.

"ఇంకా యెడమచెయ్యి మిగిలిందిగా! దానిపనికూడా కానీయ్"

"పిరికి కబుర్లు చెప్పకు. ఈసారి పళ్ళాలతమాషా చేద్దాం"

"అంటే......"

"రాత్రి సర్కసులో చెయ్యలేదూ! నేను మొదట ఓ పళ్ళాన్ని నీ మీదికి విసురుతాను. తరువాత నువ్వు అదే విధంగా చెయ్యాలి. నీ పళ్ళాన్ని నేను పట్టుకుంటాను. నీవు నా పళ్ళాన్ని పట్టుకో, ఏం?"

"ఊఁ, అదీ ఇదీ కాదని చివరకు కంఠాలకే పెట్టావన్న మాట ఎసరు! ఖర్మంకాలి పట్టుకోలేకపోయామో పీక తెగుతుంది."

విశ్వం ఏమీ మాట్లాడకుండా లోపలికి వెళ్ళి రెండు గాజు పళ్ళాలు తెచ్చాడు. కొత్తపళ్ళాలు కాబోలు-రంగులు కొట్టవచ్చినట్లుగాఉన్నాయి.

ఆట ప్రారంభించాం. నేను నెమ్మదిగా విశ్వం వైపు పళ్ళాన్ని విసిరాను. విశ్వం దాన్ని కోతిలా ఎగిరి పట్టుకుని నామీదికి విసిరాడు. ఇలా నాలుగుసార్లు జరిగేసరికి మాఇద్దరికీ హుషారు హెచ్చింది. గబగబా విసురుకోవడం ఆరంభించాం. ఇంతలో గాజు పళ్ళెం పగిలినచప్పుడైంది. మా ఆట

కట్టింది. ఇద్దరం ఒకేసారి క్రిందకు చూశాం. పగిలిన గాజు పెంకులు చిందరవందరగా గదంతటా పడి వెక్కిరిస్తున్నట్లు వున్నాయి.

"ఇలాఅయితే ఇంట్లో పళ్ళాలకు బదులు పెంకులే మిగులుతాయిరోయ్?" అన్నాను.

"ఔను, నిజమే, ఏం చేద్దామంటావ్?"

"నీవే ఆలోచించు"

విశ్వం ఒక నిముషంసేపు ఆలోచిస్తున్నట్లు పోజుపెట్టి చరచరా ఇంట్లోకి వెళ్ళి ఓఇత్తడి పళ్ళెంతో తయారయ్యాడు.

"ఏమిటి? ఇత్తడి పళ్ళాలతో ఆటలా? కుతూహలం కాస్తా ఉత్తరించుకపోతుందిసుమా!" అన్నాను.

"కుంటిసాకులతో కాలక్షేపంచేయకోయ్"

మేము కొంచెంసేపు ఇత్తడిపళ్ళెంతో ఆడుకున్నాం. చివరికి ఇత్తడిపళ్ళెం కిటికీని ఢీకొన్నది. అదృష్టవశాత్తు కిటికీ గ్లాసు బ్రద్దలై పగులిచ్చిందే గాని క్రిందపడలా.

"చచ్చాం, మా అమ్మ చూసిందంటే ఇవాళ తాషామార్పా మోగుతుంది." అన్నాడు విశ్వం.

విశ్వం ముఖం కళావిహీనమైంది.

"పచ్చని తెల్లకాగితం అంటిస్తే"

"ఊఁ హుఁ! మా అమ్మ గుర్తుపడుతుంది. ఆఁ, తెలిసింది. మా పాత బీరువాకు ఇలాంటి గ్లాసేఉంది. దీన్ని ఇక్కడినుంచి తీసి దాన్ని తెచ్చిపెడితినో..."

"భేషుగ్గాఉంది ఆలోచన. అయితే చాల జాగ్రత్తగా చేయాలి"

మేము బీరువాగ్లాసు తీసుకొచ్చి చూశాం. కిటికీలో పట్ట లేదు. పెద్దదయింది.

పక్కింటికి వెళ్ళి గ్లాసు కోసే యంత్రం తెచ్చాము. గదిలోకి వచ్చి చూస్తే ఏముంది, గ్లాసు కాస్తా మాయం!

"ఇక్కడ పెట్టిన గ్లాసేమయింది? వింతగా ఉందే" అంటూనే విశ్వం వెనక్కి ఓ అడుగు వేయడం గాసు పగిలిన శబ్దం కావడం జరిగింది. విశ్వం బూటుకింద పడి గ్లాసు కాస్తా కృష్ణార్పణం అయింది. విశ్వానికి ఒకవైపు పునపట్టరాని దుఃఖమూ, మరోవైపు కోపమూ వచ్చాయి.

"ఇక్కడ పెట్టిన వెధవ ఎవడు?" అన్నాడు.

"ఎవడా? పగలగొట్టినవాడే..." అన్నా న్నేను.

"అట్టే పేలకు, తల తిరుగుతుంది"

"అవును, తల తిరిగితేనే ఇలాంటి తప్పుడు పనులు చేసేది..." కోపంగా అన్నాను.

"నోర్మూయ్, నీ పుణ్యమా అంటూ మా అమ్మచేత అడ్డమైన తిట్లు తినాలి. పోనీ ఆముక్క లన్నింటినీ అతికిస్తేనో"

ఇద్దరం గ్లాసు ముక్క లన్నింటిని పోగుచేసి శ్రద్ధగా అతికించ నారంభించాం. కాని కుదర లేదు. విశ్వానికి పిచ్చెత్తి నట్లయింది. ఓ పెద్ద గాజు ముక్కను తీసి పైకి ఎగరేశాడు. అది క్రిందపడి చిన్న చిన్న ముక్కలు కావడం, కొద్ది ధ్వనితో గది తలుపులు తెరుచుకోవడం ఒకేసారి జరిగాయి. విశ్వంఅమ్మ రానేవచ్చింది.

"కొంపంతా ఏమి టీ ఆగం. నిజం చెప్పు, లేకపోతే ఒళ్లు చీరేస్తాను"

విశ్వం బిగ్గరగా ఏడుస్తూ, మధ్య మధ్య నాలుగు మాటలు చెప్పడం, మళ్లీ ఏడుపు- ఈ విధంగా ఓ అరగంటకు జరిగిన కథంతా వాళ్ళమ్మకు చెప్పాడు.

"ఇక ఇలాంటి పిచ్చిపనులుచేయకు, జాగ్రత్త! శుభ్రంగా గాజు పెంకులన్నీ ఎత్తి పారేసి చదువుకో, ఏం?"

విశ్వం గాజు పెంకులు ఏమీ లేకుండా తీసి ఓ కాగితంలో కెత్తి దూరంగా పారేసి వచ్చాడు. సబ్బుతో చేతులు కడుక్కుంటూ నేను అన్నాను-

"మీ అమ్మ చాలమంచిదిరా విశ్వం. మా ఇంట్లో అయితే రోజంతా సాధించేవాళ్ళు"

"అప్పుడే ఏమైనది. మా సుభద్ర పిన్నిని రానీ..."

సుభద్రపిన్ని వచ్చిందాకా వుందామనుకున్నాను. కాని, హోంవర్కు లెక్కలసంగతి జ్ఞాపకంవచ్చింది. విశ్వానికి చెప్పి యింటికి వచ్చాను.

మరుసటిరోజు బడికివెళ్తుంటే విశ్వం కలిశాడు. డాక్టరు దగ్గరకు వెళ్తున్నానని చెప్పాడు. ఎందుకని అడిగాను. ఒంట్లో బాగులేదని చెప్పాడు క్లాసులో విశాలరావుమాస్టారు విశ్వం రాలేదేమని అడిగితే వాడిఒంట్లో బాగులేదని చెప్పాను.

సాయంత్రం యింటికి వెళ్ళేటప్పుడు విశ్వందగ్గరకు వెళ్ళాను. నడవలో నుంచుని వాళ్ళమ్మ ఏవో పాటలు పాడుకుంటోంది. ఇంతలో విశ్వం హఠాత్తుగా వూడిపడ్డాడు. నన్ను గదిలోకి లాక్కుపోతూ అన్నాడు—

"కొంపతీసి మా అమ్మకు నేను బడికి రాలేదని చెప్పేవా యేమిటి?"

"ఊఁ హుఁ. నే నిప్పుడేగా వస్తా......"

"రక్షించావు. ఒక వేళ అడిగినా యేమీ చెప్పకు"

"ఏమిటి కథ?"

"ఒంట్లో బాగులేదనే వంకతో బడిఎగవేశాను"

"అయితే ఏమీలేదన్నమాట. మరి ప్రొద్దుట డాక్టరు దగ్గర కెందుకు వెళ్ళావ్?"

"హుష్, పెద్దగా మాట్లాడకు. అదంతా నాటకంలే. డాక్టరు సత్యనారాయణగారు లేరూ, ఆయనదగ్గరకు వెళ్ళి చీటీ తీసుకురమ్మని పంపింది. తీరా వెళ్తే ఆ డాక్టరొక మొండిఘటం. నన్ను ఓ పావుగంట పరీక్షించి జబ్బూలేదు పాడూలేదు పొమ్మన్నాడు కాదు మహాప్రభో! జలుబుచేసి చస్తున్నాను; రాత్రి యెన్నిసార్లు తుమ్మానో లెక్కేలేదని విన్నవించు కున్నాను. నామాట సరిగా వింటేనా? పైగా తుమ్ములు రావడం చాలా మంచిదంటూ సోదాహరణంగా నిరూపించి, నన్ను బుజ్జగించి పంపాడు.

"ఐతే మీ అమ్మకు చీటీ చూపించావా?"

"చీటీ కేమిటి వెధవది. డాక్టరుగారి చిత్తుకాగితాల బుట్టలోంచి మెల్లగా ఒకటి సంగ్రహించాను......"

"సరిసరి, ఇంకేం. అసలు బడి కెందుకు మాను కున్నట్లు!......"

"ఇవాళ క్లాసుకొస్తే తెలుగుమాస్టారు మన మార్కులు చూసి........."

"ఐతే రేపూ క్లాసుందిగా! అప్పు డేంచేస్తావ్?"

"రేపూ రాను. ఒక వేళ మాస్టారు అడిగితే జబ్బుగా వుందని చెప్పు"

"ఏం జబ్బని చెప్పమంటావ్?"

"వాగులో జబ్బు. ఏదో ఒకటి చెబుదూ; తీరిపోతుంది"

మరుసటిరోజు క్లాసుకు నిజంగానే విశ్వం రాలేదు. తెలుగు మాస్టారు విశాలరావు మాస్టారూ ఇద్దరు విశ్వం రాక పోవడానికి కారణమేమిటనిఅడిగారు. జబ్బుగాఉందని,అందులో మలేరియా అని చెప్పాను.

ఇలా అబద్ధమాడినందుకు చాల బాధపడ్డాను. కాని మిత్రునికోసమే గనుక ఫర్వాలేదని సముదాయించుకున్నాను. అసలు జీవితంలో ఒక్కసారైనా అబద్ధాలాడని మనిషి ఈ ప్రపంచంలోనే లేడేమో!

## 13

బడి వదలిపెట్టిన తర్వాత విశ్వంఇంటికి వెళ్లాను. విశాలరావు మాస్టారితో జరిగిన సంభాషణాసారాంశాన్ని వినిపించి "నీకోసం అబద్ధం కూడ చెప్పాను. కనుక కాస్త జాగ్రత్తగా ఉండటం మంచిది. మాస్టారికి గనుక బజార్ల వెంట తిరుగుతూ కనపడితే నీకూ నాకూ కూడ ముప్పు తప్ప"దని హెచ్చరించాను. విశ్వం తను ఎవరికళ్ళాపడకుండా తిరి గేందుకు పడుతూన్న పాట్లన్నీ వెళ్ళబోసుకున్నాడు. వాళ్ళమ్మ కీ సంగతి తెలిస్తే వీపు పగలడం ఖాయమని సెలవుచీటీ

లేకుండా బడికి రానందుకు విశాలరావు మాస్టారు తిడతారనీ ఏం చేయడానికి తోచకుండా ఉందని చెప్పాడు.

"మీ అమ్మతో చెప్పి, తప్పు ఒప్పుకుంటేసరి, సెలవు చీటీమీద సంతకం పెడుతుందని నా నమ్మకం" అని సలహా చెప్పాను.

"అది నమ్మకం మాత్రమే, జరిగేపనికాదు. అయినా నేను చదువదలచుకుంటేగా... హాయిగా సర్కసులో చేరి పోతాను" అన్నాడు.

"మరి భైరవికి తమాషాలు నేర్పావా ?"

"ఊఁ హుఁ, నిన్ననేగా మొదలెడతా, చూద్దువుగాని ఉండు, భైరవిని పిలుస్తాను."

విశ్వం పిలుపుతో భైరవి తోకాడించుకుంటూ వచ్చింది. విశ్వం లోనికివెళ్ళి నాలుగు పాలకోవాబిళ్ళలు, పది కొయ్య ముక్కలు తీసుకొచ్చాడు.

"భైరవీ! నేను మొదట ఆ కొయ్యముక్కలను లెక్కిస్తాను. నువ్వు జాగ్రత్తగా విని మళ్ళీ నాకు చెప్పాలి. తెలిసిందా?" అంటూ విశ్వం ఒక్కొక్క కొయ్యముక్కనే తీసి దానిముందు పెడుతూ ఒకటి, రెండు, మూడు అని పదిదాకా చదివాడు. "మొత్తం పది; విన్నావా భైరవీ?"

కుక్క వినిపించుకున్నట్లు లేదు. పాలకోవాకోసం మొగురుతూ గురగురలాడుతోంది. విశ్వం కుక్కమూతిమీద ఒక్కటి అంటించాడు. అది కుయ్యోమంటూ కూనిరాగాలు ప్రారంభించింది. వాడు నా వైపు తిరిగి—

"ఏం చేద్దామంటావురా వేణూ? నాకేం తోచకుండా వుంది" అనడిగాడు.

"మొదట 3 అంకెలవరకు చెబితేనో......"

"మూడెందుకులే ముదనష్టం. రెండుతో ప్రారంభిద్దాం"

"నీ యిష్టం" అన్నాన్నేను.

విశ్వం దానిముందు రెండు కొయ్యముక్కలను మాత్రమే వుంచి మిగతావాటిని తీసేశాడు. "చూడు, భైరవీ! నీ ముందున్న కొయ్యముక్క లెన్నో తెలుసా? ఇదిగో ఒకటి, రెండు. వీటిల్లోంచి నే నొకటి తీసుకున్నా ననుకో - యిక్క డెన్నుంటాయ్? ఒకటి. నేను తీసుకున్న కొయ్యముక్కను తిరిగి అక్కడే వుంచా ననుకో - అప్పు డెన్నుంటాయో తెలుసా? రెండు. జాగ్రత్తగా విన్నావుకదూ? ఐతే నీముం దెన్ని కొయ్య ముక్క లున్నాయో చెప్పు చూద్దాం."

కుక్క కిదంతా సొదనిపించింది కాబోలు తోకముడిచి బయల్దేరింది.

విశ్వం భైరవివైపు చూస్తూ అన్నాడు. "ఉఫ్, ఉఫ్ అంటే రెండన్నమాట. ఊఁ, త్వరగా చెప్పు"

"ఉఫ్, ఉఫ్, యేమిటోయ్. ఏదో కొత్తభాషలావుంది"

"అవును కుక్క భాష! సర్కస్‌లో వినలేదూ?"

భైరవి యీ ఉఫ్, ఉఫ్ లేమీ పట్టించుకున్నట్లు లేదు. కళ్ళుమూసుకుని పడుకునే ప్రయత్నం చేస్తోంది. విశ్వానికి దాని నిర్లక్ష్యం చూసి ఒళ్లు మండింది. వెనకగా వెళ్ళి నడుం విరిగేట్లు ఒక్కటిచ్చాడు. అది మూలుగుతూ మూలకు దారితీసింది.

"ఇక లాభం లేదురా వేణూ! ఇది పూర్తిగా మొద్దుబారిపోయింది. దీనికి ఈవిధంగా లెక్కలు నేర్పాలంటే బ్రహ్మతరం కాదు. అందుకని మొదట నీకు నేర్పుతాను. అంటే నువ్వు కుక్కలా అరవాలి. అది చూచి భైరవికూడ అలా అరవడం నేర్చుకుంటుంది; ఏమంటావు?"

"అయితే నేను కుక్క నంటావ్, అంతేనా?"

"కాదు. వేణుగోపాలరావు వేలే. కుక్కలా అరిస్తేనే కుక్కవై పోతావా ఏమిటి? మాఅమ్మ నన్ను లక్షసార్లు గాడిద వంది. అంతమాత్రానికే గాడిద నయ్యానా చెప్పు?" అన్నాడు.

"పోనీ, ఆ పని నువ్వే చేస్తే?" సలహా ఇవ్వబోయాను.

"ఏడిసినట్టుంది సలహా. అలా చేస్తే ఇది నన్ను కూడ ఓ కుక్కకింద జమకట్టి, ఇక నామాట చచ్చినా వినకపోగా పైగా తోటి కుక్క నని కుస్తీకి దిగుతుంది"

"ఇప్పుడు నాతో కుస్తీ పడతానంటే..." నవ్వుతూ అన్నాను..

"నేను చెప్పవలసింది చెప్పాను. తరువాత నీయిష్టం" బాధపడుతూ అన్నాడు విశ్వం.

"అయితే ఒక షరతు. నేను ఒక గంట మాత్రమే అరుస్తాను."

విశ్వం సరే నన్నట్లుగా తల తిప్పాడు. మూలను ముడుచుకుని పడుకున్న భైరవిని చెవి పట్టుకుని లాక్కొచ్చి గది మధ్యగా నిలబెట్టాడు. నన్ను ప్రక్కగా వెళ్ళి కుక్కలా నుంచోమన్నాడు. అలాగే చేశాను.

"ఊఁ, ఇప్పుడు చెప్పు, నీ ముందు ఎన్ని కోవా ముక్క లున్నాయో..."

"ఉఫ్, ఉఫ్" నేను బిగ్గరగా కుక్కలా అరిచాను.

"ఓ భేష్‌గా ఉంది. చాలా మంచి కుక్కవి." అంటూ విశ్వం నా తలమీద మెల్లగా నిమిరి ఓ పాలకోవాముక్క నానోట్లో తురిమాడు నేను పాలకోవాను చాలసేపుతిన్నాను. కుక్క నావంక ఆశగా చూడసాగింది

'ఇలా చూడు భైరవీ, ఉఫ్, ఉఫ్ అను నీకూ పాల కోవా ముక్క ఇస్తాను"అన్న విశ్వంవైపుచూసి అది ఓసారి చూసి ఇక పడుకోనివ్వడనుకుంది కాబోలు లేచి పోబోయింది.

"హుఁ ఒట్టి నాటుకుక్క. తెలివీలేదు పాడూలేదు. దాని బదులు నువ్వే అరవరా వేణూ, సరిపోతుంది." అన్నాడు విశ్వం నావైపు చూస్తూ.

"ఉఫ్, ఉఫ్" బిగ్గరగానే అన్నాను. ఓ పాలకోవా ముక్క నోట్లోకి వచ్చింది.

"మళ్ళీ ఓ సారి; యెవరు ముందుగ అరుస్తారో వాళ్ళ కో పాలకోవాముక్క యిస్తాను" అన్నాడు. నేనే ముందుగా అరిచాను. విశ్వంపాలకోవాముక్కను భైరవినోటికి అందించినట్లే అందించి చటుక్కున నాకు అందించాడు. అది హఠాత్తుగా లేచి నిలబడింది. నా వంక క్రోధంగా చూస్తూ నోరు తెరచి యిల్లు దద్దరిల్లేట్లుగా ఉఫ్, ఉఫ్ అని అరిచింది.

"శభాష్, భైరవీ!"అంటూ విశ్వం ఓపాలకోవాముక్క దానిముందు పడేశాడు. అది దాన్ని అమాంతం మింగేసి పూర్వస్థాయిలోనే ఉఫ్, ఉఫ్ అని పెంకు లెగిరేట్లుగా అరిచింది.

విశ్వం నావైపు సగర్వంగా చూస్తూ అన్నాడు- "భైరవి చాల తెలివిగలది. ఇక యెలాంటి లెక్కనైనా గుట్టే చేయు గలదు."

విశ్వం మాట పూర్తిచేశాడో లేదో వాళ్ళమ్మ వచ్చి మా యెదురుగా నిలబడి తీవ్రస్థాయిలో అంది "ఏమిటి యీ సంత? కుక్కలకికూడ పాలకోవా అలవాటు చేస్తున్నావన్న మాట?"

"కాదమ్మా, భైరవి చక్కగా లెక్కలు చేస్తుంది. అందు కిచ్చాను. మరి నువ్వు బాగా చదువుకుంటే పాలకోవా యిస్తానన్నావుగా......"

"ముందు చదివి అఘోరించు. తర్వాత తీరిగ్గా కుక్కకు చెప్పొచ్చు"

విశ్వం కుక్కనుతీసుకెళ్ళి కట్టేసివచ్చాడు. మే మిద్దరం హోంవర్కు చేయసాగాం. విశ్వానికి హోంవర్కు యేమిటో తెలియదు. బడికంటూ వస్తేనా తెలియడానికి. మొదట లెక్కలు పూర్తిచేశాం. ఇంగ్లీషుపద్యం సగం వల్లెవేసేసరికి విసుగెత్తింది. అంతటితో చదువు చాలించి భైరవికి మళ్ళీ పాఠాలు ప్రారంభించాం. దానివల్ల ముందు ముందు అనేక చిక్కులు వస్తాయని విశ్వం అన్నాడు. ఏదైనా బోర్డుమీద అంకెవేసి దాని చేత గుర్తుపట్టించాలని నిశ్చయించుకున్నాం.

విశ్వం ఓ జాజిచెక్కల బోర్డు సంపాయించాడు. బొగ్గుతో దానిమీద '1' అంకె పెద్దదిగా వేసి అన్నాడు. "భైరవీ! ఈ బోర్డుమీద '1' అనే అంకె వున్నది. కొయ్య

ముక్కలాగానే యిదికూడా ఒకటి ఏదీ ఆ అంకె ఎంతో చెప్పు చూద్దాం?"

"ఉఫ్" భైరవి బోర్డువంక పరిశీలనగా చూస్తూ అంది.

"భలే! భలే! చాల మంచిదానివి. ఈ సారి '2' అంకె వేస్తాను. చెప్పాలి. ఏం?" విశ్వం బోర్డుమీద యిందాకటి మాదిరిగానే పెద్దదిగా '2' అంకెను వేసి అన్నాడు. "ఊఁ, లెక్కించు"

"ఉఫ్ ' అని భైరవి అరిచింది.

"కాదు భైరవీ, ఇది యిందాకటి అంకెకాదు. మళ్ళీ ఓ సారి ఆలోచించి చెప్పు"

"ఉఫ్" భైరవి పాత పాటే పాడింది.

"ఛస్, మట్టిబుర్ర. ఎప్పుడూ ఒకటే పాట. ఉఫ్, ఉఫ్, అనాలి, తెలిసిందా?"

భైరవి మామూలుగానే అరచింది. విశ్వం కోపం పట్ట లేకపోయాడు.

"నోర్ముయ్, కుక్కబుద్ధి పోనిచ్చావు కాదు. 2 అంకె ఉంటే ఉఫ్ అని అఘోరిస్తావేమిటి? ఉఫ్ ఉఫ్ అనాలి. తెలిసిందా ?"

విశ్వం భైరవికి చాలసేపు '1 కి' 2' కి గల తారతమ్యాన్ని వివరించాడు. '1' కంటె '2' పెద్దదని, ఈ రెంటికీ సంబంధంలేదని చెప్పాడు. కాని భైరవికి ఇవేమీ తెలియదు లేదు. యథాప్రకారం ఒక్కసారిమాత్రం అరిచింది.

"కాదు భైరవీ, ఉఫ్, ఉఫ్ అని రెండుసార్లు అనాలి." ఊరుకోలేక అందించాను. భైరవి నావంక తీ క్ష ణ ం గా

చూసింది పట్టరాని కోపంతో ఉఫ్, ఉఫ్ అని బిగ్గరగా అరిచింది. విశ్వం మళ్లీ ఓసారి అలాగే రెండుసార్లు అరవమని అన్నాడు. కాని భైరవికి ఏం బుద్ధి పుట్టిందో ఒకసారిమా తమే అని ఊరుకుంది. విశ్వం కోపంతో భైరవి మూతిమీద ఒక్కటిచ్చాడు. భైరవి రాగాలాపన లంకించుకుంది. ఇక లాభం లేదనుకుని ఆ రోజుకి భైరవికి లెక్కలు చెప్పడం విరమించాం.

మరుసటిరోజు మళ్ళీ భైరవికి చదువు మొదలెట్టాం. కాని అది ఒక్కసారికూడ సరైన సమాధానం చెప్పలేక పోయింది. అన్నీ తప్పుడు జవాబులు చెప్పడం సాగించింది. '1' అంకె వేస్తే '3' సార్లు అరిచేది, '4' అంకె వేస్తే '5' సార్లు అరిచేది. ఈ తప్పుల తమాషా చూసి విశ్వం మంకాస్త దిగాలు పడిపోయాడు.

"ఇది నిజంగా తెలియక చెబుతోందా లేక తప్పులు చెప్పాలని చెబుతోందా ? ఏరా వేణూ ?"

"ఏం చచ్చిందో, పోనిద్దూ వెధవ గొడవ. రేపు చూసుకోవచ్చు"

విశ్వం మాట్లాడకుండా భైరవిని లోపలకట్టేసివచ్చాడు క్లాసు కబుర్లు చెప్పుకోసాగాం. విశ్వాన్ని తిరిగి బడికి రావలసిందని ఎన్నో విధాలుగా చెప్పాను. తను సర్కసులో చేర నిశ్చయించుకున్నానని, అందుకోసమని అధిక శ్రమలకోర్చి మొగ్గలువేయడం, పగ్గాలు తెంపడం, తలక్రిందులుగా చేతుల మీద నడవటం వగైరా తమాషాలు సాధనచేస్తున్నానని చెప్పాడు. నిజమో అబద్ధమోనని తేల్చుకునేందుకు ఒకసారి తలక్రిందులుగా నడిచి చూపమన్నాను.

విశ్వం చేతులమీద నడవటానికి విశ్వప్రయత్నం చేశాడు కాని లాభం లేకపోయింది. నేను కాళ్లుపట్టుకుంటే నడవగలనని అన్నాడు. ఏమాత్రం చేస్తాడో చూద్దామని ఒప్పుకున్నాను.

విశ్వం మొదట నేలమీద కాళ్లు చేతులు ఆనించాడు. నేను నెమ్మదిగా వాడి కాళ్లను పైకెత్తి పట్టుకున్నాను. కాసేపు యిలా గడిచేసరికి దభీమని చప్పుడైంది. ఏమిటో అని చూస్తే యేముంది? విశ్వం తలవెళ్ళి తిన్నగా నేలమీద ఆని వుంది. నేను భయంతో కాళ్లను వదిలేశాను. పదినిముషాలకు గాని విశ్వం కళ్లు తెరవలేకపోయాడు. తల యింకా దిమ్ముగా వుందని చెప్పాడు.

"అందుకే ఇలాంటి ప్రాణాంతకపు పనులు వద్దన్నాను. వింటేనా ? అనుభవిస్తున్నావు" అన్నాను.

"నువ్వు చెప్పింది నిజమే. ఎలాగూ హాఫ్ ఇయర్లీ సెలవులువస్తున్నాయి. అపుడు హాయిగా ఇలాంటివి సాధనచేస్తాను"

"అప్పటికి కుదురుతుందని నమ్మకమేమిటి ?"

"పోనీ, ఎండాకాలం సెలవులు వస్తాయిగా. అప్పుడు చేస్తాను."

"అప్పుడు నీ ఇష్టం వచ్చినట్లు గంతులు వేయి. ఒకవేళ తల పగిలినా కట్టు కట్టించుకుని ఇంట్లో పడుకోవచ్చు."

"వేళాకోళ మనుకున్నావా? నువేచూస్తావ్ గావిశ్వంతడాఖా"

విశ్వం నిజంగా విచిత్రమైన మనిషి. ఎప్పుడూ ఊహా ప్రపంచంలో విహారిస్తూ ఉంటాడు. అది కల మాత్రమేననీ యథార్థంకాదనీ తెలుసుకునేసరికి మళ్ళీ కొత్త కలలోకి పయనించడం. ఇదీ తంతు.

# 14

విశ్వం బడికివెళుతున్నదిలేనిదీ వాళ్ళమ్మకు తెలియదు. ఏదో జీతం కట్టడం, పుస్తకాలు కొనిపెట్టడం, బడికి వెళ్ళమని చెప్పడం, ఆలస్యంగా ఇంటికివస్తే నాలుగు చీవాట్లువేయడం-వీటితో తన బాధ్యత తీరిపోయినట్టుగా భావించుకునేది. నన్ను మాత్రం రెండురోజుల కొకసారైనా "ఏం నాయనా, మా విశ్వం బాగాచదువుతున్నాడా?" అనిఅడిగేది. బాగానే చదువు తున్నాడండీ" అని చెప్పి ఆ ప్రమాదంనుంచి బయటపడే వాణ్ణి. బడి కొస్తున్నాడా రావడంలేదా అని ఆమె నన్ను అడిగినపాపానపోలేదు. నేను పనిగట్టుకుని చెప్పేందుకు సిద్ధ పడనూలేదు. విశ్వంబలవంతంమీద రోజూసాయంత్రం పూట వెళ్ళి వాడికి ఫలానా హోం వర్కు ఇచ్చారని చెప్పడం, ఆ తతంగమంతా పూర్తయేదాకా ఉండటం కాసేపు ఆటలాడు కోవడం జరిగేది.

విశ్వం బడికి వెళ్ళకపోవడంలో ఎన్ని యిబ్బందు లున్నాయో చాలాసేపు చెప్పేవాడు. ఇంటా బయటా రోజంతా బిక్కు బిక్కు మంటూ గడపాలసి, అడ్డమైన ప్రతి వెధవాయికి జడవాల్సివస్తుందని నసిగేవాడు. ఇక బజారుకు వెళ్ళడం ఓ పద్మవ్యూహంలోకి వెళ్ళి రానడ మన్నట్లు ఉండే దిట. ఓరోజున వాడు ఏదో యాదాలాపంగా వెళ్తూంటే మా జాగ్రఫీ మాస్టారు ఎదురయ్యారు. అదీ అనుకోకుండా హఠాత్తుగా జరిగింది. వీడు ఇంటినుంచి బయల్దేరి, వీధి మలుపు తిరగడమేమిటి, మాస్టారు సరిగా అదే సమయానికి అక్కడ

ప్రత్యక్ష్యం కావడమేమిటి — అంతా యిట్టే జరిగి పోయింది. ఇంకేముంది? వీడికి అడుగు ముందుకు పడలేదు. అదృష్టవశాత్తూ ఆయనకు అమిత చత్వారం ఉంది గనుక సరిపోయింది గాని లేకపోతే వీడి అంతు కనుక్కునేవాడే. మరోరోజున పెద్ద బజారులో వీళ్ళింటి యజమానికనిపించాట్ట. ఆయన "విశ్వం" అంటూ కేక వేసే లోపలనే వీడు ఏ మూలకో సర్దుకున్నాడు. ఆయన ఓ పావుగంటసేపు వీడికోసం నల్దిక్కులా చూసి విసుగొచ్చి చక్కాపోయాడు. ఇలాగే రోజూ ఏదో ఒక అవాంతరం వచ్చిపడేది.

నాకు విశ్వం ఓ సమస్యగా తయారయ్యాడు. ఎప్పుడూ వీణ్ణి గురించిన ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయేది. ఎందు చేతనో వాడు బడికి రాకపోతే నాకూ వెళ్ళినట్టుఉండేదికాదు. క్లాసులో ఉన్నంతసేపు ఖాళీసీటువంక చూసేసరికి చెప్పరాని దిగులు పుట్టుకొచ్చేది.

ఆరోజు శనివారం. రేపు సెలవే కదా అనే దిలాసాతో పెందలాడే పడుకున్నాను. ఇంతలోకి సుగుణ వచ్చింది.

"వేణూ, వేణూ! నాకో కథ చెప్పవూ? నిద్ర రావట్లేదు." అంది.

"నిద్ర రాకపోతే అమ్మను జోకొట్టమను, నేనేం చేయను"

"అన్నాయ్, అన్నాయ్, చిన్న కథయినా చాలురా. చెప్పవూ?"

"నే నడిగినవాటికి ముందు జవాబు చెబితే తరువాత కథ చెబుతాను."

"సరే, పాఠాలు ఎలా చదువుతున్నావనేగా..."

"ఊఁ హుఁ, కనుక్కో మరి"

"త్వరగా అడగరా, తరువాత హాయిగా కథ చెప్పుకోవచ్చు"

"మీ క్లాసులో ఒకరిమీద మరొకరు చాడీలు చెప్పుకుంటారా ?"

"అంటే?"

"అయితే విను. ఒక అమ్మాయి నిజంగా ఏమీ తప్పు చేయలేదు. కాని ఆ అమ్మాయి తప్పు చేసినట్లు అందరూ అనుకుంటున్నారనుకో. అప్పుడు ఎవరైనా లేచి ఆ అమ్మాయి తప్పు చేయలేదని మాస్టారితో ధైర్యంగా చెప్పగలరా ?"

"ఇవి చాడీ లేమిటి ?"

"కాదులే, చాడీ ల్లాంటివి."

"ఆఁ ! తప్పకుండా చెబుతాం. నిన్న నేను అలాగే చెప్పాను."

"నీవా, ఎవరిమీద?"

"పూర్తిగా విను మరి. నిన్న పార్వతి కిటకీగ్లాసు పగులకొట్టింది. మాస్టారు అందరినీ ఎవరు పగులకొట్టారో చెప్పమన్నారు. అందరూ మాకు తెలియదంటే మాకు తెలియదని తప్పించుకున్నారు. పాపం అనసూయ త్వరగా జవాబు చెప్పలేదు. ఇంకేముంది, మాస్టారు అనసూయే తప్పు చేసినట్లుగా నిర్ణయించారు..."

"ఎందుకని..."

"అనసూయకు తగని సిగ్గు. ఇంట్లోనే పెద్దగా మాట్లాడదు. అలాంటిది క్లాసులో అంతమంది ముందు హఠాత్తుగా ఇలాంటి ప్రశ్న వేసేసరికి జవాబు చెప్పలేకపోయింది. మాస్టారు అనసూయ తప్పుచేయకపోతే ఎందుకు వెంటనేజవాబివ్వలేదని అంటూ అనసూయే కిటికీ గ్లాసు పగులకొట్టినట్లుగా నిర్ణయించారు."

"ఎవరూ కాదని చెప్పలేదా?"

"అడ్డుప్రశ్నలు వేయకు మరి. నేను వెంటనే లేచి మాస్టారితో నిజం చెప్పేశాను. పార్వతి పగులగొట్టినప్పుడు స్వయంగా చూసినట్లు చెప్పాను అనసూయకు యేమీ తెలియదనికూడ అన్నాను."

"సాక్ష్యం యేమీ అడగ లేదా?"

"ఇదేమన్నా న్యాయస్థానమా? సాక్ష్యానికి. ప్రత్యక్షంగా రెండు కళ్ళతో చూసినట్లుగా చెబితిని. పార్వతి తెల్లముఖంవేసుకుని తలవంచుకు నిలబడింది. ఇంకా వేరే సాక్ష్యమెందుకూ?"

"పెద్ద ఘనకార్యం అనుకున్నావ్. అవునా? ఉత్త వెధవపని చేశావు."

"ఎందుకని?"

"ఎందుకనా? నువ్వు మధ్యలో పిలవని పేరంటానికి వెళ్ళి పాపం పార్వతిమీద చాడీలు చెప్పావు......"

"ఆమాటే అనవద్దన్నాను. నిజంచెప్పటం తప్పా?"

మా క్లాసులో చచ్చినా యిలా ఒకరిమీద మరొకరం చెప్పుకోము"

"ఓహో! తెలిసిందిలే. శుద్ధ పిరికిఅబ్బాయి లన్నమాట. నిజం చెప్పలేసి ఘనులు. ఒకరి తప్పుకు ఒకరిని శిక్షిస్తుంటే చూస్తూ కూచుంటారన్నమాట!"

"తప్పేమిటో చెప్పు చూద్దాం"

"కిటికీ గ్లాసు పగులగొట్టడం తప్పుకాదూ?"

"మా గది కసలు కిటికీగ్లాసు లుంటేగా!"

"పోనీ కుర్చీ అనుకుందాం. కుర్చీ నీవు విరగగొట్టావనుకో. మాష్టారువచ్చి అందర్నీ అడుగుతారు. ఎవరూ చెప్పక పోయేసరికి యీది తప్పక విశ్వంపనే అయివుంటుందని అంటే యెలావుంటుంది?"

"బాగానే వుంటుంది. విశ్వానికి మాటలు వచ్చుగా! తన కేమీ తెలియదని చెబుతాడు. మధ్యలో మన కెందుకు బాధ......"

"మాష్టారు విశ్వం తప్పుచేసినట్టు గట్టిగా నమ్మారు గనుక."

"ఓహో! అంతటితో ఐపోతుం దేమిటి! ఎవరు చూశారో తెమ్మంటే యేమాతుంది?"

"ఏమో బాబూ, మా క్లాసులోమాత్రం అలాంటివి జరగనే జరగవు. ఎవరన్నా తప్పుచేస్తే వెంటనే వాళ్లు స్వయంగా తమ తప్పు ఒప్పుకుంటారు. లేదా, చూసినవా ళ్లెవ్వరైనా లేచి చెబుతారు."

"హు, క్లాసంతా చాడికోర్లన్నమాట. పనీ పాటూ లేకపోతే సరి"

"నిజంచెప్పడం చాడీకోరుతనమేమిటి ?"

"ఆ సంగతి సరేగాని, ఇంకో సంగతి చెబుతా విను. మీ క్లాసులో ఓ అమ్మాయి ఇంట్లోవాళ్ళకి తెలియకుండా క్లాసులు ఎగగొడుతుందనుకో..."

"అలాంటివాళ్ళెవరూ ఇంకా బయల్దేరలేదు."

"ఒకవేళ ఉన్నారనుకుందాం. అయినా మీ ఆడపిల్లలు అలాంటి చెడ్డపనులు చేస్తారా? అబద్ధాలాడతారా? మీ రంతా బుద్ధికి బృహస్పతులాయె."

"అబ్బో, వెక్కిరింపులు ఎవరికి తెలియవేమిటి? నిజానికి మా క్లాసులో ఇంతవరకు అలాంటివాళ్లు లేరు. ఇంతకీ మీ క్లాసులో ఉన్నారు కామోసు, అందుకే అడుగుతున్నావు; ఏరా అన్నాయ్?"

"ఛ ఛ, మా క్లాసులో అలాంటి వెప్పుడూ జరగవు. తెలిసిందా? ప్రతివాడు సత్య హరిశ్చంద్రుడని చెప్పాలి"

"నీవు కూడానా?"

"మరి నేను, విశ్వం, రాధాయి...అందరం"

"అయితే ఈ విషయం ఎందుకు తెచ్చావ్?"

"ఆఁ, ఉబుసుపోకకు. మరి నాకు నిద్రొస్తోంది. పోయి పడుకో."

"అయితే కథ చెప్పవా?"

సుగుణకు నేను ఓ చిన్న కథ చెప్పాను. నిద్ర ముంచుకొచ్చింది. కాని విశ్వాన్ని గూర్చిన ఆలోచనమాత్రం బుర్రలోంచి పోలేదు. ఏమీ తోచక అటు ఇటు దొర్లుతున్నాను. అమ్మ వంటింటిపని ముగించుకుని వచ్చి అంది—

"అప్పుడే పడుకున్నావేరా, చదువు లేదేమిటి?"

నేనేమీ జవా బివ్వలేదు.

"వెధవ ఆలోచనతో బుర్ర చెడగొట్టుకోకుండా హాయిగా పడుకో. తెల్లవారుఝామున లేద్దువుగాని..."

"నేనేమీ ఆలోచించడంలేదు" క్లుప్తంగా జవాబిచ్చాను.

"నాకు తెలుసులే. అదేమిటో చెప్పు నాయనా." అమ్మ ప్రేమగా అంది.

"విశ్వం సరిగా చదవడంలేదు. బడికికూడ సక్రమంగా రావటల్లేదు. సర్కసులో చేరతాట్ట"

"సర్కసులోనా, బావుంది! నీవు చెప్పి చూడక పోయావా? వినేవాడేమో......"

"ఊఁహుఁ, లాభంలేదు. చెప్పి చెప్పి ప్రాణం విసిగి పోయింది. ఇంకేం చేయను"

మా అమ్మ నన్ను దగ్గరకు పిలిచింది. వెళ్ళాను. ప్రేమతో నా తల నిమురుతూ అన్నది. "విశ్వాన్ని అలావిడిచి పెట్టకూడదు నాయనా. ఎవరైనా స్నేహితుడు చెడిపోతూంటే చూస్తూ వూరుకోవచ్చా? మంచి మార్గంలోకి తీసుకురావ డానికి ప్రయత్నించాలిగాని........."

మా అమ్మ చెప్పిన దంతా నిజమనిపించింది. ఎలా గైనా విశ్వాన్ని తిరిగి బడికి వచ్చేట్లుగా చేయాలని నిశ్చ యించుకున్నాను. విశ్వానికి నిజమైన స్నేహితునిగా నిరూ పించుకోవా లనుకున్నాను.

మరునాడు ప్రొద్దుటే విశ్వం యింటికి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి అందరూ కాఫీలు త్రాగుతున్నారు. విశ్వం నన్ను యెంతో సాదరంగా పిలిచాడు. వాళ్ళమ్మ నాకుకూడ కాఫీ

తెచ్చింది. తల వంచుకుని అన్నాను. "ఇప్పుడే తాగివచ్చా నండీ."

"ఫర్వాలేదులే నాయనా. చిన్నవాళ్లు తాగకపోతే మేం తాగుతామటోయ్. తీసుకో బాబూ"

నేను మారుమాట లేకుండా కాఫీగ్లాసుతీసుకుని పూర్తి జేసే ప్రియత్నంలో వున్నాను. విశ్వంఅమ్మ మా నాన్నగారు యెక్కడ పనిజేస్తున్నది, మా సుగుణ యేం చదువుతున్నది వగైరావివరాలన్నీ అడిగి తెలుసుకుంది. ఇంతకు ముందెన్నడూ ఆమె యిలాంటి ప్రశ్నలు వేయలేదు. విశ్వంపిన్ని తను చదువుతూన్న కాలేజిలోని విశేషాలను చాలసేపు చెప్పింది. విశ్వంమాత్రం యివేమీ పట్టించుకోనట్లు మూలగా బయటకు చూస్తూ కూచున్నాడు.

"కాఫీ చల్లారిపోతోంది, తాగునాయనా. ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?" అన్నది వాళ్ళమ్మ.

"మా నాన్నగారినిగురించి. అమ్మా! అమ్మా! నాన్నను గురించి యేమైనా చెప్పవూ?"

"ఏ మున్నయిరా చెప్పడానికి. ఐనా నీకేం తెలుసు? మీ నాన్నగారు చనిపోయేసరికి నువు యేణ్ణర్థంవాడివి" ఈ మాటలు చెబుతూంటే ఆమె కంఠం రుద్ధమైంది, కళ్ళవెంట దుఃఖాశ్రుపులు అప్రియత్నంగా రాలాయి. విశ్వం పిన్నికూడ కులాసాకబుర్లు మానేసి విచారంగా చూస్తూ కూచుంది.

"నాన్నగారు నాకు తెలుసులే అమ్మా. నేను చిన్నప్పుడు ఉయ్యాల్లో పడుకున్నాను. నాన్నగారొచ్చారు. నాకు కావలసినన్ని బొమ్మలు తెచ్చారు. నన్ను ఎత్తుకుని ముద్దు

పెట్టుకున్నారు. అప్పుడు నువుకూడ అక్కడికి వచ్చావు. ఆ దృశ్యాన్ని చూసి, నాన్నవైపు చూస్తూ చిన్న మందహాసం చేశావు. అవునా ?" అన్నాడు విశ్వం.

"వైధవకవిత్వం. ఈ తెలివి చదువులో లేదు, ఎంత సేపూ కబుర్లుచెప్పమంటే..." అన్న విశ్వంపిన్ని మాటలకు అడ్డొస్తూ వాళ్ళమ్మ యిలా చెప్పింది:

"మీ నాన్నగారిని గురించి నీకు తెలియదునాయనా. నీవుపుట్టిన ఏణ్ణర్థానికే వారిని జైల్లో వేశారు. మీ నాన్నగారు మనఊళ్ళో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీశారట. ఆ రోజుల్లో త్రివర్ణపతాకం పట్టుకోవడమే నేరం. జాతీయాభిమానం కలిగిఉండటమే పెద్దఅపరాధం. ఆసమయంలో మీనాన్నగారు నిర్భయంగా ముందునిలిచారు. మనఊళ్లో వాళ్ళందరికీ స్వాతంత్ర్యాన్నిగూర్చి, మనదేశ దౌర్భాగ్యాన్ని గూర్చి గంటలకొలది చెప్పేవారు. గాంధీమహాత్ముని నాయకత్వానజరిగే సత్యాగ్రహంలో, ధర్మయుద్ధంలో పాల్గొనమని ప్రబోధించేవారు. అందరినీ ఖద్దరుకట్టమని, దేశీయవస్తువులనే కొనమని, దేశ పునర్నిర్మాణంలో కష్టించిపనిచేయమని ప్రబోధించేవారు. ఇదీ వారుచేసిన ఘోరమైననేరం; అధికారులకు వీరంటే గిట్టేదికాదు. సమయంకోసం నిరీక్షిస్తూ ఉన్నారు. ఆరోజు నాకు బాగాజ్ఞాపకం. జనవరి ముప్ఫయ్యోతారీఖు. మీ నాన్నగారిని మననుండి వేరుచేసిన దుర్దినం. ఆనాడు ఊళ్ళో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. దానికి మీనాన్నగారు నాయకత్వం వహించారు. ఊరేగింపు పెద్దబజారులోకి రాగానే వేట కుక్కల్లాంటి పోలీసులు ఎదురయ్యారు. అంత

రినీ చెదిరిపొమ్మని హెచ్చరించారు. ఎవరూకదల్లేదు. అలాగే నిశ్చలంగా, నిర్భయంగా నిలబడ్డారు. మీ నాన్నగారు ప్రజలను భయపడవద్దని విజ్ఞప్తిచేశారు. పోలీసు అధికారి లాఠీ చార్జికి అనుమతియిచ్చారు. అబ్బ, కొద్దినిముషాల్లోనే ప్రతిసత్యాగ్రహివంటిమీద లాఠీ నాట్యంచేసింది. మీ నాన్నగారిని స్పృహతప్పేట్లుగా కొట్టారు. అంతే, తరువాత జైల్లోపడేశారు. న్యాయస్థానంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఊరేగింపు లేవదీసినందుకుగాను రెండేళ్ళ కఠినశిక్ష విధించారు. మీ నాన్నగారిని, మరికొందరు సత్యాగ్రహులను బళ్ళారిజైలుకు పంపించారు. సంవత్సరం తిరగకముందే మీనాన్నగారు అనారోగ్యంతో బాధపడి మరణించారు. ప్చ్, ఎందుకు నాయనా, పాతగాథలు త్రవ్వుకోవడం. ఇన్నాళ్ళనుంచీ చెబుదామనుకున్నాను. కాని చెప్పలేక పోయాను. ఇవాళ ఏదో ఆవేశంలో చెప్పాను. నాకు పనుంది, వెళ్ళాలి. నువ్వు, వేణు చక్కగా చదువుకుంటూ కూచోండి. ఏం!"

విశ్వంఅమ్మ లోనికి వెళ్ళింది. నాకు మాటిమాటికి విశ్వం నాన్నను గురించిన ఆలోచనలు రాసాగాయి. ఆయనంటే ఏదో చెప్పరాని భక్తిభావం పుట్టుకొచ్చింది. నిజానికి అంతేకదా! తన దేశ ప్రజల స్వేచ్ఛా సౌఖ్యాలకోసం ప్రాణ మర్పించిన వ్యక్తి జీవితం ఎంత ధన్యమైనది! నా కళ్ళలోనీళ్లు నిలిచాయి. విశ్వానికి బడిసంగతి చెప్పబుద్ధివేయు లేదు: పైగా సుభద్రపిన్ని పక్కనే కూచునిఉంది. విశ్వంవద్ద సెలవు తీసుకుని ఇంటికి బయల్దేరాను.

# 15

నేను వేసుకున్న కార్యక్రమం పూర్తిగా తల్లక్రిందు లైంది. బడి వదలగానే విశ్వం ఇంటికి వెళ్ళి, వాళ్ళమ్మతో విషయమంతా సవిస్తరంగా చెప్పి, ఆమెచేత సెలవు చీటి వ్రాయించి విశ్వాన్ని మళ్ళీ బడికి వచ్చేటట్లుగా చేద్దా మను కున్నాను. నేను తలచినదానికి సరిగా వ్యతిరేకం జరిగింది. ఏం చేయడానికీ తోచిందికాదు. విశ్వాన్ని చేతులారా ఆపదలో పెట్టినవాణ్ణయ్యాను. ఇలా జరుగుతుందని తెలిస్తే విశ్వానికి మలేరియా జ్వరం వస్తున్నట్లు చెప్పేవాణ్ణికాదు. ఒకడితో చెబితే ఎలాగో దబాయించి సరిపెట్టవచ్చుగాని, క్లాసందరితోటీ చెప్పాను. విశాలరావు మాస్టారివద్ద కూడ అదే పాటపాడాను. దాని పర్యవసానం ఇప్పుడు తెలిసింది. సమయమూ మించి పోయింది.

జరిగిన విషయమేమంటే, విశాలరావు మాస్టారు లెక్కల పీరియడు ఆఖరున ఓ పిడుగులాంటి మాటఅన్నారు. 'విశ్వానికి మలేరియా జ్వరం వస్తున్నట్లు మీకందరికీ తెలుసు. నాతో వేణు చెప్పాడు. కనుక మీరందరు సాయంత్రం వెళ్ళి విశ్వాన్ని చూసిరండి, ఏమంటారు ?''

ప్రతివాడు అంగీకార సూచకంగా తల త్రిప్పాడు.

ఈ మాట వినగానే నాకు వణకు పట్టుకుంది. విశ్వం, నేను ఘోరప్రమాదంలోపడ్డామనడంలో సందేహం లేదు. మాస్టారితో సహా సాయంత్రం మా క్లాసువా ళ్ళందరు

విశ్వాన్ని చూడటానికి రావడం ఖాయం. ఇంతా జేస్తే వాడు సమయానికి యింటిదగ్గర వుండకపోయినా లేక యే ఆటలాడు తున్నా......అమ్మో! ఇంకేమన్నా వుందా? ఊహించలేక పోయాను. క్లాసు వదలడంతోటే పరుగెత్తుకుంటూ వెళ్ళి విశ్వం యింటిదగ్గర వాలాను. నా కంగారునుచూచి వాడు మరికా స్త గాభరాపడ్డాడు.

"ఏం జరిగిందిరా వేఙా, ఎవడన్నా కొట్టాడా? ఇప్పుడే వెళ్ళి వాడిపనిపడతాను" అన్నాడు విశ్వం ఆత్రంగా.

"అదేం కాదురా. అంతకంటె ఘోరప్రమాదం వచ్చి పడింది. ముందు నీ పడకగదిలోకి నడు. తర్వాత చెబుతాను"

"ఎందుకురా?"

"లోపలికి పద, మాట్లాడుకుందాం."

మేమిద్దరం గదిలోకి వెళ్లాం

"ఇప్పుడు నీకు జబ్బుగా ఉంది. తెలుసా?"

"నాకా......జబ్బా......నీ బుర్ర చెడిందా యేం?"

"వేళాకోళంకాదోయ్ మహానుభావా! నీకు జబ్బుగా వున్నట్లు నటించాలి! క్లాసులో అందరికీ చెప్పేనుగా"

"చంపేశావ్. విశాలరావుమాష్టారితో కూడానా?"

"ఆహా.........అందరితోను చెప్పాను. వాళ్ళందరు కట్టగట్టుకుని నిన్ను చూడ్డానికి వస్తున్నారు. ఏం చేద్దా మంటావ్?"

"ఎప్పుడూ రావటం?"

"ఇప్పుడే, దారిలో వుంటారు. నే నీ వార్త చెప్ప డానికే గుండెలు పగిలేట్లుగా పరుగెత్తుకొచ్చాను."

"మరి, వాళ్ళతో యేం చెప్పమంటావ్? నా కేం రోగంవచ్చిందని చెప్పావ్?''

"మరేరియా. నీ యిష్టం యేం చెబుతావో! నా కేమీ తోచడంలేదు."

విశ్వం మెదలకుండా వెళ్ళి మంచంమీద కాళ్ళు చాపి పడుకున్నాడు. జల్లు కాస్త రేపుకుని ముఖంమీద వేసుకున్నాడు. శాలువా బరువాలో వుందంటు తెచ్చాను. కంఠం దాకా కప్పుకుని పైకి చూస్తూ పడుకున్నాడు. నేను మంచం ప్రక్కనే ఒక స్టూలు వేశాను. దానిమీద పంపరాని నీళ్ళ సీసా, ఓ గాజుగ్లాసు, ఖాళీ గ్లాక్సోడబ్బా, చంచా వగైరా ఆస్పత్రిసామగ్రి అమర్చాను

ఇంతలోకి మిత్రబృందం గానే వచ్చింది. వస్తూనే విశ్వంమీద ప్రశ్నలవర్షం కురిపించారు.

"ఒహో, విశ్వం! ఎలావుంది'' చక్రపాణిప్రశ్న.

"ఆఁ, ఎవరు. చక్రపాణా, ఇది అలాగేవుంది."

విశ్వం చెప్పిన జవాబు యెవరికీ సరిగా వినిపించలేదు. వాడి నటన చూసి నాకు ఆశ్చర్యంవేసింది. కనురెప్పలు బరువుగా యెత్తి ఓ క్షణం అందరివైపు చూసి తక్షణమే కళ్ళుమూసుకోవడం, తపనపడుతూన్నట్లు 'ఉస్స్', 'అబ్బా', 'అమ్మా' అంటూ మెల్లగా ఆపసోపాలుపడటం, మధ్యమధ్య తల పట్టుకోవడం వగైరా రోగలక్షణాలను యెంతో నేర్పుగా ప్రదర్శింపసాగాడు. నిజమైన రోగికూడా యింత 'చక్కగా' బాధపడలేడని అనిపించింది.

"నీ కెట్లావుందో చూసిపోదామని వచ్చాం" చక్రపాణి అన్నాడు

"మంచిది. కుంచుర్నారేం? అలా కూచోండిరా"

"ఖర్మాలేగులే ఇప్పు డేంబాధ ?"

"హుఁ, ఏమని చెప్పను? సర్వాంగాల బాధలు వున్నాయి"

"లేవలేవా?" అంటే విశ్వం జవాబుచెప్పకుండా తల అడ్డంగాత్రిప్పి వూరుకున్నాడు.

"రాత్రింబవళ్లు పడుకోవడం బాధగా లేదురా?"

"బాధఅని నెమ్మదిగా అంటావేమిటి? చచ్చేబాధ"

"మీ అమ్మగారు లేరా? నువ్వొక్కడివే వున్నావ్?"

"మా అమ్మ పనిలోకి వెళ్ళింది. సుభద్రపిన్నీ మో సంగీతం ట్యూషను చెప్పించుకునేందుకు యిప్పుడే వెళ్ళింది."

"సరేగాని డాక్టరు ఏమన్నాడురా?"

"అబ్బాయ్, యీ డాక్టర్ల తంతు నీ కింకా తెలియదు. వీళ్ళకి రెండు విద్యలుమాత్రమే వచ్చు. ఒకటి – నోరు తెరచి 'ఆఁ' అంటూ నాలిక చూపమనడం, రెండు – కాసిని రంగు నీళ్ళుపోసి బిల్లు చేతికివ్వడం. అంతే!"

"ఏం మందిస్తున్నాడు?"

"ఏం మందో వాగులో మందు. దానిపేరు నాకు తెలియదు. ఏదో మిక్చర్"

" తియ్యగా వుంటుందా లేక......"

"తీపిసంగతి మాట్లాడకు. ఇది మహాచేదు. అరగంట దాకా నోరుమొందుకూ పనికిరాకుండా పోతుందనుకో" విశ్వం

ఒక సారి మందుపేరు తల్చుకని వాంతి చేసుకునేట్లుగా నటిం చాడు.

"అబ్బ, అంత చేదన్నమాట. నాకు జ్వరం వచ్చి నప్పుడు......" కిష్టాయి అన్నాడు.

"ఆపరా కిష్టాయ్. నీ జ్వరంవిశేషాలు తర్వాత చెబుదువుగాని"

"చెప్పనీయరా! ఏం పోయింది" విశ్వం ఓసారి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు. కాళ్ళమీద శాలువ తొలిగి బూటు బయటపడింది. నాకు భయంవేసింది. ఎవడన్నా చూశాడేమోనని అందరివంకా చూశాను. అంతా కబుర్లలోపడి కొట్టుకుంటున్నారు. లేకపోతే యింకేమన్నా వుందా? ఇంతవరకు దివ్యంగా పోషించుకుంటూవచ్చిన మా నాటకం కాస్తా గసనత్తరఘట్టంలోకి వచ్చేసరికి రసాభాసై వూరునేది. ఏమంటే విశ్వం బూటుచూస్తే వాడు జబ్బుగావున్నట్లు గుడ్డివాడుకూడా నమ్మడు. ఊళ్ళో దుమ్ము, చెత్త-చెదారం అంతా పాపం అవే మోస్తున్నాయ్. ఐనా రోగిష్టివాడు బూట్లు వేసుకోవడ మేమిటని ఓ పెద్ద చర్చబయల్దేరేది. ఇక జాగుచేయడం మంచిదికాదని గబగబా వెళ్ళి శాలువా సర్ది అందరివైపు చూశాను. గుండెదడ తగ్గింది. ఈ విషయాన్ని యెవరూ గమనించలేదు.

మిత్రబృందంవదిలేట్టు కనపడలేదు. విశ్వంసంగతి విడిచిపుచ్చి లోకాభిరామాయణంలో పడ్డారు. వీళ్ళిలా వుంటే విశ్వంపరిస్థితి మరీ ఘోరంగావుంది. వాడు విసుకొచ్చికామోసు నెమ్మదిగా మూలగడం మానేసి పెద్దగా అరవడం ప్రారం

భించాను. అప్పటికీ వాళ్లు వదల్లేదు. పైగా మలేరియా జ్వర లక్షణాల్లో పెద్దగా అరవడం కూడ ఒకటని సిద్ధాంతీకరించారు. ఇంకాసేపుపోతే కాళ్లు చేతులు తన్నుకోవచ్చని, జుట్టు పీక్కో వచ్చునికూడ ప్రారంభించారు. ఇక యేమాత్రం ఆలస్యం చేసినా వ్యవహారం తారుమారవుతుందని భయపడ్డాను.

"వాడసలే బాధపడుతూంటే మధ్య మీ కబుర్లేమి టోయ్. వాణ్ణి మరికాస్త హైరానుపెట్టడమా. మళ్ళా రేపు వద్దాంలే; ఏమంటారు?" అన్నాను.

మిత్రబృందం సెలవుతీసుకొని బయల్దేరారు. వాళ్ళని గుమ్మందాకా సాగనంపి వచ్చాను. విశ్వం శాలువా తీసి దూరంగా పారేసి మంచంమీదనుంచి క్రిందికి దూకాడు. కాళ్ళూ చేతులు ఝాడించాడు. ముఖం తుడుచుకుంటూ అన్నాడు—

"ఎట్లావుందిరా మన నటన? ఎవడన్నా కనుక్కున్నా డనా?"

"అద్భుతం! అమోఘం! ఆశ్చర్యకరం!" విశ్వం భుజం తడుతూ అన్నాను.

"హుఁ! విశ్వమంటే యేమనుకున్నావ్! యావత్తు ప్రపంచాన్నే మోసంచేయగల సమర్థుడు."

"సంతోషించాంగాని, అలా కూచో. నీతో మాట్లా డాలి"

"మళ్ళీ యేమొచ్చిపడింది ప్రమాదం?"

"వెధవ వ్యాఖ్యానాలు చేయక విను. నువ్వు బడికి వస్తావా? రావా?"

"సర్కసులో చేరనిశ్చయించుకున్నానని లక్షసార్లయినా చెప్పిఉంటాను. ఓ కొత్త తమాషా సాధనచేస్తున్నాను, చూడు......"

విశ్వం గబగబా గోడదగ్గరకు వెళ్ళాడు. దాని ఆధారంతో తలక్రిందులుగా నిలబడ్డాడు. తరువాత మెల్లగా ముందుకు నడవటం ప్రారంభించాడు. నేను సంతోషంతో చప్పట్లు చరుస్తున్నాను.

హఠాత్తుగా గదితలుపు తెరుచుకుంది. కిష్టాయి ఏదో కొంపమునిగినట్లువచ్చి నలుమూలలు వెతకసాగాడు. ఒకనిముషం సేపు అటుఇటు చూసి అన్నాడు :

"నా బూట్లు మరచిపోయానురా. ఇదేమిట్రోయ్ విశ్వం, మొగ్గ లేస్తున్నావ్?"

కిష్టాయిని చూడగానే విశ్వం నిశ్చేష్టుడైపోయాడు. జవాబు చెప్పకుండా తలవంచుకుని నిలబడ్డాడు.

"అయితే మలేరియాజ్వరం రావడం అబద్ధమన్నమాట. బడికిరాకుండా ఉండేందుకుకదూ, ఈ నాటకం"

"నిజంగా జ్వరం వస్తోందిరా. రోజూ డాక్టరుగారు సాయంత్రంపూట కాస్త లేచితిరగమన్నారు అందుక..."

"దబాయించకోయ్, ఇందాక అసలు లేవలేనని, కాళ్లు చేతులు చచ్చేనొప్పులని కూశావు. మరి ఇప్పుడు తలక్రిందులుగా నాట్యంచేస్తుంటివి"

"నామాటమీద నమ్మకం లేదన్నమాట." విశ్వం దీనంగా అన్నాడు.

"నీ నటనచూసి నిజంగానే బాధపడుతున్నా వను కున్నాం అబ్బ! ఎంతచక్కగా చేశావురా ?"

ఇంతలో అడుగులచప్పుడు వినిపించింది. తలుపుతీసుకుని చక్రపాణివచ్చాడు. కిష్టాయివంకచూస్తూ అన్నాడు: నీకోసం బయట కాపలికాయలేక విసుగెత్తి వచ్చాను. ఇక్కడ కబు ర్లేసుకుకూర్చున్నావన్నమాట"

కిష్టాయి నవ్వుతూ అన్నాడు. "అసలుసంగతి వినుమరి! విశ్వానికి జ్వరంలేదు పాడూలేదు! ఒత్తి నటన."

"ఏమిటీ! జ్వరం లేదా? ఇదంతా అర్థంకాకుండావుందే"

"ఎవరికీరా జ్వరంలేనిది? కొంపదీసి విశ్వానికి కాదు గదా ?" రాధాయి గదిలోకి వస్తూ అన్నాడు. వాడి వెంట మిత్రబృందమంతా వచ్చారు.

"విశ్వానికి జ్వరంలేదురా. పిడుగులా వున్నాడు" చక్రపాణి మిత్రబృందంవైపు చూస్తూ అన్నాడు—"కిష్టాయి బూట్లు మరచిపోయాట్ట. అవి తీసుకునేందుకు గదిలోకి వచ్చాడు. తీరా చూస్తే యేముంది? పక్క ఖాళీ! గోడదగ్గర శీర్షాసనంవేస్తూన్న విశ్వం వ్యవహారంచూసి ఆశ్చర్యపోయి నిలబడ్డాడు. ఇంతలోకి నేను వచ్చానుగా......"

"భలే! ఆశ్చర్యంగావుందే !" రాధాయి అన్నాడు.

"ఐతే యీ నాటకం యెందుకోయ్ ? మమ్మల్ని వెధ వల్ని చేసేందుకేగా ?" చక్రపాణి విశ్వంవైపు తీక్షణంగా చూస్తూ తీవ్రస్వరంలో అన్నాడు.

"తమాషాచేశాను ! నిజమనుకున్నారా యేమిటి ?" విశ్వం లేసనవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు.

"సరేగాని నువ్వు బడి కెందుకురావటంలేదో చెప్పు?"

విశ్వం జవాబులేకుండా తలవంచుకుని నిలబడ్డాడు.

"ఇదిగో విశ్వం! రేపు నీవు తప్పక బడికిరావాలి. లేక పోతే విశాలరావుమాస్టారికి నీ విషయమంతా సవిస్తరంగా చెప్పాల్సివస్తుంది."

మళ్ళీ బయట అడుగులసవ్వడి వినిపించింది. విశ్వం గబ గబావెళ్ళి శాలువా కప్పుకొని పడుకున్నాడు. ఇలా చూద్దును గదా! గుండె ఆగినంత పనైంది. హాతోస్మి! పంచప్రాణాలు పోయాయ్. తెల్లవారిలేచి యెవరిముఖం చూశానో జ్ఞాపకం తెచ్చుకుంటున్నాను.

విశాలరావుమాస్టారి మాటలకు యీ లోకంలోకి వచ్చాను.

"ఏమోయ్, విశ్వం! ఎలావుంది జ్వరం! మం దెవ రిస్తున్నారేమిటి?"

"అంతా నాటకం మాస్టారూ! జబ్బాలేదూ, పాడూ లేదు" అని చెప్పాడు చక్రపాణి.

"ఏమిటి, విశ్వానికి జ్వరం రావడంలేదూ?"

"లేదండీ. బాగానే ఉన్నాడు"

విశ్వం వణుకుతూ పక్కమీదనుంచిలేచి, మూలగా వెళ్ళి తలవంచుకుని నిల్చున్నాడు.

విశాలరావు మాస్టారు నావైపుచూస్తూ అన్నారు: "ఏరా వేణూ, నాతో విశ్వానికి మలేరియాజ్వరం వస్తోందని చెప్పావ్? అబద్ధం చెప్పావన్నమాట."

"నాకేం తెలియదండి. వాడు చెప్పమంటేనే చెప్పాను. కావలిస్తే అడగండి"

"ఏరా విశ్వం, బడికి రావటల్లేదేం? చదువెక్కువైందేమిటి? ఇంతవరకు ఒక్క కాంపోజిషన్ క్లాసుకైనా వచ్చావా?"

"విశ్వం సర్కసులో చేరతాట్టండి. ఇందాక నాతో అన్నాడు" రాధాయి అందించాడు.

"ఏరా విశ్వం, నిజమేనా?"

విశ్వం ఒక నిముషంసేపు ఏమీ మాట్లాడలేదు. తరువాత నెమ్మదిగా అన్నాడు: "మళ్ళీ స్కూలుకు వస్తాను మాస్టారూ"

"మంచిది, అయితే ఒక షరతు. కష్టపడి చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలి తెలిసిందా?"

విశ్వం చక్కగా చదువుతానని వాగ్దానం చేశాడు.

"చాలమంచివాడివి" విశ్వం భుజంతడుతూ మాస్టారు అన్నారు. వెంటనే మావైపుతిరిగి, "ఇక మీరు వెళ్లొచ్చు. పరీక్షలు దగ్గరకొస్తున్నాయి, శ్రద్ధగా చదవండి."

"మాస్టారూ, మాస్టారూ—ఈవిషయం మా అమ్మతో చెప్పరుకదూ!" విశ్వం విశాలరావు మాస్టారివంక దీనంగా చూస్తూ అన్నాడు. "నేను కష్టపడి చదువుతాను మాస్టారూ, మా అమ్మకి మట్టుకు చెప్పకండి"

విశాలరావుమాస్టారు విశ్వంవైపు మందలింపుగాచూసి అన్నారు: "పెద్దవాళ్ళతో అబద్ధాలాడకూడదు, తెలుసా! నిన్ను మీ అమ్మగారు ఏమీ అనకుండా చేసే బాధ్యత నాది,

సరేనా ! నీవు చాలా పాఠాలు వెనుకపడ్డావు. అన్నంతిని పుస్తకాలు తీసుకుని మా ఇంటికివస్తే నీకు చెబుతాను.”

“తప్పకుండావస్తానండీ మాస్టారూ. మా అమ్మరాగానే ఈవిషయమంతాచెప్పి అన్నం తిని వస్తాను.

“నేను వెళ్తున్నాను. త్వరగా రావాలిసుమా.”

నాకు యిక అక్కడ ఉండబుద్ధివేయలేదు. మిత్రబృందంతోబాటు బయటికి వచ్చాను.

# 16

విశ్వం మరుసటిరోజు బడి కొచ్చాడు. మల్లెపూవు లాంటి తెల్లని చొక్కా, చక్కగా దువ్విన తల, ముచ్చటగా అట్టలువేసిన పుస్తకాలు – చాలా అట్టహాసంగా వచ్చాడు. గది గుమ్మంలో అడుగెడుతూనే ఆగిపోయాడు. అందరివంకా దోషిలా చూచాడు. ఎవరూ ఏవిధమైన గుసగుసలుగాని, వెక్కిరింపుచేష్టలుగాని చేయకపోయేసరికి క్షణకాలం తల పంకించి, గబగబా వచ్చి నా ప్రక్కనే కూచున్నాడు. విశ్వం రాక నాకు మహదానందాన్ని కలిగించిందనే చెప్పాలి. వాడు బడికి మళ్ళీ రావడంలో నా పాత్రను తలచుకుని సగర్వంగా విశ్వం వంక చూసి, చిన్న మందహాసంచేశాను. విశ్వం మెల్లగా నవ్వి ఊరుకున్నాడు.

విశాలరావు మాస్టారు క్లాసులో విశ్వాన్ని గురించి ఏవిధమైన వ్యాఖ్యానము చేయలేదు. ఆటగంటలో చక్రపాణి విశ్వంవిషయం ప్రస్తావించాడు. అంతటితో ఆపుతాడను కున్నాను కాని, అలా జరుగలేదు. విశ్వాన్నిగురించి చెప్పడం

మానేసి ఆ ధోరణి నామీదికి మళ్ళించాడు. "దీని కంతకూ కారణం వేణు. విశ్వానికి ప్రాణస్నేహితుడై ఉండి కూడ వాడు చెడిపోతూంటే చూస్తూ ఊరుకున్నాడు."

"ఏం చేయమంటావోయ్ మహానుభావా! ఒకసారికి లక్షసార్లు చెప్పాను. వింటేనా? ఇంతకంటే నేనుమాత్రం ఏం చేయగలను? సర్కసులో చేరదామన్న బుద్ధి వాడి బుర్రలో పుట్టిందేకాని నేనేమీ ప్రోత్సహించలేదు." చక్రపాణికి కాస్త తీవ్రంగానే జవాబిచ్చాను.

"ఊరికేనే ఏదో ఆషామాషీగా చెబితే ప్రయోజనం లేదు వాడికి నచ్చేటట్లుగా చెప్పాలి."

"రక్షించావు. వాడి వెంటబడి, తరుముకుంటూపోతూ చెప్పమనలేదు. అయినా కందకు లేని దురద..."

"ఈ సామెతలకేమిలే. ఉత్తి గాలికబుర్లు చెప్పడం మినహా వాడి చదువులో యేమైనా నీవు సహాయపడ్డావా?"

"నే నేమీ గాలికబుర్లు చెప్పలేను. తెలిసిందా?"

"బడి వదలిపెట్టినతర్వాత యీ విషయాన్నిగూర్చి మాట్లాడుకుందాం. అప్పుడే మాష్టారు వస్తున్నారు......"

ఇంగ్లీషుపీరియడు కాగానే విశాలరావుమాష్టారు మా దగ్గరకు వచ్చి నెమ్మదిగా అన్నారు. "హెడ్మాస్టారు ఓ సారి రమ్మన్నారు, వెళ్ళిరండి"

"హెడ్మాష్టారా! ఎందుకు?" అప్రయత్నంగా అన్నాను. భయంవేసింది. విశ్వం మాటా, పలుకూ లేకుండా దిగులుగా నుంచున్నాడు.

"ఎందుకో వారే చెబుతారు. త్వరగా వెళ్ళండి. మీా కొచ్చిన భయ మేమీాలేదు." అన్నారు మాస్టారు.

మేము తిన్నగా హెడ్మాష్టారి గదివైపుకు వెళ్ళాం. గుమ్మందగ్గరకు వెళ్ళి ఆగిపోయాం. ముందుకు అడుగుపడటం లేదు. ఏం ప్రశ్నలు వేస్తారో, యేమని జవాబుచెప్పాలో తోచకుండావుంది. ఇంతలోకి హెడ్మాష్టారి కంఠం వినిపించింది.

"ఎవరూ!"

గదిలోకి అడుగెడుతూ "నమస్కారమండీ" నేనే ధైర్యం చేసి అన్నాను. విశ్వం ఓ నమస్కారం పారేసి వూరుకున్నాడు.

"ఓహో! వేణూ, విశ్వమా! రండి; రండి. అలా కూచోండి" హెడ్మాష్టారు మాకు రెండు కుర్చీలు చూపించి మళ్ళీ యేదో వ్రాతపనిలోపడ్డారు.

మేము కూచునేందుకు భయపడ్డాం. ఏమంటే ఆ కుర్చీలు హెడ్మాస్టారికి యెదురుగా చాల దగ్గరలో వున్నాయ్. ఇంతకుముందెన్నడు వారిని నేను యింత దగ్గరలో చూళ్ళేదు. ఆ బుర్రమీాసాలు చూసేసరికి భయంవేసింది. నా బుర్రలోకి యింకో ఆలోచనకూడా వచ్చింది. మేముగనుక అడిగినవాటికి సరిగా సమాధానం చెప్పకపోతే నాలుగు వెయ్యడానికి అనువుగావుంటాంగదా అని యీావిధంగా కూచోమనలేదుకదా, ఖర్మ! ఈ ఆలోచన వచ్చినందుకు నాలో నేనే చాల సిగ్గుపడ్డాను. ఎందుచేతనంటే యింతవరకు హెడ్మాస్టారు ఒక్క విద్యార్థినికూడా కొట్టినట్లు నేను వినలేదు. దాంతో గుండెదడ కాస్త తగ్గింది. విశ్వంవైపు చూశాను. వాడు కుర్చీకి ఓ మూాల ముడుచుకుని నేలవంక, మధ్యమధ్య హెడ్మాస్టారివంక భయం

భయంగా చూస్తూ కూచున్నాడు హెడ్మాస్టారు వ్రాతపని ముగించుకుని మా ముఖాల్ని కళ్ళజోడులోంచి తీక్షణంగా చూశారు. ఓ సారి బుర్రమీసాలను సవరించుకుని ప్రారంభించారు—

"ఏమోయ్ విశ్వం, బడికిరావటల్లేదుటగా?"

విశ్వం ఓ సారి హెడ్మాస్టారివంక దీనంగాచూసి తల కిందికి దించేసుకున్నాడు.

"నిన్నే అడుగుతున్నాను. బడికి రావటల్లేదటగా"

విశ్వం తలపైకెత్తి జవాబు చెప్పేందుకు ప్రయత్నించాడు. కాని మాటపెగల్లేదు.

"ఇదిగో విశ్వం, ఇలా నావంకచూసి జవాబివ్వు." హెడ్మాస్టారు కఠినంగా అన్నారు. "మూగవాడిలా కూచుని ప్రయోజనం లేదు. నాకు అవతల చాలా పనులున్నాయి."

"బడికివస్తే కోప్పడతారని..." విశ్వం తలవంచుకొని జవాబిచ్చాడు.

"ఎవరు ?"

"తెలుగు మాష్టారు ?"

"ఎందుకు ?"

"తెలుగు కాంపోజిషన్ వ్రాయనందుకు."

"అసలు నీ వింతవరకు ఒక్క క్లాసుకైనా వచ్చావా?"

విశ్వం తల అడ్డంగా త్రిప్పడం మినహా జవాబివ్వలేదు.

హెడ్మాస్టారు చటుక్కున నా వైపు తిరిగి అన్నారు: "ఇంతకు పూర్వం లెక్కల్లో నీవు చాలా వెనుకబడివున్నావు. అవునా ?"

"అవునండి" నేను మెల్లగా జవాబిచ్చాను.

"ఇప్పుడు బాగా చేస్తున్నావు కదూ ?"

"అన్ని లెక్కలు స్వయంగానే చేస్తున్నానండీ."

"ఎలా చేయగలుగుతున్నావో చెప్పు చూద్దాం."

"మరే, నాకు లెక్కల్లో ఎప్పుడూ చాలా తక్కువ మార్కులు వస్తుండేవి. విశాలరావుమాస్టారు నన్ను కష్టపడి లెక్కలు చేయమని పదేపదే చెబుతుండేవారు. నేను లెక్కలు స్వయంగా చేయ నిశ్చయించుకున్నాను. మొట్టమొదట అసలు ఆన్సర్లు వచ్చేవేకావు. అలాగే పట్టుదలతో కొన్నాళ్ళు చేశాను. రాను రాను త్వరత్వరగా చేయడం అలవాటయింది. సరియైన ఆన్సర్లుకూడా వచ్చేవి. ఇప్పుడు యెటువంటి లెక్క యిచ్చినా చేయగలను."

"చాలా బావుంది" హెడ్మాస్టారు వెంటనే విశ్వం వైపు తిరిగి అన్నారు: వేణు చెప్పింది విన్నావు కదూ. నీవు కూడా తెలుగులో కష్టించి కృషిచేయాలి. ఏమంటావ్ ?"

"తప్పక చేస్తానండీ"

"చేస్తానంటే చాలదు. వచ్చే పరీక్షలో మంచి మార్కులు తెప్పించుకోవాలి !" హెడ్మాస్టారు వెంటనే నా వైపు తిరిగి అన్నారు: "మీ రిద్దరు మంచి స్నేహితులు, అవునా ? మరి విశ్వానికి తెలుగులో సహాయం చేయలేవూ? నీ మిత్రునికొరకు నీవు కొన్నాళ్ళు శ్రమించాల్సివుంటుంది"

"అలాగేనండి."

హెడ్మాస్టారు చిరునవ్వుతో అన్నారు: "విశాలరావు మాస్టారు మీ విషయంచెప్పారు. మీరు మంచి స్నేహితు

లని, బుద్ధిమంతులనీ. అయితే అప్పుడప్పుడూ చిన్న చిన్న అబద్ధాలు ఆడుతుంటారట, అవునా ?"

విశ్వం, నేను బిక్కచచ్చిపోయాం. మేము అబద్ధాలాడినట్లు హెడ్మాస్టారి కెలా తెలిసిందో ? మేము జవాబివ్వక పోవడం చూసి గంభీరంగా అన్నారు:

"పెద్దవాళ్ళ దగ్గర అబద్ధాలాడకూడదు, తెలిసిందా! అబద్ధాలాడటంవల్ల యితరులను మోసగిస్తున్నామని అనుకోకండి. మీరు మోసగించేది మీ తల్లిదండ్రులను, మాష్టర్లను, తోటి స్నేహితులనే కాదు. నిజానికి మిమల్ని మీరే మోసగించుకుంటున్నారు, ఏం ?"

మేము జవాబివ్వలేదు. ఇలాంటిప్రశ్న లింకేమైనా అడుగుతారేమోనని భయపడ్డాం. శివశివ ! మా భయంకాస్తా నిజమై ఊరుకుంది. కళ్ళజోడుతీసి ముఖం తుడుచుకుంటూ హెడ్మాస్టారు పిడుగులాంటిమాట అన్నారు :

"అయితే విశ్వం, ఇన్నాళ్ళవరకు బడికిరాకుండా ఏం జేస్తున్నావ్ ?"

ఇక బుకాయించి లాభంలేదనుకున్నాం. హెడ్మాస్టారికంతా తెలిసి అడుగుతున్నారనే భావంతో మేము ముందు భయపడాల్సి వచ్చింది. భైరవికి లెక్కలుచేయడం ఎలా నేర్పిందీ, అందుకుగాను ఎన్నిబాధలుపడ్డదీ, అన్నీ పూసగుచ్చినట్లుగా వివరించాం. హెడ్మాస్టారు 'ఏమిటీ వెధవ చేష్టలు! చదువూ సంధ్యా మానేసి, కుక్కకు లెక్కలు నేర్పడమేమిటి మీ ముఖం" అని నాలుగు ఝాడిస్తారని భావించాం. ఆశ్చర్యం ! హెడ్మాస్టారు ఏమీ అనలేదు సరిగదా పైగా

మమ్మల్ని ఎంతగానో అభినందించారు. దాంతో మాకు ఏనుగుబలం వచ్చింది. మరికాస్త హుషారుగా, జోరుగా, మధ్యమధ్య ఉన్నవీ లేనివీ కల్పించి కోశాము. అంతా విని, కళ్లుపెద్దవిచేసి, కళ్ళజోడును ముక్కుమీదికి లాక్కుని ఆశ్చర్యంగా మా వంకచూస్తూ అన్నారు :

"కుక్క ఎక్కడైనా మనిషిలా లెక్కలు చేస్తుంది టోయ్......"

"మరి సర్కసులో కుక్క లెక్కలు చేసింది కదండీ." అన్నా న్నేను.

హెడ్మాస్టారు పెద్దగా నవ్వి ఇలా అన్నారు. "మీరు నిజంగా కుక్క లెక్కలుచేసిందని భావిస్తున్నారుకదూ! అదంతా కేవలం భ్రమమాత్రమే. నిజానికి కుక్క లెక్కలుచేయలేదు. కుక్కలకు తర్ఫీదు యిచ్చేవాడు కొన్ని సైగలుచేసి దానికి ఆ ప్రకారం మొరగడం నేర్పాడు. మనకేమో యీ విషయాలేవీ తెలియవుగనుక కుక్క లెక్కలుచేసిందనగానే చటుక్కున నమ్మేస్తాం."

"ఏవిధంగా సైగలు చేస్తాడండీ ? మనం చూస్తూనే వుంటాంగా......"

"అక్కడేవుంది గమ్మత్తు ! మన కందరికీ తెలిసేట్టుచేస్తే వాడి తెలివియేముంది ? కుక్కలకు తర్ఫీదు నిచ్చేవాడు మాటిమాటికి చేతులూపడమో, బుర్రమీద వేళ్ళతో మీటడమో, తల తిప్పడమో చేస్తుండేవాడు. ఔనా ?"

మేము ఔనన్నట్లుగా తలతిప్పాం.

"అవే సైగలన్నమాట. ఉదాహరణకి అలా తిప్పడం

వుందనుకో - దానికి ఒక్కసారిమాత్రమే మొరగమని అర్థం. ఇలాగే మిగతావి........"

"అయితే భైరవి ఈ సైగలేమీ లేకుండానే సరియైన జవాబులు చెబుతుందే"

"స్వతహాగా కుక్కలు చాల తెలివిగలవి. నీవు భైరవికి ఈ సైగలద్వారా తర్ఫీదు ఇచ్చావంటే కొద్దిరోజుల్లోనే అది సర్కసు కుక్కలను మించిపోతుంది"

"ఇకముందు నేను ఇదేవిధంగా తర్ఫీదునిస్తానండీ"

"చదువుమానివేసి, కదూ?" హెడ్మాస్టారు నవ్వుతూ అన్నారు.

"అహాఁ, అదికాదండీ, తెలుగులో బాగా మార్కులు వచ్చినతర్వాతనే భైరవికి లెక్కలు నేర్పుతాను"

"మంచిది. మీరిద్దరు చదువుకుని, తరువాత ఈపని చేయండి. మనస్కూల్లో ఉగాదిపండుగకు ఓ ప్రదర్శన ఏర్పాటు చేద్దాం. సరేనా?"

మేము ఏమీ జవాబివ్వలేదు.

"ఇక వెళ్ళిరండి. నేను చెప్పినవిషయాలన్నీ జ్ఞాపకం ఉన్నాయికదూ?"

మేము హెడ్మాస్టారికి నమస్కారంచేసి బయటపడ్డాం. మనస్సంతా హాయిగాఉంది. హెడ్మాస్టారు ఇలా మాట్లాడుతారని మేము కలలోకూడా అనుకోలేదు. మాకు చదువుయొక్క ప్రాముఖ్యాన్ని, క్రమశిక్షణ, సౌశీల్యములయొక్క ఆవశ్యకతను గుర్తించేట్లుగాచేయడమేవారిఅభిలాషయనిగుర్తించాం. లోలోపల వారికి కృతజ్ఞతాభివందనములు సమర్పించాం.

## 17

మేము హెడ్మాస్టారి గదిలోంచి బయటపడేసరికి మిత్ర బృందంవారు మమ్మల్ని ముట్టడివేశారు. వింతజంతువులను చూసినట్లుగా చూస్తూ ప్రశ్నలడాడి ప్రారంభించారు.

"ఏం జరిగిందిరా, హెడ్మాస్టారేమన్నారు?" ఆత్రంగా రాధాయి ప్రశ్నించాడు.

"ఆఁ, ఏం జరుగుతుంది. చాటుకు పిలిచి నాలుగు చీవాట్లువేసివుంటారు, ఏమంటార్రా" సారధి మా తరఫున జవాబిచ్చాడు.

"చీవాట్లతో వదిపెట్టారా అని సందేహం. చెరి ఒకటి యిచ్చివుంటారు:"

"నీ జీవితమంతా సందేహాలేరా సుందరం. హెడ్మాస్టారింతవరకెవరినైనా చేయి చేసుకున్నట్లు విన్నావా? తెలియని విషయాలు మాట్లాడవద్దన్నాను" కిష్టాయి సుందరంతో మందలింపుగా అన్నాడు.

"ఇంతకీ ఏం జరిగిందో అఘోరించండోయ్ త్వరగా" చక్రపాణి విసుగ్గా అన్నాడు.

"ఏం అఘోరించమంటావు? మమ్మల్ని మాట్లాడనిస్తేనా? వారాలో మీరే అఘోరించుకుంటుండిరి..."

"వేణూ, అసలు విషయాన్ని చెప్పవోయ్, ఆదుర్దాగా వుంటే..."

"హెడ్మాస్టారు మమ్మల్నేమీ అనలేదు" నేను విశ్వం వైపు చూస్తూ అన్నాను.

"కోత. నమ్మలేకుండా ఉన్నాను. అలా ఎన్నటికీ జర గదు" చక్రపాణి తలఅడ్డంగాతిప్పుతూ అన్నాడు.

"కావలిస్తే విశ్వాన్ని అడుగు. ఏరా విశ్వం, మనల్నేమన్నా అన్నారా?"

విశ్వం జవాబులేకుండా ఏమీలేదన్నట్లుగా తల త్రిప్పాడు.

"మమ్మల్ని క్షమించారు. బాగా చదువుకోమని చెప్పి పంపించారు"

"క్లాసులోకి వెళ్దాం రండి. అక్కడ తీరిగ్గా మాట్లాడుకోవచ్చు."

మేమందరమూ క్లాసులోకి వెళ్ళి సభతీర్చినట్లుగా కూచున్నాం. చక్రపాణి గొంతు సవరించుకుంటూ ప్రారంభించాడు: "విశ్వం విషయం ఏం చేద్దామంటారు? వాడికి తెలుగులో సరిగా చదవడంకూడా రాదు. పోతే కాంపోజిషన్ క్లాసువ్యవహారం మీ కందరికి తెలిసిందే. కనుక వాణ్ణి యెలాగైనా తెలుగు బాగా చదివేట్లుచేసే బాధ్యత మనందరిమీద వున్నది. నిజానికి యిది మన క్లాసు గౌరవానికి సంబంధించిన విషయం. ప్రక్క సెక్షనుకంటె మనం యెప్పుడూ మిన్నగా వుండేట్లు చూసుకోవాలి. ఏమంటారు?"

నిజం, నిజం. మరి విశ్వానికి సహాయంచేయడానికి యెవరినిపంపితే బావుంటుందో ఆలోచించాలి."

ఎవరూ వెళ్ళడానికి సిద్ధపడలేదు.

"ఊఁ, మరి యెవరువెళ్తారో చెప్పండి. లేకపోతే యెవరూ వెళ్ళరా?"

"విశ్వానికి నేను సహాయంచేస్తాను. హెడ్మాస్టారు కూడ మా యిద్దరినీ కలిసి చదువుకోమన్నారు." ఏమంటారో అని అందరివైపు చూస్తూ అన్నాను.

"సరే, హెడ్మాస్టారు అంటే మా కేమీ అభ్యంతరం లేదు. ఉన్న భయమల్లా మీ యిద్దరూ కలిస్తే అసలు చదువు తారాఅని?" చక్రపాణి ప్రశ్నార్థకంగా ముఖంపెట్టి అన్నాడు.

"ఓ! మహారాజులా చదువుకుంటాం. కావలిస్తే మీ రెవరన్నా వచ్చి చూడవచ్చు."

"ఏరా, విశ్వం! నేనూ నీతోకలసి చదువుకోవడం నీ కిష్టమేనా?"

"ఆఁ" విశ్వం తన అంగీకారం తెలియబర్చాడు.

"ఇక వెళదాం పదండి. ప్రొద్దుపోయింది." చక్రపాణి అన్నాడు.

ఇంటిదారిపట్టాం. మా వీధిమలుపు తిరిగిందాకా విశ్వం మౌనంగా వుండిపోయాడు. బహుశః తన చదువువిషయమే ఆలోచిస్తూ వుండవచ్చు. చివరికి అన్నాడు—

"నేను ఉత్త వెధవను. చవటను. చదువులేదు. ఆత్మ శక్తి లేదు. ఎందుకూ పనికిరానివాణ్ణి." విశ్వం కళ్ళవెంట నీళ్ళు కారాయి. కంఠం రుద్ధమైంది. ఈ దృశ్యం చూసేసరికి నాకు చాలా జాలివేసింది. చివరకు ఓదార్పుగా అన్నాను: "ఛ ఛ. ఏమిటామాటలు. నీకేమన్నా మతిపోయిందా విశ్వం! నే నున్నానుగా..."

"నిజం వేణూ. నాసంగతి తలచుకుంటే నాకే విచారం వేస్తుంది. నీతోడు లేకపోతే ఈపాటికి ఏమైపోయేవాడినో!

ఇకనుంచి అయినా జాగ్రత్తగా చదువుతాను. మరి నీవు సహాయం చేస్తావా? ఒట్టువెయ్యి" అన్నాడు.

నేను విశ్వం చేతిలో చేయివేసి అన్నాను. "నీకు తప్పక సహాయం చేస్తాను. అయితే నేను చెప్పినట్లు వినాలి. తలాయించకూడదు, తెలిసిందా?"

విశ్వం జవాబు చెప్పలేదు.

"ఇవాళనుంచే పాఠాలు మొదలెడదాం. భోంచేసి వస్తాను. సిద్ధంగా ఉంటావుకదూ!"

"ఆఁ, నీకోసం ఎదురుచూస్తూంటాను. త్వరగా వస్తావు గదూ"

నేను భోజనంచేసి, పుస్తకాలు తీసుకుని తిన్నగా విశ్వం ఇంటికి వెళ్ళాను. లోపలిగదిలో భైరవి అరుపులు వినిపిస్తున్నాయి. గబగబా వెళ్ళి చూశాను. గదిమధ్యగా కుర్చీమీద భైరవికూచుని అరుస్తోంది. ఎదురుగా విశ్వం చేతితో సైగలు చేస్తున్నాడు. విశ్వం నారాకను గమనించనేలేదు.

"విశ్వం!"

విశ్వం చటుక్కున నావైపుతిరిగి అన్నాడు. "ఓ, నీవా? రక్షించావ్. విశాలరావు మాస్టారేమోనని అదిరిచచ్చాను. సరేగాని భైరవిని చూశావా? సైగలుచేస్తుంటే ఎలా అరుస్తోందో! ఇంతవరకు ఒకటికూడ తప్పుగా చెప్పలేదు......"

"వెధవసొద కట్టిపెట్టి, తెలుగుపుస్తకం తీసుకురా. ఎప్పుడూఉన్న కోలువేగా, కొత్తావిమిటి? ఇందాక చేసిన వాగ్దానం అప్పుడే మరచావన్నమాట"

"ఊఁ హుఁ, లేదు. తెలుగు బాగా వచ్చేదాకా భైర విలో ఆడుకుంటే అడుగు"

"సరేగాని ముందు భైరవిని బయటకుపంపి తెలుగు పుస్తకం తీసుకురా!"

విశ్వం భైరవినిలోపలకట్టేసి తెలుగుపుస్తకం తీసు కొచ్చాడు. "ఏ పాఠం చదువుదామంటావ్?" అనడిగాడు.

"సరి, నీకు ఏపాఠంచదవాలోగూడ తెలియదన్నమాట. ఎన్నడైనా పుస్తకంముట్టుకుంటేనా? ఊఁ, రెండోపాఠంచదు వుదాం. నోటుపుస్తకం తెచ్చావా మరి, అర్థాలు రాసుకుం దువుగాని"

"ఆ" అని రెండోపాఠం చదవటం మొదలెట్టాడు.

"జోరు కాస్తతగ్గించు మరి. పాఠంచదవబోయేముందు దానిని వ్రాసినవారెవరో, వారికాలము. బిరుదులువగైరా తెలు సుకోవాలి. మనంచదివేది ఏగ్రంధంలోనిదో తెలుసా?

"ఊఁహూఁ, మనకితెలిస్తే నీసహాయంఎందుకు?"

"అయితే విను: ఈపాఠం మహాభారతంలోనిది, తెలి సిందా?"

"భారతంలోనిదా, చంపేశావు. ఇంకేమిటోఅను కున్నాను. ఈకథ నాకు చిన్నప్పుడే తెలుసు"

"ఎలా తెలుసు!"

"నేను చాలాసార్లు 'తింటేగారెలే తినాలి, వింటే భార తమే వినాలి' అని మాపిన్ని చాలాసార్లు అనగా విన్నాన్లే."

"అది ఒకసామెత. అంతేకాని భారతంమాత్రం కాదురా చవటా!

"పోనీలే, ఏదో ఒకటి సరేగాని, వేణూ ! నాకో అనుమానం తగులడింది, అడగమంటావా?"

"ఊc, త్వరగా"

"గారెలు, భారతము అన్నారుకదా ! గారెలుతింటూ భారతంచదవాలా? లేక భారతంచదువుతూ గారెలుతినాలా ? ఈ రెంటిలో ఏది సరైన పద్ధతో చెబితే..."

"నీ యిష్టమొచ్చినట్లు చేద్దువుగాని, ముందు భారతం వ్రాసిన దెవరో చెప్పు ?"

"భారతం వ్రాసినదేవరనేగా ? నీ కీమాత్రం తెలియదురా?...

"ఎదురు ప్రశ్నలువేయక సవ్యంగా జవాబుచెప్పు. మహాభారతమును వ్రాసిన దెవరు ?"

"ఇంకెవరు, మీ నాయనమ్మ. అంతేకదూ!"

"నోర్ముయ్! మా నాయనమ్మ పేరెత్తావంటే ముక్కు పచ్చడిచేస్తాను."

"ఓశ్, ఈ బెదరింపుల కే మొచ్చెలే. ఇంతకీ భారతం వాసిన దెవరంటావ్ మరి?"

"సంస్కృతంలో వేదవ్యాసుడు..."

"మరి మీ నాయమ్మ ఎప్పుడూ భారతం చదువుతూంటుందిగా. ఆమే వ్రాసిందనుకున్నాను. తప్పా ?"

'వెధవ గొడవ కట్టిపెట్టు. తెలుగులో దాన్ని ఎవరు అనువదించారో చెప్పు"

"ఎన్నిసార్లు చెప్పాలిరా, మీ నాయనమ్మలని"

"ఇక చాలు. నే నింటికి వెళుతున్నాను. నీలాంటి వెధవకి సహాయం చేయటంకూడ దండుగే!"

"నేను వెధవనన్నమాట."

"అక్షరాలాను. భారతం వ్రాసినదెవర్రా అంటే మా నాయనమ్మ అని అఘోరిస్తుంటివి---ఇంకెలా ఏడ్చేది?"

"ముందు పాఠం చదువుకుందాం. తరువాత ఎవరు వ్రాసిందీ తేల్చుకోవచ్చులే."

"సరే కానియ్."

రెండు పేజీలు చదవగానే "ఇక లాభంలేదురా వేణూ బుర్రవేడెక్కిపోయింది, రేపు చదువుకుందాం; ఏమంటావ్?" అన్నాడు.

నే నేమీ జవాబివ్వలేదు. వాడి కిష్టంలేకుండా చదివించడం సామాన్యంకాదు. నిముషనిముషానికి కుస్తీపట్టాలి. అయినా మొదటిరోజు ఎక్కువసేపు చదవడం మంచిదికాదని భావించాను. నా లెక్కల అనుభవం ఇప్పుడు అక్కరకు వచ్చింది.

బయట అడుగులచప్పుడు వినిపించింది. చక్రపాణి వచ్చాడు. చిన్నగా మందహాసంచేసి అన్నాడు. "ఓహో, మిత్రు లిద్దరు తెగచదివేస్తున్నారల్లేవుందే? ఎన్నో పాఠంరా"

"రెండోపాఠం. వీడితో చదవడం చెడ్డ చిరాకుగా వుందిరా చక్రపాణి!" అన్నాను నేను.

"అప్పుడే ఇంతదూరం వచ్చిందీ వ్యవహారం. అయితే ఇక మీరు చదివినట్టే..."

"ఏం చేయమంటావోయ్, చస్తుంటే! వీడికేమీ తెలియదాయె"

"ఆ విషయం అందరికీ తెలుసు. అందుకేగా ఏ సహాయం."

"పూర్తిగా విను మరి. తెలియకపోతే చెప్పింది వినాలా మరి. అడ్డమైన ప్రశ్నలు, జిడ్డు వాదాలు వేస్తుంటే ఏం చేయను ?"

విశ్వం నా వైపు తీక్షణంగా చూసి, పుస్తకం చూస్తున్నట్లుగా నటించసాగాడు. ఇంతలో మళ్ళీ బయట చప్పుడు వినిపించింది. కిష్టాయి వచ్చాడు.

"పాఠాలు చదువుతున్నారేమిటి ? ఓహో, చక్రపాణి కూడ ఇక్కడే ఉన్నాడే !"

"అంటే..."

"అంటే ఏమిటి ? అచ్చమైన తెలుగులో మాట్లాడుతున్నా అర్థం కావడంలేదన్నమాట. పాఠాలు చదువుతున్నారా అని అడుగుతున్నాను. తప్పా?..."

"కనపడటం లేదూ ?"

"అదా సంగతి. అయినా నాకెందుకు మీ గొడవ. ఏమంటావురా చక్రపాణీ ?"

చక్రపాణి మాట్లాడలేదు. ఎవరో వస్తూన్నట్లుగా మళ్లీ అడుగుల చప్పుడు వినిపించింది. సారధివస్తూనే

"ఓహోహో ! విశ్వం వేణూకలిసి చదువుతున్నారే ! చాలాబావుంది" అన్నాడు.

మేముముగ్గురం బిగ్గరగా నవ్వాం. సారథి ఏమీ అర్థం కానట్టు బిత్తరపోయిచూస్తూ అన్నాడు. "ఎందుకురా నవ్వుతారు ? నాకూ్కడా చెబితే నేనూ నవ్వుతానుగా"

మేము మరికాస్త పెద్దగా నవ్వసాగాం.

"ఇది తప్పక ఏదో వ్యాధిలక్షణం అయివుంటుంది. అసలెందుకు నవ్వుతున్నారు ?"

"నిన్ను చూసి..."

"హుం, నన్ను చూశా ! ఏం మామూలుగా లేనా, మారిపోయానా ఏమిటి ?"

"లేకపోతే ఏమిటోయ్, ఆ ప్రశ్న - చదువుతున్నారా అని ! మా జీవితంలో ఇదే మొదటిసారిగా పాఠాలు చదువుతూన్నట్లు ఆశ్చర్యంగా అడిగితివి . సరేగాని సారథీ! చదరంగంబోర్డు తీసుకురాలేకపోయావా ! హాయిగా కాలక్షేపం చేసేవాళ్ళం"

"అరరే ! మరచిపోయాను. లేకపోతే ఓ ఎత్తు వేసేవాళ్ళం"

"ఎత్తులు జిత్తులు వేయడంకోసమన్నమాట తమరిరాక. మర్యాదగా వెళ్దాం పదండి. చదువుకునేవాళ్లను పాడుచేయడమెందుకు ?" అని చక్రపాణి లేచాడు.

విశ్వం "ఏం ఫర్వాలేదు. కాసేపు కూచోండిరా" అన్నా మిత్రత్రయం సెలవుతీసుకుని వెళ్ళారు. వాళ్లు గుమ్మం దాటడంతోటే విశ్వం అన్నాడు: "మనం చదువుతున్నామో లేదో పరీక్షించడానికి వచ్చివుంటారు. ఏమంటావ్ ?"

"రానిద్దూ. మనం చదవకుండా కబుర్లు చెప్పుకుంటూ కూచుంటేగా"

"నేనామాట అన్నానా? వాళ్ళ ఆసక్తినిగూర్చి చెప్పాను."

"వాళ్ళేలా ఏడిస్తే మనకేంగాని, నువ్వు బడికి రానట్టు విశాలరావుమాస్టారు మీ అమ్మతో చెప్పారా?"

"ఆహా, ఓ పేజీ ఉత్తరం వ్రాసిచ్చారు."

"మీ అమ్మ ఏమీ అనలేదూ మరి?"

"ఆс, ఏమంటుంది? పాపం! కళ్ళనీళ్లు పెట్టుకుంది. ఆ దృశ్యం చూసేసరికి నాకు పెద్దపెట్టున ఏడుపొచ్చింది. ఆమె మనసు యెంత క్షోభించిందో నని విచారించాను. ఇంకెప్పుడూ అలాచేయనని ఆమెకాళ్ళమీద పడ్డాను. చూడు వేణూ! నాకు బడికి రావాలని, హాయిగా చదువుకోవాలని, మీతోబాటు ఆడుకోవాలనీ వుండేది. కాని వెంటనే మాస్టారు ఏమంటారోనని భయంవేసేది. బడికి వెళ్ళకుండా, కొంప లేనివాడిలా బజార్లవెంట తిరగడం నాకుమట్టుకు సరదాగా ఉండేదా ఏమిటి? ఒకవైపున చదువు చెడిపోతుందే అని బాధ, మరోవైపున అమాయకురాలయిన మా అమ్మను మోసపుచ్చుతున్నానే అని వ్యధ. ఏమీ తోచేదికాదు. ఏడుపుకూడ వచ్చేది. కొంతమంది తల్లులు తమ పుత్రులను చూచుకుని మురిసిపోతారు. గర్విస్తారు. కాని నావంటి పనికిమాలిన వెధవని చూసుకుని మా అమ్మ ఏం సంతోషిస్తుంది చెప్పు?"

"పోనీరా, ఆ విషయాలు లిప్పు డెందుకు?" అనునయ నంగా అన్నాను.

"అవును నిజమే. అవన్నీ చెడ్డరోజులు. అదంతా ఒక పీడకల. గడిచిపోయింది. ఇకముందు అలా జరుగకుండా చూసుకోవాలి. అందుకే కష్టపడిచదువనిశ్చయించుకున్నాను."

"చాలా బావుంది. నేను నా శక్తికొలది సహాయ పడతాను, సరేనా?"

"నిజంగా నువ్వు నా తమ్ముడవురా వేణూ" విశ్వం ఆప్యాయంగా నా భుజంమీద తట్టుతూ అన్నాడు.

# 18

మరునాడు తెలుగుమాష్టారు విశ్వంవ్రాసిన వ్రాతపుస్త కాన్ని చూశారు. కాసేపుచూసినపిదప యిలాఅన్నారు—

"నీ బుర్ర సరిగా ఉండదా, ఏమి టీ కొక్కిరాయి వ్రాతలు"

విశ్వం ఏమీ మాట్లాడలేదు.

"అసలు వ్రాయాలని వుందో లేదోచెప్పు? హెడ్మాష్టరు గారితో చెబితే నీ వ్యవహారం వారే తేల్చుకుంటారు. ఏం?"

"లేదండి - ఇకనుండి బాగా నే వ్రాస్తానండి"

"ఈ అక్షరాలు చూస్తుంటే నీమీద నమ్మకంలేకుండా వుంది. చూడు విశ్వం - ఎంతఛండాలంగా వ్రాశావో - ఒక పంక్తికీ మరోదానికీ సంబంధంవుందా? ఒకటి పైన ఒకటి క్రింద నాట్యంచేస్తున్నట్టుగా యీ అక్షరాలేమిటి?"

"ఇక జాగ్రత్తగానే వ్రాస్తానండీ."

"కబుర్లు చెప్పితే ప్రయోజనం లేదు. రేపు చక్కగా వ్రాసుకొచ్చి నాకు చూపించు."

విశ్వం ఆ రోజునుంచి చూచి వ్రాత కష్టపడి వ్రాయ నారంభించాడు. రాను రాను ముత్యాల్లా వ్రాయ సాగాడు. కాని ఏం లాభం! బుద్ధి నిలకడగా ఉంటేనా? మొదట నాలుగు పంక్తులు బాగా వ్రాసేవాడు. అంటే ఎంతో గొప్పగా వ్రాయాలనే అభిలాషతో కూచునేవాడన్న మాట మరి నాలుగు పంక్తులు గడిచేసరికి అక్షరాలు జబ్బు చేసినవాడిలా బక్కచిక్కి లేక కుస్తీపట్టే వస్తాదులా తెగ బలిసో, ఉండేవి. అంటే అప్పుడే కాస్త విసుగు ప్రారంభ మైందన్నమాట ఇంకో నాలుగుపంక్తులు రాసేసరికిఅక్షరాలు చలికి గజగజ వణకిపోయేవాడిలా వంకర్లు తిరిగిపోయేవి. అంటే విసుగు రెండోదశలో ఉన్నదన్నమాట. మరోనాలుగు పంక్తులు నడిచేసరికి అక్షరాలు గుర్తుపట్టడమే కష్టమయ్యేది. మాటలకి మాటలే ఎగిరిపోయేవి వాక్యాలు నాట్యం చేస్తు న్నట్లుగా ఒక వరసా వాయీ లేకుండా అయోమయంగా ఉండేవి—అంటే విసుగులో పరాకాష్ఠ నందుకున్నాడన్న మాట. సంక్షిప్తంగా వాడి చూచి వ్రాత ను గురించిన వ్యాఖ్యానం యిదీ. ఇది నా ఒక్కడిదేకాదు సుమండీ! క్లాసందరిదీను. తెలుగు మాస్టారూ యిదే అనేవారు.

బడివదలినతరువాత యింటికి వెడుతూంటే మిత్రబృందం కలిశారు.

"వేణూ, మీరిద్దరూ కలిసి చదువుతున్నారుకదూ?" అంటూ చక్రపాణి సంభాషణ ప్రారంభించాడు.

"నీకు పెద్దసందేహమే వచ్చిందే, ఏమిటీకథ - త్వరగా తేల్చు, నేను వెళ్ళాలి" అన్నాను.

"అయితే విశ్వానికి 2 మార్కులే వచ్చాయేం ?"

"భేషుగ్గావుంది ప్రశ్న - అది విశ్వానికో తెలుగు మాస్టారికో వేస్తే జవాబుచెబుతారు. అడిగి చూడక పోయావూ ?"

"వేళాకోళంకాదు మిత్రమా, తెలుసుకోవాలనే అడుగుతున్నాను"

"నేనూ అందుకే జవాబిస్తున్నాను, తెలిసిందా ?"

"నీ జవాబులు బాగున్నాయి, కాని విశ్వాన్ని చెడ గొడుతున్నావని నా అభిప్రాయం."

"నేనా...ఎవడియిష్టం వచ్చినట్టు వాడు అనుకుంటే చెప్పేదేముంది ?" అన్నాను.

"అయితే యింతకీ ఏమంటావ్ ?"

"నావల్ల విశ్వం చెడిపోతున్నాడంటే ఛస్తే అంగీక రించను. అయినా మేము చదువుమొదలుపెట్టి రెండువారా లయిందోలేదో అప్పుడే నూటికివందలు రావాలంటే ?"

"వంద లు రావాలని నేనన్నానా ? రెండుమార్కులే వచ్చాయేమని అడుగుతున్నాను"

"ఇందాకే చెప్పేను, విశ్వాన్ని అడగమని"

'ఈ వితండవాదాల కేమిటిగాని, నువు విశ్వానికి తగు సహాయం చేయడంలేదని ఘంటాపథంగా చెప్పగలను. కనుక యీపనిని చక్రపాణికి అప్పగిస్తే వచ్చేనష్టమేమిటి" అని సారధి ప్రశ్నించాడు.

"హెడ్మాస్టారు మమ్మల్ని కలిసి చదువుకోమన్నారు. మధ్య నీ జోక్యమేమిటి ?"

"నేను రేపు విశాలరావు మాస్టారితో మాట్లాడి హెడ్మాస్టారికి నీ విషయం తెలియజేస్తాను"

"ఓ, మహారాజులా చేసుకో. అంతేగాని నా స్థానంలో మరొకణ్ణి వేయడానికిమాత్రం సుతరామూ ఒప్పుకోను."

"నీ ఇష్టం. రేపు విశాలరావు మాస్టారే ఇలా అంటే నుట్టుకు నీవేమీ ఆశ్చర్యపడబోకు. ముందుగానే జాగ్రత్త పడటం మంచిది."

వీళ్ళ వరస చూచేసరికి నాకు ఆశ్చర్యంవేసింది. నా స్థానంలో చక్రిపాణిని ఎందుకు వేయాలని ఉద్దేశ్యపడుతున్నారో అర్థంకాలేదు. ఈ సందర్భంలో చక్రిపాణి మౌనం వహించడం గమనించాను. విశ్వానికి 5 మార్కులు రావడానికి నేనే కారణమనడం నిజంగా అన్యాయం. నేను వాడికి కాస్తో కూస్తో సహాయపడ్డానేగాని చెడగొట్టలేదు. నేనుగాక మరెవరైనా వాడికి సహాయంజేస్తే యిప్పుడు వచ్చినట్లుగాక 5 మార్కులకు మించి రావచ్చును. కాని ప్యాసు మార్కులు రావనిమాత్రం నిశ్చయంగా చెప్పగలను.

ఆ రాత్రి మా ఇద్దరికీ చదువు సాగలేదు. సాయంత్రం జరిగిన సంఘటన తాలూకు ఆలోచనలు పొగమంచులా మెదడు నిండా అలముకున్నాయి. విశ్వం మసిబారిన లాంతరు వెలుగులో దీనంగా చూస్తూ మౌనంగా ఉన్నాడు.

"ఇక మనిద్దరం కలిసి చదువుకోవడం జరుగదను కుంటాను. రేపు విశాలరావు మాస్టారు నాబదులు చక్రపాణిని పంపవచ్చు" విశ్వం జవాబుకు నిరీక్షిస్తూ అన్నాను.

"ఆఁ అప్పుడే అయిందేమిటి ?"

"ఏమో నాకుమాత్రం అంతా అయినట్లే ఉంది"

"ఈ గొడవ కేమిటిగాని నేను ఇప్పుడో తమాషా చేస్తాను, చూడు..." అంటూ విశ్వం భైరవినిపిలిచాడు. తోక ఆడించుకుంటూ అది గదిలోకి వచ్చింది అటూఇటూ కాసేపు పరకాయించి చూసి కుర్చీమీదికి లంఘించి కూర్చుంది.

విశ్వం ఓ జాజిచెక్కల బోర్డు తెచ్చి దానిమీద '3' అంకె వేశాడు. భైరవి మూడుసార్లు మొరిగింది. విశ్వం యీసారి '5' అంకె వేశాడు. భైరవి ఐదుసార్లు మొరిగింది.

"ఇంకో తమాషా" విశ్వం భైరవివైపుతిరిగి అన్నాడు. "ఇలా యిటు చూడు భైరవీ, నావైపు" అంటూ విశ్వం విచిత్రంగా సైగలుచేయడం ప్రారంభించాడు. భైరవి దానికి తగినట్టుగా మొరగసాగింది. ఇలా కాసేపు చేసిన తరువాత విశ్వం ఒకసారి పెద్దగా చప్పట్లుకొట్టాడు. అంతే, భైరవి మొరగడం ఆపుచేసి బుద్ధిమంతురాలివలె తల వంచుకుని కూచుంది.

"హుఁ. చూశావా మన తమాషా ! ఎలావుంది ?" అన్నాడు హుషారుగా విశ్వం.

"బలేగా వుంది లే, నువు చదువుకోవడంపోయి కుక్కకు చదువు చెపుతున్నావన్నమాట !"

"అవును. ఇలా యెందుకుచేశానో నాకే తెలియదురా వేణూ. ఇందుకు బహుశా నాకు తగినంత ఆత్మశక్తి లేక పోవటమే కావచ్చు. భైరవికి చదువుచెప్పటం యెలాగూ పూర్తిఅయిందిగనుక యిక గట్టిగా చదువుతాలేరా."

"సే యిష్టం. రేపు చక్రపాణి వస్తాడుగా వాడితో చెప్పు, సంతోషిస్తాడు."

మరుసటిరోజు విశ్వం తన చూచివ్రాత పుస్తకాన్ని తెలుగుమేష్టారుకి సగర్వంగా చూపించి "నిన్న మీరు చెప్పినట్టు వ్రాశానండి." అన్నాడు.

తెలుగుమాష్టారు విశ్వంవైపు సంతృప్తిగా చూసి నవ్వుతూ అన్నారు. "బాగా వ్రాశావోయ్. తప్పులు పూర్వంవలె లేవు. అక్షరాలుకూడా కుదురుగానే వున్నాయి"

"నాకు చదువులో వేణు సరిగా సహాయపడటంలేదని మీరూ భావిస్తున్నారా మాష్టారూ?" విశ్వం మెల్లగా అడిగాడు.

"లేదోయ్. వేణుని గురించి నేనెపుడూ అలా తలచను. ఏమైనా నువ్వు కష్టపడందే ప్రయోజన మేమీ లేదు. బాగా చదువవలసినవాడవు నువుగాని వేణూకాదుగా" అన్నారు.

"బాగానే చదువుతానండి. ఎలాగూ నాకు సహాయంగా వేణు వుంటాడు. మే మిద్దరంకలిసి చక్కగా చదువుకుంటాం."

"సరే, మంచిదే. హాఫ్‌యియర్లీ సెలవుల్లో వ్యాకరణం బాగా చదవాలి. కొన్ని అభ్యాసాలుకూడ యిస్తాను. ఎలా చదువుతావో చూద్దాంగా."

నేను తెలుగుమాస్టారికి హృదయపూర్వకంగా నమస్కరించాను. ఒకవేళ నా బదులు చక్రపాణిని పంపుతానంటే నేను చిన్నపోయేవాణ్ణే.

సాయంకాలం యింటికి వెళ్లేటప్పుడు విశాలరావు మాస్టారు కలిశారు. సంగతంతా చెప్పేసరికి చాల సంతోషించారు. విశ్వాన్ని ఆప్యాయంగా భుజంతట్టి అభినందించారు.

"మేస్టారూ! మా దగ్గర ఓ కుక్క ఉందండి– చాల మంచిది. పేరు టైగర్. ఉగాదినాడు మన స్కూల్లో మేము దానిచేత భలే భలే తమాషాలు చేయిస్తాం మాస్టారూ, మీా కిష్టమేనా?" అన్నాడు విశ్వం.

"ఓహో! అలాగా. ఇంతకీ మీాకుక్క ఏమేమి తమాషాలు చేస్తుందో చెప్పేరుకాదే!"

"ఎలాంటి చిక్కు లెక్కలైనా యిట్టే చేస్తుందండీ. ఇంకా మనం బోర్డుమీాద అంకెలు వేస్తే గుర్తుపడుతుందండీ"

"అలాగా? యీా తమాషాలు ఎవరు నేర్పారు?"

"నేనూ, వేణూ."

"మీరిద్దరూ మాస్టర్లయ్యారన్నమాట. సరే ఉగాదినాడు తప్పక మన స్కూల్లో ప్రదర్శన ఏర్పాటుచేద్దాం. వెళ్ళి రండి."

మాస్టారి ప్రోత్సాహంతో యిక మా ఆనందానికి అంతులేకపోయింది. మేము ఉల్లాసంతో యిళ్ళకు చేరాం.

# 19

విశ్వం తనే స్వయంగా భైరవికి లెక్కలుచేయడం నేర్పుతానని చెప్పాడు. ఈ విషయం నాకేమీ నచ్చలేదు. విశ్వం ఇలా ఎందుకు అంటున్నాడో అర్థంకాలేదు. భైరవికి లెక్కలు నేర్పడంలో విశ్వానికి సహాయపడాలని నాకు ఎంతో ఉత్సాహంగా ఉండేది. విశ్వంమట్టుకు ఈ సంగతి ఎత్తేసరికి ముభావంగా ఉండిపోయేవాడు. ఇది వాడికిఇష్టంలేదు కాబోలు నని నేను మెదలకుండా ఊరుకున్నాను. కాని ఒకనాడు విశ్వమే ఈ సంగతి కదిపాడు—

"భైరవికి లెక్కలు నేర్పేందుకు నీ సహాయం వద్దన్నానని బాధపడుతున్నావు కదూ ?"

"నేనేం బాధపడటంలేదు"

"నీముఖం చూస్తేనే తెలుస్తోంది, బాధపడుతున్నావో లేదో"

"అయితే ఇంతకీ ఏమంటావు ? బాధపడమంటావా ? వద్దంటావా ?"

"నీతో చాల బాధగా ఉందిరా వేణూ, ముక్కుమీద కోపం. పిలిస్తేచాలు తకీమని వస్తుంది. నాకు బజారులో ఏ వన్నా కుక్కకనిపిస్తే తెచ్చిస్తాను. దానికి నువ్వే స్వయంగా లెక్కలు నేర్పు, ఏం ?"

"ఆ దిక్కుమాలిన బజారుకుక్కలు నాకేం అక్ఖర్లేదు. నీతోకలిసి భైరవికి లెక్కలు నేర్పుతానన్నాను. వద్దన్నావు, ఊరుకున్నానుగా"

"అయితే ఒకపనిచేద్దాం, మరో కొత్తకుక్కను తెచ్చి దానికూడ భైరవిలాగే లెక్కలు నేర్పుదాం. అప్పుడు రెండు కుక్క లవుతాయి. ఒకటి నాకు, మరొకటి నీకు. ఏమంటావు?"

"కొత్తకుక్కా వద్దు, పాడూవద్దు. దాని గొడవలో పడితే వచ్చిన ఎక్కాలుకాస్తా చక్కాపోతాయి. తరువాత తీరిగ్గా కుక్కనుచూస్తూ ఏడవాలి. ఎందుకొచ్చిన రభస!"

"పోనీలే, అలాగేచేద్దాం. ఎవరన్నా అడిగితేమాత్రం భైరవికి మనమిద్దరం తర్ఫీదుఇచ్చామంటాను. బావుందా?"

"ఓ, అదిసరేగాని భైరవి మనముందు చక్కగా జవాబులు చెబుతుంది. అంతవరకు బాగానే ఉందనుకో. మరి రేపు నలుగురిముందు భయపడితే! ఎంతఅప్రతిష్ఠ!"

"నువు చెప్పింది నిజమే. అవును మరేం చేద్దామంటావ్?"

"ఏముంది, కాసేపు చదువుకుని మా ఇంటికి సారధిగాడింటికి భైరవిని తీసికెళ్ళి, వాళ్ళముందు లెక్కలు చేయిస్తే సరి. భయంకాస్తాపోతుంది"

"భలే, భలే, మంచిఆలోచన చెప్పావ్"

విశ్వం, నేను కాసేపు చదివినట్లు నటించాం. నిజానికి ఆరోజు మా ఇద్దరిలో ఎవరికీ మనసులో మనసులేదు. ఎప్పుడు భైరవిని తీసుకెళ్ళి ప్రదర్శన లిప్పిద్దామా అని తహతహలాడిపోయాం. ఒకవైపున ఆనందం. మరోవైపున భయం - ఈ రెంటినడుమ ఉక్కిరిబిక్కిరయ్యాం.

మొట్టమొదట తిన్నగా మా ఇంటికి వెళ్లాం. ఆ రోజున ఊళ్లో ఉన్న అత్తయ్యా మామయ్యా మా యింటికి వచ్చారు. రామలక్ష్మణుల్లా మా ఇద్దరినీ, వెనక భైరవిని చూసి వాళ్లు క్షణకాలం విస్మితులైనారు. మా నాన్నగారు నవ్వుతూ అన్నారు.

"చదువుకుంటానని వెళ్ళినవాడివి అప్పుడే తిరిగొచ్చావేరా వేణూ! ఓహో విశ్వంకూడ వచ్చాడే. సరి, ఆ కుక్కేమిటి? కాపలా ఉంటుందని తెచ్చారా?"

"కాదు నాన్నా, మరే, ఈ కుక్క పేరు భైరవి. చక్కగా లెక్కలు చేస్తుంది. మీకు చూపుదామని తెచ్చాం"

"ఏమిటీ! కుక్క లెక్కలు చేస్తుందా? ఆశ్చర్యంగా ఉందే." కళ్లు పెద్దవిచేసి భైరవివంక చూస్తూ అన్నాడు మామయ్య.

"నిజమేనట్రా వేణూ? ఏదీ, ఆ తమాషా చూపించు మరి" మా అత్తయ్య నవ్వుతూ అంది.

"వాడి మాటలు నమ్మావుటమ్మా, అల్లరి వెధవయి తేను" అమ్మ వ్యాఖ్యానించింది.

నేను మారుమాటలేకుండా ఇంట్లోకివెళ్ళి స్టూలు తీసుకొచ్చి అందరికీ కనపడేట్లుగా వేశాను. భైరవి ఒక్క గంతు వేసి దానిమీద కూచుంది. విశ్వం తన జాజిచెక్కలబోర్డు నుద్దముక్క వగైరా సామగ్రి సిద్ధంచేసుకోవడంలో నిమగ్నుడయ్యాడు.

"ఇప్పుడు మీరు ఓ చిన్న సర్కసు చూడబోతున్నారు జాగ్రత్తగా పరిశీలించ ప్రార్థన" నేను జంతువులకు తర్ఫీదిచ్చే వాడిలా పోజుపెట్టి అన్నాను—"ఆం, విశ్వం! ఇక ప్రారంభించు"

విశ్వం బోర్డుమీద '3' అంకెను పెద్దదిగా వేసి భైరవికి చూపించాడు. వెంటనే భైరవి మూడుసార్లు అరిచింది.

విశ్వం '3' అంకె చెరిపేసి 8 అంకె వేశాడు. భైరవి ఎనిమిదిసార్లు అరిచింది.

విశ్వం ఈసారి '10' అంకె వేశాడు. భైరవి పదిసార్లు మొరిగింది.

నాకు చటుక్కున బుర్రలో ఒక ఆలోచనకలిగింది. విశ్వాన్ని కాస్త ప్రక్కకుతప్పుకోమని చెప్పి, భైరవికి ఎదురుగా నిలబడి అన్నాను: ఇలాచూడు భైరవీ! రెండు రెళ్లెంత?"

"ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్" భైరవి బిగ్గరగా నాలుసార్లు అరిచింది. నేను వెంటనే చప్పట్లుకొట్టాను. భైరవి బుద్ధిమంతునివలె తలవంచుకుని కూచుంది.

మా సుగుణ ఒక టేనవ్వు. కూచున్న చోటునుంచి లేచి నాదగ్గరకువచ్చి "భలే భలే! సరేగాని, భైరవి కూడికలు కూడ చేస్తుందా?" అంది.

"ఓ, ఒక్క కూడిక లేమిటి? తీసివేత, హెచ్చవేత, అన్ని రకాలు చక్కగా చేస్తుంది. మరి భైరవంటే ఏమనుకున్నావ్." అని ఉన్నవీ లేనివీ కలిపికోశాను.

మానాన్న అమ్మ చాల సంతోషించారు. మామయ్య అత్తయ్య నన్ను ఎంతగానో పొగిడారు మామయ్య మా ఇద్దరికీ బహుమతిగా ఓ రూపాయి ఇచ్చాడు.

సుగుణ భైరవినిగూర్చి యింకా చెప్పమంది. మా స్కూల్లో భైరవిచేత తమాషాలు చేయిస్తామని, హెడ్మాస్టారు అందుకు అంగీకరించారని చెప్పాం

"మరి సరైనదుస్తులూ అవీ లేకుండా మామూలు గానా..."

"ఏందుస్తులు కావాలంటావ్?" అన్నాను.

"మీకు రంగు రంగుల దుస్తులు కావాలి. ఏవీ లేకుండా చేస్తే ఏం బావుంటుంది?"

"మరి మా కెవరు కుట్టిస్తారు?"

"నేను మీకు బఫ్ఫూన్లు వేసుకునే గౌనులు, టోపీలు తయారుచేసి యిస్తాలే."

"మరి భైరవికో?" విశ్వం అడిగాడు.

"భైరవికి గలగల మోగే చిరుమువ్వలుగల ఓ చక్కని మెడపట్టీ తయారుచేస్తాను. బావుంటుందికదూ?" అంది సుగుణ.

"ఓ, చాలా బావుంటుంది అచ్చం సర్కసులో కుక్కలా..."

"కబుర్లకేమిటిగాని, మనం సారథి ఇంటికి వెళదాం, పద" అన్నాను నేను.

సుగుణతో యిప్పుడే వస్తామనిచెప్పి భైరవిని తీసుకుని సారథి యింటికి వెళ్ళాం. అక్కడ కాసేపు మా విద్య ప్రదర్శించి తరువాత కిష్టాయి యింటికి, అక్కడనుంచి సుందరం ఇంటికి - ఇలా నాలుగు ఇళ్ళు చుట్టబెట్టాం. ప్రతిచోట

భైరవిని చూసి చాలా మెచ్చుకుని, దానికి తింటానికేమన్నా యిచ్చేవారు. చివరకు చక్రపాణి ఇంటికి వెళ్ళాం.

చక్రపాణి మమ్మల్ని సంతోషంగా ఆహ్వానించాడు. భైరవినిగూర్చి వివరాలు చెప్పాం. 'ఉగాదిపండుగనాడు మన స్కూల్లో ఏర్పాటుచేసే బొమ్మలకొలువు ప్రారంభోత్సవ సందర్భంలో భైరవిచేత ఓ ప్రదర్శన యిప్పించడానికి హెడ్మాస్టారు అంగీకరించా'రని తెలిపాము.

"ఇంతకీ ఇప్పుడు మా ఇంట్లో ఓ చిన్న ప్రదర్శన యిస్తారా, యివ్వరా ?" అన్నాడు.

"ఇవ్వడానికేగా వస్తా" అని విశ్వం తన సర్కసు సామగ్రి బయటికితీశాడు. భైరవిని ఓ కుర్చీమీద కూచోబెట్టాం. విశ్వంబోర్డుమీద '4' అంకె వేశాడు. భైరవి '5'సార్లు అరిచింది. ఈసారి '2' అంకె వేశాడు. అది ఒక్క సారిమాత్రమే అరచి ఊరుకుంది. హాతోస్మి. మాఆశలన్నీ నిరాశలయ్యాయి. నలుగురిముందు నగుబాటయింది. ఇక చస్తే చక్రపాణి కుక్క లెక్కలు చేస్తుందంటే నమ్మడు. పైగా మా మాటలు నీటిమీద వ్రాతలని తీసివేస్తాడు. సిగ్గుతో క్రుంగి పోతూ ఇంటిదారిపట్టాం.

ఇంటికి చేరుకోగానే విశ్వం అన్నాడు: "వేణూ, ఇది తప్పుడు జవాబు లెందుకు చెప్పింటింటూవ్ ? నలుగురూ ఎగతాళి చేస్తారు. ఎలా ?"

"శుభం పలుకరా పెళ్ళికొడకా ! ఇది అలా చేయు దని నాకు నమ్మకం ఉంది" అన్నాను ధైర్యంచెప్పుతూ.

"చూద్దాంగా:"

రేపు ఉగాది అనగా విశ్వానికి ఆరోజు ఏమీ తోచ లేదు. క్షణమైనా ఒకేచోట కూచునేవాడు కాదు. పిచ్చివాడి వలె అటూ ఇటూ పచార్లు చేస్తుండేవాడు. అంతటితో ఊరుకునేవాడా అంటే అదీ లేదు. ఇరవై నాలుగుగంటలూ భైర విని అరిపించి దాని ప్రాణం తీసేవాడు.

"దానికి కాస్త విశ్రాంతి ఇవ్వరా పాపం! రాత్రిం బవళ్లు దాని దుంప తెంచితే అది మొన్నటిలాగే మొండి కేస్తుంది." అన్నాను.

"సరేలే, అయినా నాకేదో భయం భయంగా ఉంది"

"అనవసరంగా దిగులుపడకు. మా ఇంటికి వెళ్దాం రా; ఈపాటికి సుగుణ మనకి టోపీలు తయారుచేసి ఉంటుంది."

"ఊఁ పద" అని వాడు లేచాడు

విశ్వం నేను వెళ్ళేసరికి సుగుణ టోపీలు అవీ పూర్తి చేసి, వాటివంక చూస్తూ మురిసిపోతోంది.

అన్నీ పూర్తయినట్లేనా సుగుణా ?" అని అడిగాను.

"ఓ, ఎప్పుడో తయారుచేశాను; చూపుతా నుండండి"

సుగుణ మా గౌనులు, టోపీలు, కుక్కకు మువ్వల మెడపట్టీ అన్నీ తెచ్చి మా ముందు పడేసింది. విశ్వం వాటిని చూసి పొంగిపోయాడు. మా సుగుణను తెగ మెచ్చు కున్నాడు.

"తొడుక్కుని చూద్దామా ? ఏరా వేణూ !"

నేను సరే నన్నట్లు తల తిప్పాను.

విశ్వం, నేను గబగబా వాటిని తొడుకున్నాం. మా ఇద్దరికి చక్కగా సరిపోయాయి. ముదురు నీలిరంగు గౌను

మీద మెడకిరువుగా రెక్కలార్చుతూ చుక్కల్లో పయనించే చిలుక బొమ్మ ముచ్చటగా కుట్టబడిఉంది. తరువాత అట్టతో చేసిన టోపీలు పెట్టుకున్నాం. టోపీమీద మెరిసే తళుకు కాగితం అంటించబడిఉంది. దానిమీద కూచుని శ్రద్ధగా తన యజమాని మాటలు శ్రద్ధగా వింటూన్న కుక్క బొమ్మ అంటించబడిఉంది. బొమ్మలోని యజమాని తనుగా, కుక్క భైరవిగా ఊహించుకుని విశ్వం మహా మురిసిపోయాడు. తరువాత దానికికూడ మువ్వలపట్టీ మెడకు పెట్టాం. అది తల అటూ ఇటూ త్రిప్పుతూన్నప్పుడల్లా చిరుమువ్వల మంజుల రవళి వినవచ్చేది. విశ్వం దానిని కాసేపు పరుగెత్తించాడు. దాని హుషారు చూసి మాకు ఆడుకోవాలనిపించింది. కాని బడివేళ అవుతున్నందున ఆ ప్రయత్నం మానుకున్నాం.

ఆరాత్రి ఉగాది పండుగను, బొమ్మలకొలువు విశేషాలను తలచుకుంటూ నిద్రపోయాను.

# 20

తెల్లవారింది. చల్లగా ఉగాది పండుగ వచ్చింది. వస్తూ వస్తూ కొల్లలుగా వింతలను తెచ్చింది. మసక చీకటి ఉండ గానే నిద్రలేచి, మా అరుగుమీదకు వచ్చి చూశాను. ప్రపంచమంతా అప్పుడే నిద్ర మేల్కొన్నట్లుగా ఉంది. మంచు తెరలు క్రమంగా విడిపోతున్నాయి. చల్లని ప్రభాత వీచికలు మెల్లగా వీస్తున్నాయి. దూరాన కోయిలమ్మ వసంతరాజుకు

స్వాగత గీతాలు పాడుతున్నట్లుగా కుహూ కుహూరవాలు చేస్తోంది. అప్పుడే వసంతకాలం వచ్చేసింది. ప్రతికొమ్మ ప్రతి రెమ్మ కొత్త చిగుళ్ళతో మురుస్తోంది. ఈ లోకమే ఒక ఆనంద ఉద్యానంవలె, అతిలోక సుందరమైన దివ్య సీమవలె తోచింది. ప్రతి ఇల్లు తలంట్లతో, నవ్వులతో, పిండివంటల ప్రయత్నాలతో సందడి సందడిగా ఉంది. ఇక పిల్లల ఆనందానికి అంతేలేదు. వేపపువ్వు కోసుకురావడానికి వెళ్ళేవాళ్లు, మామిడికొమ్మలు తీసుకురావడానికి పరుగెత్తేవాళ్లు తలంట్లుపోసుకుని కొత్త బట్టలు కట్టుకుని జట్లు జట్లుగా, హుషారుగా కేకలేస్తూ ఆడు కునేవాళ్ళు—ఈదృశ్యాలను చూసేసరికి నాకు పట్టరాని ఆనందం కలిగింది.

మా అమ్మ నాకు నలుగుపెట్టి తలంటిపోసింది. అమ్మ నాకు, సుగుణకు కొత్త బట్టలిచ్చింది. కట్టుకున్నాం. తరువాత నాన్నగారికి, నాకు, సుగుణకు వేపపచ్చడి పెట్టింది. తరువాత కాఫీ తాగాం. నాన్నగారు ఈనాడు అందరూ సంతోషంగా ఉండాలని, అల్లరిచేయకూడ దనీ చెప్పారు. ఎందుచేతనంటే, ఈరోజుతోనే కొత్తసంవత్స రం ప్రారంభమవుతుంది గనుక ఇవాళ ఎలావుంటే ఆ సంవత్సర మంతా అలాగే ఉంటుందట ఈ విషయం పరిశీలించి చూద్దా మనుకున్నాను.

భోజనాలయిన తర్వాత సుగుణ నేను కలసి మూడు గంటలదాకా కారమ్స్ ఆడుకున్నాం. అమ్మ మాకు ఫలహారం పెట్టింది. ఇంతలో విశ్వం రివ్వున బాణంలా వచ్చాడు. వెంట కుక్క కూడా ఉంది. వచ్చీరావడంతోటే రెక్కపుచ్చుకుని

బయల్దేరమంటూ కూచున్నాడు. నేను బట్టలుదేరబోతూంటే సుగుణకూడ వస్తానంది.

"తరువాత వద్దువుగాని సుగుణా, మాకు అక్కడ చాలాపనుంది, సరేనా" విశ్వం బుజ్జగింపుగా అన్నాడు. వప్పుకుంది.

మేము వెళ్ళేసరికి బడిలో కోలాహలంగా ఉంది. పిల్లలందరు రంగురంగుల దుస్తులు ధరించి ఉల్లాసంగా తిరుగుతున్నారు. మమ్మల్ని చూడటంతోనే గోలచేస్తూ మాచుట్టూ మూగారు. వాళ్ళని తప్పించుకుని వేదిక చేరుకునేసరికి తల ప్రాణం తోకకొచ్చింది.

సభాకార్యక్రమం ప్రారంభమైంది. మొదట హెడ్మాస్టారు ఈ బొమ్మలకొలువు ఏర్పాటు చేయడంలోగల ఉద్దేశ్యాన్ని వివరించారు. తరువాత విశాలరావు మాస్టారు మాట్లాడారు: "భారతీయ సంస్కృతి, సాంప్రదాయాలకు చిహ్నమైన పర్వదినములను మనం యీనాడు చిన్నచూపుగా చూడటం జరుగుతోంది: దానివలన ఎన్నో దుష్పరిణామాలు కల్గుతున్నాయి. భావితరాలవారికి సౌశీల్యము, చక్కని క్రమశిక్షణ, మన ప్రాచీన ఆచార సాంప్రదాయముల యెడల భక్తి కలుగునట్లు చేయడం అవసరమనే భావంతో ఈ బొమ్మల కొలువును ఏర్పాటుచేయడం జరిగింది. పిల్లలకు సహజమైన శక్తియుక్తులను అభివృద్ధిపరచి, వారి జీవితాలను రాణింపచేయడం పెద్దవారి బాధ్యత ఈ బొమ్మలకొలువును అలంకరించిన మన బడి విద్యార్థుల చిత్రాలను చూస్తుంటే ఎంతో

ఆనందంగావుంది. ప్రతి సంవత్సరం ఇలాంటి ప్రదర్శనలు ఏర్పాటుచేయాలనే సంకల్పం మరింత బలపడింది. మరొక ముఖ్యవిషయం. ఇప్పుడు మనస్కూలు విద్యార్థులైన చిరంజీవి వేణు, విశ్వం కలసి తాము తర్ఫీదిచ్చిన 'భైరవి' అనే కుక్క చేత కొన్ని తమాషాలు చేయిస్తారు. శ్రద్ధగాచూసి ఆనందించ వలసిందిగా కోరుతూ సెలవుతీసుకుంటున్నాను.

విశాలరావు మాస్టారు మావద్దకువచ్చి సిద్ధంగాఉండ మని హెచ్చరించారు. మేము గబగబా మాదుస్తులను తొడు క్కున్నాం. భైరవికూడ మెడలో మువ్వల మెడపట్టీ కట్టాం. విశ్వం తన దుస్తులవైపు, నావైపు, భైరవివైపుచూసి సగర్వం గానవ్వాడు.

ఇంతలో విశాలరావు మాస్టారు వచ్చి తెర ఎత్తమం టారా అని అడిగారు. మేము సరే నన్నట్లుగా తలతిప్పాం. కిరకిర శబ్దం చేసుకుంటూ తెరలేచింది.

విశ్వం, నేను భైరవితో బాటు వేదికమీదికి వెళ్ళాం. రెండుసార్లు అటూ ఇటూ మాదుస్తులను చూసుకుంటూ, భైరవిని హెచ్చరిస్తూ తిరిగాం. తరువాత మేమిద్దరం ప్రేక్షక మహాశయులందరికీ నమస్కరించాం. కుక్కకూడ వెనుక కాళ్ళ మీదనిలబడి అందరికీ సలాంచేసింది. ప్రేక్షకులంతా సంతోషం తో చప్పట్లు చరిచారు.

నేను ఓ స్టూలు తెచ్చి వేదికమధ్యగా వేశాను. కుక్క ఒక్కగంతువేసి దానిమీద కూచుంది. విశ్వం ప్రేక్షకులవైపు తిరిగి రాత్రి బట్టీపెట్టిన ఉపన్యాసాన్ని మొదలెట్టాడు. "గురు వర్యులకు, మిత్రులకు నమస్కారములు. నేడు ఉగాది. మనకు

పండుగరోజు. ఈ శుభసమయంలో మీకు 'కుక్క'ని పరిచయం చేయుటకు గర్విస్తున్నాను. కుక్క సామాన్యమైనకుక్క కాదు. లెక్కలబుర్రకలది. ఎలాంటి చిక్కు లెక్కనైనా నిముషాలలో చేయగలదు. ఈసందర్భంలో నాకు తోడ్పడిన వేణుకు ధన్యవాదాలర్పిస్తున్నాను. మిత్రులకొకమనవి. దీనికి ఇదే మొదటి బహిరంగ ప్రదర్శన కనుక, దయచేసి నిశ్శబ్దంగా ఉండమని కోరుతున్నాం.

కుక్కసంగతి ఎలాఉందోగాని నాకుమట్టుకు వేదిక మీదకు వెళ్ళగానే కాళ్లువణికాయి. విశ్వం ఉపన్యాసాంతంలో కాస్త తడబడ్డాడు. నన్ను మాట్లాడమంటారేమోనని భయపడ్డాను కాని ఆ ప్రమాదం రాలేదు.

విశ్వం ఒకసారి కుక్కవళ్ళంతా నిమిరి ఓ పాలకోవా ముక్క నోట్లో తురిమాడు.

నేను జేబులోంచి '3' కొయ్యముక్కలుతీసి అందరికీ కనపడేట్లుగా కుక్కముందు ఉంచాను. "భైరవీ, ఆ కొయ్యముక్కల వంకచూడు" విశ్వం ఓసారి కుక్కవంక, మరోసారి ప్రేక్షకులవంక చూస్తూ అన్నాడు:

"ఊఁ లెక్కించు"

"ఉఫ్, ఉఫ్, ఉఫ్" కుక్క బిగ్గరగాఅరిచింది.

పిల్లలందరూ పెద్దగా చప్పట్లుకొట్టారు. దాంతో కుక్క భయంవేసి స్టూలుపైనుంచిదూకిపారిపోయేప్రయత్నం చేసింది. విశ్వం కుక్కని పట్టుకొచ్చి, దానికో పాలకోవాముక్క ఇచ్చాడు.

ఈ సమయంలోనే నేను మరో కొయ్యముక్కను అందరికీ కనపడేలాతీసి కుక్కముందుంచి అన్నాను "భైరవీ, ఇప్పుడెన్ని కొయ్యముక్కలున్నాయో లెక్కించు"

కుక్క పూర్వస్థాయిలోనే నాలుగుసార్లు అరిచింది.

నేను మరి మూడు కొయ్యముక్కలను కుక్కముందుంచాను. "భైరవీ, ఈసారి ఎన్నున్నాయో చెప్పు?" కుక్క ఏడుసార్లు అరిచింది.

ఓ ఐదునిముషాలసేపు విశ్రాంతి. నేను జాజిచెక్కల బోర్డు తీసుకుని దానిమీద '2' అంకెను పెద్దదిగా వేసి ప్రేక్షకులందరికీచూపి, తరువాత కుక్కముందు పెట్టాను.

"ఊఁ, భైరవీ ఆ బోర్డుమీది అంకె ఎంతో చెప్పు"

"ఉఫ్, ఉఫ్" కుక్క జవాబిచ్చింది.

నేను '2' అంకె చెరిపేసి '5' అంకె వేశాను. కుక్క ఐదుసార్లు అరిచింది.

ఈ తమాషా అయినతర్వాత నేను వేదిక ప్రక్కగా వెళ్ళి నిలబడ్డాను. విశ్వం, తను కొన్ని తమాషాలు చేస్తానన్నాడు. కుక్క దగ్గరకు వెళ్ళి అందరకు వినపడేలాఅన్నాడు:

"రెండు రెళ్ళెంత ?"

"ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్" కుక్క అరిచింది.

"శభాష్ భైరవీ ! మరి మూడుకి నాలుగు కలిపితే."

"ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్, ఉఫ్" కుక్క ఏడుసార్లు అరిచింది. ఇలా కూడిక; తీసివేత లెక్కలు చెప్పించాం. కుక్క సరైన జవాబులే చెప్పింది. ప్రతిసారి ప్రేక్షకులు బ్రహ్మాండంగా చప్పట్లు కొట్టేవారు.

కాని కుక్క మరి పారిపోవడానికి ప్రయత్నించ లేదు. బహుశః అలవాటయివుంటుంది.

నేను మరో కొత్త తమాషా చేయాలనుకున్నాను. ప్రేక్షకమహాశయులకు నమస్కరిస్తూ అన్నాను: "ఇది, చిన్న చిన్న లెక్కలనుకూడ చేస్తుంది. కావలిస్తే ఎవరయినా లేచి ఒక లెక్క యివ్వవచ్చు."

మొదట ఎవరూ ధైర్యం చేయలేదు. చివరకు మా సారథిగాడు లేచి అన్నాడు: "నే నొక లెక్క ఇస్తాను. చెప్ప మంటారా ?"

నేను సిద్ధమే నన్నట్లుగా తల త్రిప్పాను.

"ఆ లెక్క యిది. ఒక పుస్తకం, పెన్సిలు ఖరీదు 10 అణాలు. పుస్తకం ఖరీదు పెన్సిలు ఖరీదుకంటె 8 అణా లెక్కువ అయిన పుస్తకం ఖరీదెంత ?, పెన్సిలు ఖరీదెంత ?"

"ఇదుగో భైరవీ, లెక్కను జాగ్రత్తగా విన్నావు కదూ ! బాగా ఆలోచించి జవాబు చెప్పు. తొందర లేదులే, ఏం?" అన్నానుగాని ఈ లెక్కను గురించి నేనే ఆలోచనపడ్డాను. వెధవది ఈ లెక్కకుకూడ పెద్ద ఆలోచనే ! పుస్తకంఖరీదు 8 అణాలు, పెన్సిలు ఖరీదు 2 అణాలు. మొత్తం 10 అణాలు, సరిపోయింది.

"ఊఁ, భైరవీ. జవాబు చెప్పాలి. పెన్సిలు ఖరీదెంత?"

"ఉఫ్, ఉఫ్" కుక్క రెండుసార్లు అరిచింది.

"మరి పుస్తకం ఖరీదు ?"

కుక్క ఎనిమిది సార్లు మొరిగింది.

"తప్పు...తప్పు. కుక్క తప్పుజవాబు చెప్పింది." పిల్లలందరు గల్లంతుగా అరిచారు.

"ఏంతప్పో చెప్పండి. పుస్తకం, పెన్సిలు కలిసి 10 అణాలయితే - అందులో పుస్తకం ఖరీదు 8 అణాలు, పెన్సిలుఖరీదు 2అణాలు...మొత్తం 10అణాలు. ఇదితప్పంటావా?"

సారథిలేచి అన్నాడు: "లెక్కలో పెన్సిలుఖరీదు కంటె పుస్తకం ఖరీదు 8 అణాలు ఎక్కువని వుంది. నీలెక్క ప్రకారం పెన్సిలు ఖరీదు 2 అణాలు అయితే పుస్తకంఖరీదు 10 అణాలు కావాలి, కాని వీటి రెండిటి ఖరీదుకలిసి 10 అణాలేకదా! ఏమంటావు?"

నాతప్పును గ్రహించాను.

"విన్నావా భైరవీ, నువు లెక్క తప్పుచేశావు, ఈసారి జాగ్రత్తగా ఆలోచించి చెప్పాలి, తెలిసిందా?"

కుక్క నిశ్చలంగా ప్రేక్షకుల వంకచూస్తూ కూచుంది. నా బుర్రలోమట్టుకు ఈ లెక్కనుగురించిన ఆలోచన తర్జన భర్జన జోరుగా సాగుతోంది. కుక్క తప్పటడుగు వేస్తుందేమోనని భయపడ్డాను.

రెండు నిముషాలు గడిచాయి. ప్రేక్షకుల్లో కొద్దిగా కలకలం ప్రారంభమైంది.

"ఒకనిముషంసేపు ఓపికపట్టమని మనవి. కుక్క ఆలోచించుకోవాలి"

"తొందరేమీలేదు, తీరిగ్గా ఆలోచించుకోనీయ్. ఎంతైనా కుక్కగా పాప..." ఓ డజనుకంఠాలు ఏకకాలంలో అన్నాయి.

మళ్ళీనేను ఆలోచనలోపడ్డాను. కుక్క వంక చూస్తున్నట్లుగా నటిస్తూ ఆలోచించసాగాను "పుస్తకం ఖరీదు, పెన్సిలు ఖరీదుకంటె 8అణాలు ఎక్కువ బాగానేఉంది. అంటే పెన్సిలు ఖరీదు 2అణాలుఅయితే, పుస్తకంఖరీదు 10అణాలుకావాలి. కలిపితే 12అణాలువస్తున్నాయి. లెక్కలోయిచ్చింది రెండిటి ఖరీదుకలిపి 10అణాలనేగా! ఎలాచేయటం? ఏమీతోచలేదు.

ప్రేక్షకుల్లో ధ్యాసహెచ్చింది. గుసగుసలు, వెక్కిరింపు చేష్టలు ఎక్కువయ్యాయి.

"ఇంకో రెండునిమిషాలు టైమివ్వప్రార్థన. భైరవి ఆలోచించడం ఇంకా పూర్తికాలేదు."

"అలాగే, రెండునిమిషాలేంకర్మ. కావలిస్తే మరో రెండునిమిషాలుతీసుకోవచ్చు. పాపం ఎంతైనా నోరులేని కుక్క..." ప్రేక్షకులనుండి భైరవినిగురించి సానుభూతి వాక్యాలు వచ్చాయి.

నాకు చెప్పలేనిదిగులు పట్టుకుంది. ఈ గండంగడిచి ఎలాబైటపడతామా అనిఆలోచించసాగాను. విశ్వం ఏమన్నా సహాయం చేస్తాడేమోనని వాడివంక దీనంగాచూచాను. వాడు చిరునవ్వునవ్వి వూరుకున్నాడు. వాడినవ్వు చూసేసరికి నాకు కాస్త ధైర్యం వచ్చింది.

రెండునిమిషాలు గడిచాయి. నేనుధైర్యంచేసి భైరవితో అన్నాను: "ఊఁ, భైరవీ. ఇప్పుడుచెప్పు- అందరు నిశ్శబ్దంగా ఉండవలసిందిగా కోరుతున్నాను"

ప్రతివాడు మాటల్లేకుండా చెవులురిక్కించుకుని ఆసక్తితో భైరవివైపు చూస్తున్నారు.

"ఇలా చూడు భైరవీ, పెన్సిలుఖరీదెంతో చెప్పు" నేను ఇలా అంటూండగానే విశ్వం భైరవికి దగ్గరగావచ్చి దాన్ని ఆప్యాయంగాపిలిచాడు. భైరవి విశ్వంవైపు చూసింది. విశ్వం ఒకసారి తలగోక్కున్నాడుగాని ఏమీమాట్లాడలేదు

"భైరవీ, త్వరగా చెప్పాలి" నేను భైరవివంక ఆదుర్దాగా చూస్తూఅన్నాను.

"ఉఫ్" భైరవి బిగ్గరగా ఒక్కసారి మొరిగింది.

పిల్లలందరు పెద్దగాచప్పట్లుచరిచారు.

"గోలచేయవద్దని మనవి. భైరవీ, మరి పుస్తకంఖరీదెంతో చెప్పాలి"

విశ్వం భైరవినమెల్లగాపిలిచాడు. అది విశ్వంవంక చూచింది. విశ్వం చేతివేళ్ళనుతమాషాగా తిప్పాడు. తరువాత దూరంగా వెళ్ళి నిల్చున్నాడు.

"ఊఁ, భైరవీ, పుస్తకంఖరీదెంతో చెప్పు త్వరగా..."

"ఉఫ్, ఉఫ్" అని—భైరవి బిగ్గరగా తొమ్మిదిసార్లు అరిచింది.

పిల్లలందరు దీర్ఘంగా హర్షధ్వానాలు చేశారు. ప్రతివారు వచ్చి మమ్మల్ని, భైరవిని అభినందించి వెళ్ళారు. హెడ్మాస్టారు, విశాలరావుమాస్టారు మమ్మల్ని ఎంతగానోపొగిడారు. నిజానికి ఆరోజునకలిగిన ఆనందం నాకుఇంతకుపూర్వం ఎప్పుడూ కలుగలేదు. హెడ్మాస్టారు మాకు స్కూలుతరఫున ఓ వెండి కప్పు బహూకరింప నిశ్చయించామని ప్రకటించారు.

దారిలో విశ్వాన్ని, భైరవి లెక్కఎలా చేయగలిగిందో చెప్పమన్నాను. విశ్వం నాభుజంపట్టుకుని చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"అయితే విను. సారథిఇచ్చినలెక్క చూడటానికి తేలికగాకన్పించినా కొద్దిగాకష్టమైనదే. మనిషిని గాభరాపెడుతుంది. అటువంటిలెక్కలుచేయడానికి సమయస్ఫూర్తికావాలి. నువ్వు ఆ లెక్కను త్వరగాచేయలేవని నాకుతెలుసు. అందుకే నేను ఆ లెక్క ఆన్సరును భైరవిదగ్గరకువచ్చిసైగచేశాను. మరి నేను భైరవివంకచూస్తూ తలగోక్కున్నానంటే అర్థంఏమిటో తెలుసా? ఒక్కసారిమాత్రం 'ఉఫ్' అనవలసిందని సైగద్వారా చెప్పడం. హుఁ, విశ్వమంటే ఏమనుకున్నావ్!"

నేను విశ్వంజవాబుకు ఆశ్చర్యపోయాను. వాడు నాకు భైరవికి నేర్పిన కొన్నిసైగలనుగూర్చి చెప్పాడు. మరింత ఆశ్చర్యపోయాను.

భైరవి మొదటి బహిరంగ ప్రదర్శనం జయప్రదంగా ముగిసింది.

## 21

ఉగాది పండుగ తరువాత శని, ఆదివారాలు రావడం వల్ల మాకు రెండురోజులు సెలవులు వచ్చాయి. సోమవారం నాడు తెలుగు మేస్టారు మాచేత కాంపోజిషన్ వ్రాయించాడు. విశ్వానికి దాంట్లో 30 మార్కులు వచ్చాయి. ఇక వాడి ఆనందానికి అంతులేదు. ఏదో పెద్ద ఘనకార్యం సాధించిన వాడిలాసంతృప్తి పడసాగాడు.

"ఓశ్, దీనికే ఇంత సంబరపడుతున్నావు. 30మార్కులు రావడం గొప్ప ఏమిటి?" అన్నాను.

"నాకు తెలుసురా వేణూ. కాని నాకు తెలుగులో 30 మార్కులు రావడం ఇదే మొదటిసారి. హుఁ, ఇంతటితో తృప్తిపడి ఊరుకుంటున్నావు కాబోలు. వచ్చేసారి 40మార్కులు రాకపోతే చూడు—"అన్నాడు విశ్వం ధీమాగా.

"మంచిదేగా" చక్రపాణి భుజం తడుతూ అన్నాడు— "నీవు 40 మార్కులు తెచ్చుకోడానికి కృషిచేయాల్సిందే. అప్పుడు మన క్లాసులో 30 మార్కులు వచ్చేవాళ్లు ఎవరూ ఉండరు"

"ఓ, నువ్వే చూస్తావుగా! మన క్లాసు గౌరవం నిలబెడతాను."

విశాలరావు మాస్టారు విశ్వాన్ని పిలిచి అభినందించారు కష్టపడి కృషిచేస్తే ఇంకా మంచిమార్కులు సంపాదించడానికి అవకాశం ఉందనిచెప్పి "మీరు చదువుతో బాటు ఇతర విజ్ఞాన కార్యక్రమాల్లో కూడా పాల్గొనాలి..." అన్నారు.

"ఓ అలాగేనండి" విశ్వం జవాబిచ్చాడు- "మాకు వార్తపత్రికలో పాల్గొనాలని ఉంది మాస్టారూ!"

"ఊఁ హూఁ, మీరిప్పుడప్పుడే వార్తపత్రిక జోలికి పోవద్దు. దానికి కావలసినవారు వేరే ఉన్నారు. మీకు మరో మంచిపని చెపుతాను, శ్రద్ధగాచేస్తారా?"

"తప్పకుండా"

"అయితే మీరిద్దరు కలిసి ప్రత్యేకంగా మీ సెక్షను కొక గ్రంథాలయం నిర్వహించండి..."

"మరి పుస్తకాలు?"

"పుస్తకాలేమిటి? మన స్కూలు గ్రంథాలయంనుంచి కొన్ని పుస్తకాలిచ్చే ఏర్పాటుచేస్తాను, సరేనా?"

మేము అంగీకరించాం.

"మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. పుస్తకాలను ఎప్పుడూ చక్కగా, చూడ ముచ్చట వేసేట్లుగా ఉంచాలి. మీ రిప్పుడే వెళ్ళి పుస్తకాలు తీసుకోండి."

మేము స్కూలుగ్రంథాలయోద్యోగివద్దకువెళ్ళి మా క్లాసుకు కావలసిన పుస్తకాలు ఇవ్వమని అడిగాం.

"మీ పేర్లేమిటి? వేణు, విశ్వం - అవునా? విశాలరావు మాస్టారు మీ విషయం చెప్పారు. పుస్తకాలు ఇప్పుడే తీసుకు వెళ్తారా?"

"ఇప్పుడే తీసుకువెళ్తామండీ. ఈ సాయంత్రానికి అన్నిం టినీ ఒక వరుసలో సర్దుకుంటే రేపు పుస్తకాలు ఇవ్వడానికి వీలుంటుంది" అన్నాము.

"మంచిది, అలాగే" అని ఆయన మాకు ఒకచిన్న బీరువా, వందపుస్తకాలు యిచ్చారు. వాటిని మాక్లాసుకు చేరవేయడానికి ఓ అరగంట పట్టింది. తరువాత మేము పుస్తకా లన్నింటినీ వరుసప్రకారం పెట్టాం. ఇంతాజేస్తే పుస్తకాలు బీరువాలో రెండు అరలకు మాత్రమే సరిపోయాయి

"ఈ అరను నింపడం ఎలారా వేణూ, నాకేం తోచడంలేదు" అన్నాడు విశ్వం.

"బావుంది. దానికి మన మేం జేస్తాం. మళ్ళీ గ్రంథా లయంనుండి ఏమన్నా పుస్తకాలిస్తే తెద్దాంలే" అన్నాన్నేను.

"నేనో అరడజను పుస్తకాలు తీసుకురాగలను. మా ఇంట్లో పాత పుస్తకాలు చాలా వున్నాయి" అన్నాడు విశ్వం.

"ఆమాత్రం నేనూ తెస్తాను. కాని ఏం ప్రయోజనం? ఒక అర నింపడం మాటుగా?"

"పోనీ మన క్లాసువాళ్ళందరినీ తలా ఒకటో, రెండో పుస్తకా లివ్వమంటే......"

"ఓ, మహారాజులా. ఇస్తే తీసుకుంటానికి అభ్యంతరం ఏముంది?"

"విశాలరావుమాస్టారిని అడిగిచూద్దాం ఏమంటారో?"

"సరే పద, వెళ్దాం. ఆ ముచ్చటా తీరిపోతుంది."

మేము విశాలరావు మాస్టారితో మా కార్యక్రమం చెప్పాం.

"బావుంది. మన క్లాసువాళ్ళందరు తప్పకుండా ఇస్తారని నా నమ్మకం" అన్నారు మాస్టారు.

మరునాడు మేము క్లాసులో అందరికీ గ్రంథాలయాన్ని గూర్చి తెలియజేశాం. పుస్తకాలు కొద్దిగానే ఉన్నాయనీ, క్లాసు అవసరాలకు చాలవనీ, మిత్రులవద్ద చదివిన పుస్తకాలుంటే గ్రంథాలయాని కివ్వవలసిందిగా విజ్ఞప్తిచేశాం. ప్రతివాడు ఒకటో, రెండో పుస్తకాలు ఇస్తామని వాగ్దానం చేశారు. రెండురోజుల్లోనే ఖాళీగావున్న అర కూడ నిండిపోయింది. పుస్తకాలు ఇంటికి యిచ్చేందుకు అనుమతి యివ్వవలసిందిగా విశాలరావు మాస్టారిని అడిగాం మొట్టమొదట పుస్తకాల జాబితా ఒకదాన్ని తయారు చేయమని చెప్పారు. ఓ నోటు పుస్తకంలో గ్రంథంపేరు,

గ్రంథకర్త నామం, వరుస సంఖ్య అన్నీ వేశాం. తరువాత ప్రతివాడికి ఒక్కొక్క పుస్తకం చొప్పున ఇచ్చాం. ఈ జాబితా చూస్తే, ఏ పుస్తకం ఎక్కడఉన్నదీ ఇట్టే తెలిసిపోయేది.

విశ్వం గ్రంథాలయాన్ని చూసి మురిసిపోయేవాడు. అప్పుడప్పుడూ నాతో అంటూండేవాడు— "చూడు వేణూ, బీరువానిండా పుస్తకాలు ఎంత చక్కగా ఉన్నాయో! గ్రంథాలయమంటే ఇలా వుండాలి" నేను చిరునవ్వు నవ్వి ఊరుకునే వాణ్ణి

మేము ప్రతిరోజు పుస్తకాలను పరీక్షిస్తూండేవాళ్ళం. గ్రంథాలయానికి బహూకరించినవాటిల్లో చాలభాగం పాతవి. అక్కడక్కడా పేజీలు ఎగిరిపోయిన బాపతుకూడ వున్నాయి. ఇక అట్టల సంగతి చెప్పనక్కర్లేదు. ఇలాంటివాటిని ఏం చేయాలని ఆలోచించాం.

"ఇంటికి తీసుకువెళ్ళి, అట్టలు వేస్తేనో..." అన్నాను.

"ఓ, అలాగే చేద్దాం." అన్నాడు విశ్వం.

ఇలా అనుకుని సాయంకాలం కొన్ని పుస్తకాలకు అట్టలు వేయాలని నిశ్చయించుకున్నాం. బడి వదలగానే మా ఇంటికి వెళ్ళి అట్టలు వేసే కార్యక్రమం ప్రారంభించాం. ఇంతలో మా సుగుణవచ్చి, తనుకూడ మా పనిలో సహాయం చేస్తానని చెప్పింది.

అట్టలు వేయడం మాకు చెడ్డ చిరాకు కలిగించిందనే చెప్పాలి. విశ్వం ఇది ముసలివాళ్లు చేసే పనని గొణిగేవాడు.

"హుఁ, ఈపుస్తకం చూడు, ఎలావుందో! ఏ కాగితాని కా కాగితం ఊడివస్తోంది. చదివేవాళ్ళకి బుద్ధిఉండాలి.

పుస్తకాన్ని జాగ్రత్తగా చూచుకోవాలని తెలియదు కాబోలు..."

"తెలిస్తే అలాంటి పనులు చేస్తారా?" అంది సుగుణ.

"ఆహాఁ, తప్పక చేస్తారు. ఈ పుస్తకం చూడు. దీని మీద ఏ వెధవో ఆరుకాళ్ళకుక్క-బొమ్మ వేశాడు."

'ఆరుకాళ్ళ కుక్కేమిటి? కుక్కకు ఎక్కడన్నా ఆరుకాళ్ళు ఉంటాయా? ఆ వేసినవాణ్ని తక్షణం పిచ్చాసుపత్రికి పంపడం ఉత్తమం" అని సుగుణ సలహా యిచ్చింది.

"నేను కుక్క కాళ్ళను, పేర్లను గురించి మాట్లాడటం లేదు. ఇలా పుస్తకం మీద అడ్డమైన బొమ్మలువేసి ఖరాబు చేయడం తప్పా కాదా?" అన్నాడు విశ్వం.

"తప్పు, శుద్ధతప్పు." నేను, సుగుణ ఒకేసారి అన్నాం.

విశ్వం రబ్బరు తీసుకొని బొమ్మను చెరిపేయాలని చూశాడు, కాని సాధ్యపడలేదు. బొమ్మ చెరిగిపోవడం మాట అటుంచి అంతమేర కాగితం చిల్లిపడింది.

"బుద్ధిలేకపోతేసరి, వెధవబొమ్మలూ వీళ్ళూను. ఏం చేద్దామంటావురా వేణూ? పుస్తకాలమీద ఇటువంటిరకాన్ని హెచ్చరిస్తూ వ్రాద్దామంటావా? ఇకముందైనా జాగ్రత్తగా ఉంటారు" అన్నాడు.

"ఏం వ్రాద్దామంటావ్? నాకేం తోచడంలేదురా" అన్నాను.

"'పుస్తకాలను జాగ్రత్తగా చూడండి. అవి యినుము తో తయారుకాలేదు' అని వ్రాద్దాం. ఏమంటావురా వేణూ?" అంది సుగుణ.

"ఫర్వాలేదు, కాని పుస్తకాలు యినుముతో తయారు కావని ప్రతివాడికీ తెలుసు. ఇలావినండి: పుస్తకములను మీ కనుపాపలవలె చూడండి: అది వ్రాస్తే బావుంటుందను కుంటాను" అన్నాడు విశ్వం

"ప్చ్, నాకేమీ నచ్చలేదు. పుస్తకానికి కంటిపాపకీ సంబంధంలేదు." విశ్వంవైపు చూస్తూ అన్నాను.

"పోనీ ఇలా వ్రాస్తేనో:- 'పుస్తకములను ప్రాణప్రదంగా చూడండి. అవి విలువ గలవి" అన్నాడు విశ్వం మళ్ళీ.

"నా అభిప్రాయం చెబుతాను. మీకు నచ్చితే అలాగే చేద్దాం—పుస్తకాలు మనస్నేహితులు, వాటిని జాగ్రత్తగా చూడండి— ఎలావుంది ?" అన్నది సుగుణ

' బావుంది. పుస్తకాలు నిజంగా మన ప్రాణ స్నేహితులు. కారణం అవి మనకు జీవితాదర్శాన్ని తెలుపుతాయి. ఏమంటావురా విశ్వం ? "

విశ్వం తన కిష్టమే నన్నట్లు సూచించాడు.

మరుసటి రోజు మేము పుస్తకాల బీరువాప్రక్కగా 'పుస్తకములు మనస్నేహితులు, వాటిని జాగ్రత్తగా-చూడండి' అని పెద్ద అక్షరాలతో వ్రాసిన కాగితాన్ని అంటించాం. విశ్వం పుస్తకం యివ్వబోయే ముందు ప్రతివాడికి ఓ అరగంటసేపు - పుస్తకములనుగురించి, పుస్తకములను జాగ్రత్త చేయవలసిన అవసరాన్ని గురించి హితబోధ చేసిగాని వదిలేవాడు కాదు.

గ్రంథాలయం విషయంలో విశ్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవాడు. ఈ ఉద్యోగం స్వీకరించిన తరువాత వాడిలో

చాలా మార్పులు వచ్చాయి. ఎప్పుడూ మల్లిపూవులా శుభ్రంగా ఉండేవాడు. మాటలు కూడా పూర్వంలా కాకుండా నెమ్మదిగా, నవ్వుతూ, మితంగా మాట్లాడేవాడు. కోపం కూడా తగ్గిపోయింది. ప్రతి పని చక్కగా, క్రమబద్ధంగా చేసేవాడు. గ్రంథాలయంలోని ప్రతి పుస్తకాన్ని చదివేవాడు. పోనీ అంతటితో వూరుకుంటాడా అంటే అదీ లేదు. ఆ పుస్తకంలోని విషయాన్ని గూర్చి వ్యాఖ్యలు, విమర్శలకు దిగేవాడు. విశ్వంలోని ఈ మార్పుకు నేను చాల ఆశ్చర్యపడ్డాను.

ఎవరయినా పుస్తకాన్ని జాగ్రత్తగా వుంచినా లేక సకాలంలో యివ్వకపోయినా వూరుకునేవాడు కాదు. పుస్తకం తెచ్చి యిచ్చేదాకా వాడి ప్రాణాలు తీసేవాడు.

ఇంతవరకు బాగానేవుంది కాని కొన్నాళ్ళనుంచి మరో కొత్త తతంగం ప్రారంభించాడు. పుస్తకం చదివి తెచ్చినవాడి నల్లా, పుస్తకంలోని విషయాలను చెప్పమని వేధించేవాడు. వారు గనుక ఏ ధ్యాసలోవుండో సక్రమంగా జవాబు చెప్పక పోతే వారికి కొత్త పుస్తకం యిచ్చేవాడుకాదు. ఆ పుస్తకాన్నే పూర్తిగా చదివి తీసుకురమ్మనేవాడు. గ్రంథాలయోద్యోగి బాధ్యత కేవలం పుస్తకాలు ఇవ్వడం మాత్రమేకాదనీ వాటిని తీసుకున్నవాడు చక్కగా చదివాడో లేదో తెలుసుకోవడంకూడ అతని బాధ్యతఅనీ చేప్పేవాడు.

ఇదంతా యిలా ఉంటే ఇంకో కొత్త విధానం ప్రతిపాదించాడు. పిల్లల ప్రాణాలు తీయడానికి పుస్తకం చదివిన ప్రతివారు ఆ పుస్తకాన్నిగూర్చి చిన్న సమీక్ష వ్రాయాలి.

దాన్ని వ్రాత పత్రికలో ప్రకటిస్తాట్ట. ఈ విధానంవల్ల చాలా ఉపయోగం ఉందని చదువరులకు విమర్శనాశక్తి, రచనా విధానం అలవడటమేకాకుండా, తోటివారుకూడ ఆ పుస్తకం మీద ఆసక్తి కలిగి చదువుతారని సమర్థించేవాడు.

ఈ విధానం సత్ఫలితాలనే ఇచ్చిందని చెప్పాలి. మా క్లాసులో ప్రతివాడు తను చదివిన పుస్తకానికి చిన్న చిన్న సమీక్షలు వ్రాయడం ప్రారంభించాము. వ్రాతపత్రిక అంతా యీ సమీక్షలను ప్రచురించడానికే సరిపోయేది. అందుకని ప్రత్యేకంగా ఈ సమీక్షలకోసం 'విద్యార్థి సమీక్ష' అనే యింకో వ్రాతి పత్రికను ప్రారంభించాం. ఇప్పుడు మా క్లాసు వాళ్లు సమీక్షలేకాకుండా వ్యాసాలు, కథలు, నాటికలు వగైరా వ్రాయడం అలవర్చుకున్నారు.

ఈ పత్రికను మా క్లాసువాళ్లు మాత్రమే కాకుండా ఇతర తరగతులవాళ్లు కూడ శ్రద్ధగా చదువసాగారు. ఇలా ఇతర క్లాసులవాళ్ళు మా పత్రికను అమితాసక్తితో చదవడం, అభినందిస్తూ లేఖలు వ్రాయడం మాకు ఆనందదాయకం మాత్రమేగాక గర్వకారణమైంది.

## 22

విశ్వం తెలుగులో బాగా కృషిచేశాడు. ఇప్పుడు వాణ్ని ప్రశ్నించడం భయం, తకీమస జవాబు వచ్చేది. క్లాసు పుస్తకాలేగాక ప్రసిద్ధాంధ్రకవులరచనలుకూడ చదువసాగాడు. గ్రంథాలయాన్ని ప్రశస్తంగా నడపడంవల్ల క్లాసులో మా గౌరవం హెచ్చింది. విశ్వానికి బాస్కెట్ బాల్ ఆడేందుకు అవకాశమివ్వడమే కాకుండా, డ్రిల్లు మాస్టారు వాణ్ని మా జట్టుకు కెప్టెన్ గాచేశారు. వాడి నాయకత్వం క్రింద మేము స్కూలు ఛాంపియన్ షిప్ సాధించాం. క్లాసు వ్రాతపత్రికలో కూడ మాగురించి ప్రశంసలు పడసాగాయి.

ఎంతకృషిచేసినా విశ్వానికి తెలుగులో 30 మార్కులకు మించి వచ్చేవికావు. దాంతో వాడు నీరసించిపోయాడు. ఎప్పుడూ దిగులుతో అదోలా ఉండేవాడు. ఒకరోజున చక్రపాణితో తన దిగులు వెలిబుచ్చాడు.

"అలా నిరాశ పడకోయ్. త్వరలో నీకు 40 మార్కులు వస్తాయిలే..."

"నాకు ఆ నమ్మకం పూర్తిగా పోయిందిరా చక్రపాణీ. నేను గ్రంథాలయాన్ని నడుపుతున్నానా, మన క్లాసు బాస్కెట్ బాల్ టీముకు నాయకుణ్ణికదా; నాకు 30 మార్కులు వస్తుంటే ఎలావుంటుంది చెప్పు? తెలుగు మేష్టారికి నేనంటే కోపం లేదంటావా?"

"అలాంటి మాటలు అనకురా. తెలుగు మాష్టారి విషయం నీకుమాత్రం తెలియదూ? వారలా యెన్నటికీ కోపగించుకోరు."

ఈ తతంగం జరిగిన నాలుగు వారాల తరువాత విశ్వా నికి క్లాసు పరీక్షలో 40 మార్కులు వచ్చాయి. వాడి ఆనం దానికి అంతులేదు. ప్రతివాడితోను తన మార్కులను గురించి సగర్వంగా చెప్పుకున్నాడు

రేపు సంవత్సరపు పరీక్షలనగా మేము టీపార్టీ చేసు కున్నాం. మా క్లాసు గదినంతా చక్కగా అలంకరించారు. ప్రతివాడు ముచ్చటగా ముస్తాబై వచ్చాడు కాని ముఖాల్లో సంతోషచిహ్నాలు లేవు. అవునుమరి, ఎలాఉంటాయి? సంవత్స రమంతా సోదరులవలె కలసిమెలసి ఆడిపాడినవాళ్ళం. పరీక్ష లైనతర్వాత ఎవడిదోవ వాడిది. మళ్ళీ అందరూ కలుసుకో వడమనేది సాధ్యంగాని విషయం

ఫలహారాలు పూర్తయ్యాయి. కాసేపు బాతాఖానీతో గడిపాం. పరస్పరం అభినందించుకోవడం, అడ్రెసులు తీసుకో వడం వగైరాలతో గదంతా ఓ సంతలా మారిపోయింది.

ఇంతలో విశాలరావుమాస్టారులేచి మమ్మల్ని నిశ్శ బ్దంగా ఉండమని కోరారు. మేము మారుమాటలేకుండా మాస్టారు చెప్పేమాటలను శ్రద్ధగా వినసాగాం:

"ఏ పురాకృత పుణ్యబలంవల్లనో నేడు మనమందరం ఇచట సమావేశం కావడం జరిగింది. ఒకసంవత్సరంపాటు మీరుచూపిన ప్రేమాదరాలకు, భక్తిప్రపత్తులకు మిమ్మల్ని అభినందిస్తున్నాను. మనక్లాసులో ఇప్పుడు ప్రతివిద్యార్థి శ్రద్ధగా చదువుతున్నాడు. 40మార్కులకు తక్కువవచ్చే వాళ్లెవరూ లేరు. వేణు లెక్కలు బాగాచేస్తున్నాడు. విశ్వ తెలుగులో మంచిఅభివృద్ధి చూపిస్తున్నాడు. భవిష్యత్తులో

కూడ ఇదేవిధంగా చదివి, సాటివారికి ఆదర్శంగా ఉండగలరని ఆశీర్వదిస్తూ ముగిస్తాను." మేమందరం చాలాసేపు సంతోషంతో చప్పట్లుచరిచాం.

"మనక్లాసులో ప్రతిఒక్కడు ఇంతబాగా చదవటానికి విశాలరావుమాస్టారే కారణమని నా అభిప్రాయం" చక్రిపాణి మాఅందరివంక చూస్తూ అన్నాడు.

"ఒక్కమాట" విశాలరావుమాస్టారు నవ్వుతూ అన్నారు. "చక్రిపాణి అభిప్రాయానికి చిన్నసవరణ ప్రతిపాదిస్తున్నాను. క్లాసుఅభివృద్ధి కేవలం మాష్టరుమీదే ఆధారపడదు. క్లాసులో బాగాచదివేవాళ్లూ, చదువంటే తలాయించేవాళ్లు వుంటారు. ప్రతివిద్యార్థి కష్టపడి చదవనిదే మాస్టారు మట్టుకు ఏంచేయగలరు ? మేము కేవలం చదవమని ఒకటికి నాలుగుసార్లు చెప్పేవాళ్ళమేగాని స్వయంగా చదివేవాళ్ళం కాదుగా..."

తదుపరి, మా క్లాసు వ్రాతపత్రికా సంపాదకుడు మధు క్లాసునుగూర్చి పత్రికలో పెద్ద వ్యాసం వ్రాయదలచానని చెప్పాడు

విశ్వం లేచి మాట్లాడసాగాడు: "నాకు తెలుగులో 40 మార్కులు రావడానికి మన క్లాసులో ప్రతి ఒక్కమిత్రుడు చూపిన ఆదరణే కారణం. ఈ విషయాన్ని నే నెన్నటికీ మరువలేను. మీకందరికీ కృతజ్ఞతాభివందనము లర్పిస్తున్నాను"

నేనిటువంటి మహదవకాశాన్ని జారవిడుచుకోకూడదనుకున్నాను. వెంటనే లేచి మాట్లాడడం ప్రారంభించాను: "ఒక సంవత్సరంపాటు మనమందరం యెంతో స్నేహపూర్వక

వాతావరణంలో మెలిగాం. స్నేహంలోని మాధుర్యం, త్యాగం నాకిప్పుడు అర్థమైంది. మన స్నేహితుడు చెడ దారిన పడిపోతుంటే అతడిని ఆ దారినుండి తప్పించడం, ఉత్తమ స్నేహితుని లక్షణం. విశ్వం విషయం మీ కందరకూ తెలిసిందే. విశ్వం బడికి రానప్పుడు, ఆ రహస్యాన్ని దాచడంలో నేను సహాయపడ్డాను. అందువల్ల విశ్వానికి ఉపకారంకంటె అపకారమే జరిగింది. ఉత్తమ స్నేహితు డెప్పుడూ నిష్కర్షగా మాట్లాడుతాడు. తోటివాణ్ణి సన్మార్గంలో పెట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాడు. విశ్వం తెలుగు అభివృద్ధి చేయడంలో నేను నా యథాశక్తిని తోడ్పడ్డాను. కనుక ఇప్పుడు నేను విశ్వానికి నిజమైన స్నేహితుడనని చెప్పుకు నేందుకు గర్విస్తున్నాను. మిత్రులందరకు నా శుభాకాంక్షలు సమర్పిస్తున్నాను."

"నిజం, నిజం" చక్రపాణి నా అభిప్రాయాన్ని సమర్థించాడు. పిల్లలందరు ఆమోదసూచకంగా పెద్దపెట్టున హర్షధ్వానాలు చేశారు.

టీపార్టీ అయిపోయింది. విశ్వం, తనకు తెలుగులో 40 మార్కులు వచ్చినట్లుగా తెలుగు మాష్టారిని ఓ చీటీమీద వ్రాసి ఇవ్వమని కోరాడు. మాష్టారు చిరునవ్వుతో, విశ్వం చెప్పినట్లుగా వ్రాసి సంతకం పెట్టి యిచ్చారు.

ఇంటిదారిపట్టాం. ఆ సాయంత్రం నా కెందువల్లనో చాల మనోహరంగా కన్పించింది. అన్ని సాయంత్రాలకంటె ఈ సాయంత్రంలో ఏదో ప్రత్యేకత వున్నట్లుగా తోచింది. మనసంతా ఏ చింతా లేకుండా నిర్మలంగా, సంతోషంగా

వుంది. నా పక్కన నడుస్తున్నాడన్న మాటేగాని విశ్వం ఈ ప్రపంచంలో లేడు. తన భవిష్యత్తును గూర్చిన ఊహా ప్రపంచంలో తీయని కోరికల తేరుమీద విహరిస్తూండవచ్చు. ఏమనుకున్నాడో ఏమో నడిచేవాడల్లా హఠాత్తుగా ఆగిపోయాడు. జేబులోంచి మాస్టారిచ్చిన చీటీసు తీసి ఆనందం ప్రతిఫలించేముఖంతో చూసుకుంటూ మురిసిపోతూ అన్నాడు:

"చూడు వేణూ! తెలుగులో నాకు '40' మార్కులు వచ్చాయి. ఈ అంకెకోసం ఎన్ని రోజులు శ్రమించాను, ఎంత ఆందోళన పడ్డాను. ఈనాటికది ఫలించినది. ఈ విషయం తెలిస్తే మా సుభద్ర పిన్ని, అమ్మ ఎంతగానో ఆనందిస్తారు తనకొడుకు యింతవాడయ్యాడు కదా అని మా అమ్మ యెంతో పొంగిపోతుంది. కాని ఇంతటితో నేను సంతృప్తిపడి చదవటం మానేస్తానని తలంచకు. ఇంకా కష్టపడి చదువుతాను. ఏనాటికైనా నన్నుచూసి మా అమ్మ గర్వించాలి. ఆనందాశ్రువులు రాలుస్తూ నన్ను హృదయపూర్వకంగా ఆశీర్వదించాలి.

నేనేమీ జవాబివ్వలేదు. విశ్వం చీటీని జేబులో పెట్టుకున్నాడు. నాభుజంమీద ఆప్యాయంగా చేయివేసి అన్నాడు:

"నాప్రియవేణూ! ఇది మార్చిమాసాంతం. అవునా! శిశిర ఋతువు వెళ్ళిపోయింది. వసంతలక్ష్మి వచ్చింది. ప్రతికొమ్మ ప్రతిరెమ్మకు ఏంతశోభ తెచ్చింది. పచ్చనిఆకులతో, అరవిచ్చిన పూవులతో, సెలయేటి ఆటలతో, చిలిపిపిట్టల పాటలతో– ఈ లోకమే ఒక సుందరస్వప్నంగా, అందాలసీమగా సాక్షాత్కరిస్తుంది..."

విశ్వం వసంతఋతువునుగురించి, దానివింతలనుగురించి కవివలె చెప్పుకుపోతున్నాడు. కాని నాకేమీ జ్ఞాపకంలేవు మాకు బడిలోజరిగిన సంఘటనల తాలూకు వృత్తాంతాన్ని యథాతథంగా వ్రాయసంకల్పించాను. ఆరోజునుంచి సెలవు లయినదాకా ప్రతిరోజు కొద్దోగొప్పో వ్రాశాను. జరిగిన సంఘటనలను సంపూర్ణంగా వ్రాయకపోయినా, ముఖ్యమైన వాటినిమట్టుకు సమగ్రంగా వ్రాశాను.

మరొకముఖ్య విషయమేమంటే నేను, విశ్వం నాల్గవ ఫారం మొదటితరగతిలో ప్యాసయ్యాము. ప్రతిసబ్జక్టులోను 50మార్కులకు తగ్గలేదు.

అంతే!

—సంపూర్ణం.—

